# చతుర

డిసెంబర్ 1999 * రూ.7/-



తనికెళ్ళ కల్యాణి గమ్యం



బొజ్జకృష్ణుడు - మైసూరీ పెయింటింగ్

# సచిత్ర విచిత్రం



## కవలలకి అమ్మయిన అమ్మమ్మ

ఎలిజబెత్ మేక్లమ్ (41) ప్రపంచంలో కవల టెస్ట్‌ట్యూబ్ బేబీలను కనిన మొట్టమొదటి అమ్మమ్మ.

ఆస్ట్రేలియాలోని సిడ్నీలో 1989, డిసెంబర్ 13న కింగ్ జార్జ్ ఫిఫ్త్ మెమోరియల్ హాస్పటల్‌లో టారా, స్కాట్ అనే కవలలు జన్మించారు. 36వ ఏటనే అమ్మమ్మ అయిన ఎలిజబెత్ తనకి నాలుగవ సంతానం పుట్టాక ట్యూబెక్టమీ ఆపరేషన్ చేయించుకుంది. అయితే విడాకులు తీసుకుని తిరిగి కెయిల్ (42)ని వివాహం చేసుకుంది. అతను పిల్లలు కావాలని కోరడంతో ట్యూబెక్టమీని రివర్స్ చేసే ఆపరేషన్ చేయించుకుంది. కానీ అది సఫలంకాలేదు. వాళ్ళ డాక్టర్ టెస్ట్‌ట్యూబ్ బేబీని కనవచ్చని చెప్పాడు. ఆ పద్ధతిలో తిరిగి గర్భవతి అయింది ఎలిజబెత్. టెస్ట్‌ట్యూబ్ బేబీ కేసుల్లో... డాక్టర్లెప్పుడూ ఒక ఎగ్ మాత్రమే తీశామనుకుంటారు కానీ రెండు ఎగ్స్‌తో కవలలు పుట్టడం ప్రపంచమంతా జరిగేదే. దాంతో... అప్పటికే అమ్మమ్మ అయిన ఎలిజబెత్ కవలల్ని కని, 'అమ్మమ్మయ్యాక కవలల్ని కన్న తొలి ఆస్ట్రేలియన్' గా రికార్డ్ స్థాపించింది.

# చతురకథలు

## చిన్నపిల్ల

హడావిడిగా హాస్పిటల్ కి వచ్చాడు అనంతరామయ్య. రోగులతో చాలారద్దీగా వుంది ఆసుపత్రి. సీరియల్ గా నెంబర్లు తీసుకొని డాక్టర్ గారి రాకకోసం ఎదురుచూస్తున్నారు పేషెంట్లు. ఆసుపత్రి స్టాఫ్ అందరితోనూ బాగా పరిచయమున్న అనంతరామయ్య తిన్నగా వెళ్లి రిసెప్షన్ లోవున్న అమ్మాయిని పలకరించాడు. "ఏమ్మా... మీ డాక్టరుగారు



ఇంకా రాలేదా? " అని.

"రాకపోవడమేమిటి సార్! ఉదయమనగా వచ్చారు. ఆపరేషన్లతో తలమునకలవుతున్నారు" నవ్వుతూ సమాధానం చెప్పింది ఆ అమ్మాయి.

"అర్జంటుగా డాక్టర్ గార్ని కలవాలమ్మా. ఈ రోజు వీలుపడుతుందంటావా? " అడిగాడు మళ్లీ.

"చూస్తున్నారుకదండీ. ఎంతమంది పేషెంట్లు డాక్టర్ గారి కోసం ఎదురు చూస్తున్నారో. ఇప్పటికింకా ఆపరేషన్లు తెమల్లేదు. మీకు అపాయింట్ మెంట్ దొరకడం కష్టమే అనుకుంటాను" చెప్పింది ఆమె.

"ఎలాగమ్మాయ్! ఈ రోజెలాగయినా డాక్టర్ శశాంకని కలవాలి. సరే... ఒక పని చేస్తాను. సాయంత్రం మళ్లీ వస్తాను. ఈ లోపు శశాంకకి నేను వచ్చినట్టు చెప్పి వుంచు. సాయంత్రం మాత్రం సీరియల్లో మొట్టమొదటి నెంబరు నాదేసుమా" అన్నాడు అనంతరామయ్య నవ్వుతూ.

"అలాగేసార్! మీ ఇంటర్వ్యూ అయిన తర్వాతే మరెవరైనా. సరిగ్గా అయిదు గంటలకల్లా వచ్చెయ్యండి" తనూ నవ్వుతూ చెప్పింది.

అనంతరామయ్య ఓ గవర్నమెంట్ ఆఫీసులో మంచి పొజిషన్ లో పనిచేసి రిటైరయ్యాడు. ఒక కొడుకు, కూతురూను. ఇద్దరికీ పెళ్లిళ్లు చేసేసాడు. ఉద్యోగరీత్యా కొడుకు





దూరంగా వుంటున్నాడు. అమ్మాయి అత్తవారూరు అనకాపల్లి. వైజాగ్‌లో స్వంత ఇంట్లో భార్యా, తనూ వుంటున్నారు. ఉద్యోగ విరమణ చేసినప్పటినుంచీ ఖాళీగా సమయం గడపాలంటే చాలా కష్టంగానే వుంటోంది. అయినా ఏదో ఒక పని పురమాయించుకుంటూ కాలం గడిపేస్తున్నాడు.

సాయంత్రాలు మాత్రం భార్యాభర్తలిద్దరూ సముద్రతీరానికి వ్యాహ్యాళికి వెళ్తారు. చీకటి పడేవరకూ అక్కడే గడుపుతారు. అదిగో అక్కడే వచ్చింది ఓ ప్రాబ్లమ్. ఆ ప్రాబ్లమ్ సాల్వేషన్ కోసమే డాక్టర్‌ని కలవడం.

సరిగ్గా సాయంత్రం అయిదు గంటలకల్లా హాస్పటల్‌కి వచ్చేసాడు. పేషెంట్ల రాక ప్రారంభమయింది. ఉదయం చెప్పినట్టుగానే తనకి మొదటి నెంబరే కేటాయించింది రిసెప్షన్‌లో అమ్మాయి. నర్స్ వచ్చి పిలవడంతో డాక్టర్ రూమ్‌లోకి వెళ్లాడు అనంతరామయ్య.

"రండి అనంతరామయ్యగారూ. ఉదయం వచ్చారటకదా! ఏమిటి ప్రాబ్లం" నవ్వుతూ పలకరించాడు డాక్టర్ శశాంక.

"ప్రాబ్లమేనోయ్ శశాంక. మా ఆవిడతో చాలా ఇబ్బందిగానే వుందనుకో"

"ఏమిటిసార్! ఏమంటున్నారు మా పిన్నిగారు? "

"బొత్తిగా చిన్నపిల్లలా ప్రవర్తిస్తోందనుకో ఈమధ్య"

"ఐస్‌క్రీములు గట్రా కొని పెట్టమంటున్నారా ఏమిటి? " బీచ్‌లో వాళ్ల అలవాట్లు తెలిసున్న శశాంక వేళాకోళం చేశాడు.

"అలాగన్నా బాగానేవుండును. బీచ్‌లో నేను ఇసుకలో గూళ్లు కడుతుంటే తను చిన్నపిల్లలా వాటిని పడగొట్టేస్తోందోయ్" అన్నాడు అనంతరామయ్య. "నువ్వే ఏదో మందిచ్చి మార్చాలిమరి"

**-సూరిపండు**

---

## దొంగ

"అబ్బా... రండీ. ఆఫీసు టైమవుతుంటే ఇంకా ఏం చేస్తున్నారు ఆ గదిలో కూర్చుని" వంటింట్లోంచి గట్టిగా అరిచింది కాంతం.

"ఇదిగో వచ్చేస్తున్నా! ఎందుకలా కొంపలు మునిగినట్టు అరుస్తున్నావ్. స్నానమే మిగిలింది. ఒక్క నిమిషంలో ముగించెయ్యనూ" అంటూ టవల్ అందుకొని బాత్‌రూంలో దూరాడు రాజారాం.

బాత్‌రూంలోనుంచి నీళ్లు పడుతున్న శబ్దం ఎంతకీ విన్పించకపోవడంతో అసహనంగా తిరుగుతోంది కాంతం వంటగదిలో. లోపలి గదిలోంచి ఏమన్నా కేకలు విన్పిస్తాయేమోనని బాత్‌రూం తలుపుకు చెవి ఆనించి నించున్నాడు రాజారాం.

"ఏమండీ స్నానం అవుతోందా..." అంటూ విసుగ్గా అరిచింది కాంతం.

"ఆc... ఆc... మొదలుపెడుతున్నా" అంటూ బకెట్‌లోంచి నీళ్లు చెంబుతో తీసుకొని తలపై గుమ్మరించుకున్నాడు రాజారాం. "ఇంత పకడ్బందీగా ప్లాన్ చేస్తుంది కాబట్టే తను పట్టుకోలేకపోతున్నాడు" మూలుక్కుంటూ స్నానం చేస్తున్నాడు.

పెళ్లికి ముందూ పెళ్లయిన తర్వాత కూడా జమా ఖర్చులు రాసే అలవాటు లేదు రాజారాంకి. వచ్చింది వచ్చినట్టుగా జీతమంతా పట్టుకెళ్లి బ్యాంకులో వేసేస్తాడు. అలాగే ఇతరత్రా వచ్చే ఆదాయాలన్నింటినీ కూడా ఖర్చులకి ఎప్పుడు కావాలంటే అప్పుడు బ్యాంకులోంచి డ్రా చేస్తుంటాడు. మిగిలిన కొద్దిపాటి మొత్తాన్ని జేబులో ఉంచుకుంటాడు చిన్నచిన్న ఖర్చులకోసం. ఎంత ఉందీ ఏమిటీ అన్న లెక్క చూసుకోడు. ఎందుకో ఈమధ్యన జేబులో వున్న డబ్బులు తగ్గుతున్నట్టుగా అనుమానం కల్గుతోంది.

అనుమానం కలగడంతో అబ్జర్వేషన్‌లో పెట్టాడు. తన అనుమానం నిజమే అన్నది ఋజువయింది. ఇంట్లో వున్నది తనూ, భార్య కాంతం, కొడుకు సంతోష్! భార్యని,



కొడుకునూ అనుమానించాలంటే మనసు ఒప్పడంలేదు. మరేమవుతున్నట్టు. ఇంటికి వచ్చే వారెవరూ లేరు. ఇంటిదొంగని ఈశ్వరుడైనా పట్టలేడంటారు. తన జేబు లోంచి డబ్బును సంగ్రహించే దొంగను పట్టడమెలా? కాంతాన్ని అడిగితే కయ్యి మని లేస్తుంది. స్వర్గంలాంటి ఇంటిని నరకం చేసేస్తుంది. కొడుకు నడుగుదామా అంటే వాడు 'ఫలానా ఖర్చుకి డబ్బులు కావాలినాన్నా' అంటూ నిర్మొహమాటంగా ఏం దాపరికం లేకుండా అన్నీ చెప్పి మరీ అడుగుతాడు. ఇంక వాణ్ణెలా అనుమానిం చగలడు.

ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు రాజారాం. ఆ నిర్ణయాన్ని అమ లుపర్చడానికి క్రితం రోజు సాయంత్రం పొలంగట్ల కేసిపోయాడు. వెతికివెతికి తనకి కావలసిన దాన్ని సంపాదించాడు. జాగ్రత్తగా భద్రపరచుకొని ఇంటి కొచ్చాడు.

ఆ ప్రయోగ ఫలితం కోసమే బాత్రూం లోంచి వినడంకోసం ఎదురు చూస్తు న్నాడు రాజారాం. నీళ్ళు పడే చప్పుడికి లోపలి నుంచి వచ్చే శబ్దాలు విన్పిస్తాయో లేదోనని స్నానానికి ఆలస్యం చేస్తున్నాడు.

కాంతం ఊరుకుంటుందేం. తను స్నానం మొదలుపెడితేనే కానీ తాను తన పనికి ఉపక్రమించదు. చెంబుతో నీళ్ల పోసుకుంటూ ఆలోచనల్లో మునిగిపో తున్న రాజారాం ఉలిక్కి పడ్డాడు 'కెవ్వు' మన్న కేకకి. గబగబా బాత్‌రూంలోంచి వంటగదిలోకి వచ్చేశాడు. "ఏమిటి కాంతం... ఏమయ్యింది? ఎందుకలా అరి చావ్?" అన్నాడు.

"అరవడం ఏమిటండీ? నేనెందుకరు




స్తాను?" అంటూనే పళ్లబిగువున బాధ భరిస్తున్నట్టుగా మెలికలు తిరుగుతోంది.

"అదేమిటి కాంతం అలా మెలికలు తిరి గిపోతున్నావ్?" అంటూ ఆమెను పట్టుకో బోయాడు రాజారాం.

"బాగానే వుంది గోల. నేను మెలికలు తిరగడమేమిటి? ముందా తలకాయ తుడుచుకుని తగలడండి. ఆనక జలుబు చేస్తే నా దుంప తెంచుతారు." అంటూ మామూలుగా వుండటానికి ప్రయత్నం





చేస్తోంది కాంతం.

జేబులోంచి బయటపడ్డ తేలు గుమ్మం మూలకు చకచకా పారిపోయింది.

"అమ్మో.. తేలు...తేలు..." అంటూ చెప్పు కోసం పరుగెత్తాడు రాజారాం.

**-సువర్చలాజ్యోతి.**

# తేల్బల

అడ్డదిడ్డంగా పెరిగిన అడవిలా ఉంటుంది మా క్యాంపస్. ఆ అడవిలో రకరకాల సాధు, మరియు క్రూర జంతువులు మాతో కలిసి సమిష్టిగా సహజీవనం చేస్తుంటాయి. పాములు, తేళ్ళు, మండ్రగబ్బలనబడే నల్లతేళ్లు వీటిలో ముఖ్యమైనవి.

మా క్యాంపస్ లో వీధిలైట్ల సౌకర్యం అంతంత మాత్రం. చీకటిపడ్డాక ఈవెనింగ్ వాక్‌కి వెళ్లడం మహాసాహసకృత్యమే.



ఓ సాయంత్రం అలా సాహసం చేసొచ్చాక ఆయాసపడ్తూ కుర్చీలో కూలబడ్డాను. "ఒరే! ఇవాళ కూడా మా వాకింగ్‌లో రెండు తేళ్లను చంపాంరోయ్. స్త్రీలు కూడా సబలలే అబలలుకాదు అని నిరూపించేసాం చూశావా" అన్నా మా తమ్ముడితో గర్వంగా.

"నువ్వు చంపావా?" అడిగాడు వాడు లాయర్లా.

"నేనంటే నేను కాదనుకో. సులోచనగారు తన సొంత చెప్పుతో దాన్ని టపటపా కొట్టి చంపుతూంటే టార్చి చూపిస్తూ నేనూ, రామలక్ష్మిగారు, సుభద్రగారు ధైర్యంగా అక్కడే నిలబడి ఆవిడ్ని ప్రోత్సహించాం" అన్నా.

వాడు మేధావిలా మొహంపెట్టి, "అంటే మీ నలుగురు స్త్రీలల్లోనూ ఒక స్త్రీ తేలుని చంపింది. అంటే ప్రతి నలుగురు స్త్రీలల్లోనూ ఒక స్త్రీ, అంటే ఒకటీ బై నాలుగు స్త్రీలు సబలలు. మిగతా స్త్రీలు అబలలు అని రుజువయింది" అన్నాడు వాడు పిచ్చిపిచ్చిగా లెక్కలు కడ్తూ.

నాకు తిక్కెత్తుకొచ్చింది. "నీమొహం" అన్నా ఇంకేం అనాలో తెలీక.

"ఎవరిమొహం అయినాసరే. ప్రతి నలుగురు స్త్రీలకీ ముగ్గురు అబల స్త్రీలున్నారని మాత్రం రుజువయింది" అన్నాడు మళ్ళీ.



వాడికి పురుషాహంకారం జాస్తి.

నాకొళ్ళు మండింది. "అయితే నేనొట్టి అబలననీ, ఆ మాత్రం తేలుని కూడా చంప లేననీ నీ ఉద్దేశవాః? " అనడిగా.

"ఉద్దేశంకాదు, సత్యం! నగ్నసత్యం!" అన్నాడు వాడు గోడమీది నగ్మా బొమ్మని నిశితంగా చూస్తూ.

"సరే, ఇవాళ అర్ధరాత్రి తొమ్మిదింటికి నిన్ను వాక్‌కి తీసుకెడతా. అప్పుడింకా బోళ్ళు తేళ్ళు కనిపిస్తాయ్. వాటిని చంపి స్త్రీ శక్తి నిరూపిస్తా" అన్నా వాడికేసి తీక్షణంగా చూస్తూ.

సరేనన్నాడు వాడు.

తొమ్మిదింటికి నడక మొదలెట్టాం. తేలు కోసం తీవ్రంగా వెతుకుతూ శ్రద్ధగా చూస్తూ నడుస్తుంటే రోడ్డుకడ్డంగా ఉన్న ఓ రాయి తగిలి ముందుకు తూలా. ఒక కాలి చెప్పు ఎగిరి ఎక్కడో పడిపోయింది.

పోతే పోయింది. గానీ రోడ్డుపక్కన చీకట్లో నల్లగా నిగనిగా మెరుస్తూ రెండు డెక్కలూ ఒక కొండేలాంటివి కలిగిన నల్లని ఆకారం కనిపించింది. ఖచ్చితంగా అది మండ్రకప్ప.

"ఒరేయ్ చూస్కో" అని మా తమ్ముడికి వార్నింగిచ్చి మిగిలిన ఒక చెప్పూ ఊడలాగి దాంతో ఆ ఆకారాన్ని టపటపా ఫటఫటా కొట్టడం మొదలెట్టా.

అలా ఎంతసేపు కొట్టానో తెలీదు. "అక్కా ఉండవే ఆగవే" అంటూ కేకలు పెడ్తూ మా తమ్ముడు నా చెయ్యి గట్టిగా పట్టుకుని ఆపబోయాడు.

నేను రెచ్చిపోయాను. వృశ్చిక సంహారం చేస్తుంటే వాడికి ఈర్ష్య, అసూయా వచ్చేసుంటాయి. కుళ్లు వెధవ...

కొట్టడం ఆపి, వీరావేశంతో ఊగిపోతూ "చచ్చిందా" అనడిగా.

వాడు ఒంగుని బురదలోంచి నాచెప్పు దెబ్బలకి హరీమని అణగారిపోయిన ఆ ఆకారాన్ని బయటికి లాగాడు. దాన్ని రెండు వేళ్లతో పట్టుకుని నాకళ్ళముందు ఊపుతూ అన్నాడు.

"అక్కా! ఇది నీ చెప్పు. నువ్వింతసేపూ నీ కుడికాలి చెప్పుని నీ ఎడంకాలి చెప్పుతో చితగ్గొట్టేసావ్" అన్నాడు గంభీరంగా.

"ఛీ... పాడు పురుషాధిక్య ప్రపంచం! స్త్రీ తన శక్తిని నిరూపించుకోవాలని ప్రయత్నిస్తే వెధవది తేళ్ళు కూడా సహకరించవు" అని నిట్టూర్చాను.

—పి. కృష్ణకుమారి

---

## ధాం!!

కార్గిల్ యుద్ధం ముమ్మరంగా సాగుతోంది. పాకిస్తాన్ సైనికులు, ఆఫ్ఘన్ టెర్రరిస్ట్‌లు, ఇతర చొరబాటుదారులు ఓ ట్రెంచ్‌లో కూర్చుని ఇండియన్ సైనికుల గురించి మాట్లాడుకుంటున్నారు.

"అటు వైపుంది సర్దార్జీ రెజిమెంట్. సర్దార్జీ జోకులెన్ని వినలేదు మనం? వాళ్ళని ఓడించడం తేలిక"

"సర్దార్జీ జోకులంటే? " అడిగాడు అబ్దుల్ అనే చొరబాటుదారుడు. అతను ఆఫ్ఘనిస్తాన్‌నుంచి రాబట్టి సర్దార్జీల జోకులు తెలీవు.

పాకిస్తాన్ సైనికుడు గఫూర్ చెప్పాడు ఆ చొరబాటుదారుడికి.

ఓ సర్దార్జీ సూపర్ బజార్‌కెళ్ళి సామాన్లు కొనుక్కుని కౌంటర్ దగ్గరికి వచ్చి బిల్ పే చేశాక అడిగాడు కేషియర్ని.

"ఫేట్ ఇవ్వలేదేః " అని.

ఏమిటి ఇవ్వాలి అని కేషియర్‌కి అర్థంకాక అడిగితే,

"ఫేట్" అన్నాడు సర్దార్జీ.

"ఫేటేమిటో కేషియర్‌కి అర్థంకాలేదు. వాళ్ళ మధ్య గొడవ విని స్టోర్స్ మేనేజర్ వచ్చి అడిగాడు సర్దార్జీని సమస్యేమిటని. వెంటనే సర్దార్జీ నూనె పేకెట్‌ని చూపించి





ఇక్కడేం రాసి వుందో చదువు అనడంతో 'ఫేట్ ఫ్రీ' అని బయటికి చదివాడు మేనేజర్.

"ఇది కొంటే ఫేట్ ఫ్రీ కాబట్టి ఫేట్ ఇవ్వమంటున్నాను" చెప్పాడా సర్దార్జీ.

"సర్దార్జీలు మరీ అంత చవటలా? " అడిగాడు మరో చోరబాటుదారు పగలబడి నవ్వి.

"అవును"

ఇదంతా సిక్ రెజిమెంట్ వాళ్ళకి వినపడింది.

అందరూ పళ్ళు పటపట కొరికారు.

వెంటనే ఓ సర్దార్జీ తమ తడాఖా వాళ్లకి చూపించాలనుకున్నాడు.

"క్యా సాలా? "

మరో తల కనపడగానే సర్దార్జీ చేతిలోని తుపాకీ ఢాం అంది. గఫూర్ కూడా మరణించాడు.

పాకిస్తాన్ సైనికులకి కాళ్ళలో వణుకు పుట్ట సాగింది.

"సాలె. సర్దార్జీ లోగోం ఇత్నా స్మార్ట్ కబ్ బనాయా? " అనుకున్నారు.

అదే ట్రిక్‌ని వాళ్లు సర్దార్జీల మీద ప్రయోగించారు.

"అరె గురుదేవ్‌సింగ్" పిలిచాడు పాకిస్తాన్ సైనికుడు.



"ఓయ్ అబ్దుల్" అని అరిచాడు. వెంటనే అబ్దుల్ ట్రెంచ్‌లోంచి తల బయటికిపెట్టి అడిగాడు,

"క్యా బే సాలా"

ఢాం!

అబ్దుల్‌ని మన సర్దార్జీ కాల్చిపారేశాడు.

"అరె కరీం" మళ్ళీ పిలిచాడు సర్దార్జీ.

"క్యా హై సాలా? "

ఈసారి ఇద్దరి తలలు బయటికి కనిపించాయి.

ఢాం! ఢాం!

ఆ ఇద్దరు కరీమ్‌లు మరణించారు.

"అరె గఫూర్ భాయ్"

నిశ్శబ్దం...

"ఓయ్ గురుదేవ్‌సింగ్... నిన్నే బే"

మళ్ళీ నిశ్శబ్దం.

"ఓ భాయ్ గురుదేవ్‌సింగ్"

"అరె గురుదేవ్‌సింగ్ అని ఎవర్రా పిలిచేది? " అరిచాడు గురుదేవ్‌సింగ్.

"నేనే. అష్రఫ్‌ని"

ఓ తల ట్రెంచ్‌లోంచి బయటికి వచ్చి చెప్పింది.

ఢాం!

అష్రఫ్ మరణించాడు.

**-డి. పద్మజ**

★

సంపుటి: 22
సంచిక: 11

# చతుర

డిసెంబర్
1999

"ఏమండీ! ఏనాడైనా ఈ ఆడంబరాలు కావాలని మిమ్మల్ని కోరానా? అంతస్థు సంపాదించమని ఒత్తిడి చేశానా?" అంది భార్య.

"ఏ ఆడంబరాలూ, అంతస్థులూ అఖ్ఖర్లేనపుడు ఏ గుమాస్తానో పెళ్లిచేసుకోలేక పోయావా? అసలు భార్యాపిల్లలను అపురూపంగా చూడాలనుకోవడం నా బలహీనత..." అని వాపోయాడు భర్త.

"ఈ లోకంలో అందరూ వాళ్ల వాళ్ల కుటుంబాలను హాయిగా పోషించుకుంటున్నారు. మీరు ఎన్నుకున్న మార్గంలో నడిచేది చాలా తక్కువమంది మాత్రమే..." అందామె.

తన ప్రాణసమానమైన భార్య... ఏనాడూ తనని పల్లెత్తుమాటనని ఇల్లాలు... అలా నిలదీస్తుంటే... అతడేం చేశాడు? అంతస్థు, హోదా కోసం అతడెన్నుకున్న మార్గం... చివరికి అతనిని ఏ గమ్యానికి చేర్చింది?

మానవీయ విలువలకి, మానసిక బలహీనతలకి మధ్య సంఘర్షణ

తనికెళ్ళ కల్యాణి రచన 'గమ్యం' డిసెంబర్ 'చతుర' సమగ్ర నవల.

# గమ్యం



— తనికెళ్ళ కల్యాణి

పక్షుల కిలకిలారావాలతో జగత్తు కళ్ళు విప్పుకొంటోంది. చల్లగా వీస్తున్న గాలులు ఆదమరిచి నిద్రిస్తున్న ప్రజలను మరింత సేద తీరుస్తున్నాయి. తొలికోడి తన కూత లతో లోకాన్ని మేలుకోమని హెచ్చరిస్తోంది. తూర్పుదిక్కు సూర్యుని రాకతో రాగరంజిత మవుతోంది.

వీధివైపునుండి విన్పిస్తున్న చీపురు శబ్దా నికి అన్నపూర్ణ నెమ్మదిగా కళ్లు తెరిచింది. అలమరలో ఎదురుగా కన్పిస్తున్న విఘ్నేశ్వ రుడికి నమస్కారం చేసింది. ప్రార్థనా శ్లోకా లన్నీ మనసులోనే చదువుకొంది. తర్వాత తన చేతులను చూసుకొంటూ "కరాగ్రే వస తేలక్ష్మీ..." అంటూ రెండు చేతులూ కళ్ళక ద్దుకొంది. మంగళసూత్రాలను కళ్లకద్దు కొంటూ పక్కనున్న భర్తవైపు చూసింది.

చంద్రమౌళి గాఢమైన నిద్రలో ఉన్నాడు. అతడికి నిద్రాభంగం కలగకుండా లేచి ఇవ తలకి వచ్చింది. స్టడీరూంలో పెద్దవాళ్ళి ద్దరూ చదువుకోవడం గమనించి తృప్తిగా వీధివాకిలివైపు నడిచింది. గౌరి అప్పటికే వీధివాకిలి కడుగుతోంది. అన్నపూర్ణ సుద్ద ముక్క తీసుకొంది. "అమ్మగారూ! నేను ముగ్గులు పెడతాను. మీరు కాసేపు పడు కోండి" అంటున్న గౌరిని అభిమానంగా చూస్తూ "ఫర్వాలేదులే! నేను ఈ పనిచేసే లోగా నువ్వు పెరటిగుమ్మం కడుగు" అంది.

తన పిల్లల్లాగే హాయిగా పడుకోవలసిన వయసులో పని పైన వేసుకొని నిద్రక ళ్ళతో కన్పిస్తున్న గౌరిని చూస్తే అన్నపూ ర్ణకి జాలివేసింది. సుద్దముక్కతో చకచకా ముగ్గులేస్తున్న అన్నపూర్ణని, ఆమె సన్నటి వేళ్ళ కదలికలను ఆరాధనగా చూస్తూ నిల బడింది గౌరి.

అన్నపూర్ణ వేసే ముగ్గుని పరీక్షగా చూస్తూ "అమ్మో! అమ్మగారికి ఎన్ని ముగ్గులు వచ్చో? తనకి అందులో సగం కూడా రావు. అమ్మగారైతే వేసిన ముగ్గు వేయకుండా వేస్తారు" అని గర్వంగా అను కొంది.

గౌరి సరదా పడుతోందని పెరటిగుమ్మం దానికి వదిలి, తులసికోట దగ్గర ముగ్గుపె ట్టుకొని అన్నపూర్ణ ఇంట్లోకి నడిచింది. తల్లిని చూసి పెద్దకొడుకు వేణుగోపాల్ "అమ్మా! ఎంత లేపినా తమ్ముడు నిద్ర లేవ లేదు. నువ్వే వెళ్ళి లేపు" అన్నాడు. రెండవ కొడుకు నందు వెంటనే అందుకొని "వాడికి ఈమధ్య బద్ధకం మరీ ఎక్కువ అవుతోంది. ఆటలు ఆడమంటే మాత్రం ఏ బద్ధకం ఉండదు" అన్నాడు చిరాగ్గా. అన్నపూర్ణ మందలిస్తున్నట్లుగా వాళ్ళని చూసి చిన్నకొ డుకు గదివైపు నడిచింది. పెద్ద పిల్లలిద్దరూ చెరొకగది తీసుకొంటే కృష్ణమోహన్ చెల్లికి, తనకి ఒకేగది చాలంటాడు.

అన్నపూర్ణ కృష్ణ మంచంవైపు చూసి నవ్వుకుంది. అన్నలతో పోట్లాడి తల దగ్గర ఒకటి, కాళ్ళ దగ్గర ఒకటి వేసుకున్న రెండు తలగడలూ కింద పడిపోయాయి. కప్పు కొన్న దుప్పటి అస్తవ్యస్థంగా ఉంది. అన్న పూర్ణకి అతడిని చూస్తుంటే నిద్ర లేపాలని పించలేదు. ఈ నిద్రాసుఖాన్నించి తను వాడిని ఎలా దూరం చేయగలదు? పెద్దవా ళ్ళిద్దరూ అలారం పెట్టుకుని నిద్ర లేస్తారు.

కిందపడిన తలగడను తీసి, అతడి తల ఎత్తి నెమ్మదిగా అమర్చింది. "ఒరేయ్! బౌలింగ్ సరిగా చేయకపోయావో కాలూ చెయ్యా విరిచేస్తాను" అంటూ కృష్ణ నిద్రలో కలవరిస్తున్నాడు.

అన్నపూర్ణ కొడుకు మొహంవైపు చూసింది. పని హడావుడి ఆమెకు ఆ క్షణంలో గుర్తుకు రాలేదు. తెల్లగా, అందంగా, అమాయకంగా కనిపిస్తున్న కృష్ణ మోహన్ మొహం ఆమెకి ఆ సమయంలో ఎంతో నచ్చింది. మొహంపై పడుతున్న ఉంగరాల జుట్టును ప్రేమగా సవరించింది. పక్కకి తొలగిన దుప్పటితీసి అతడికి కప్పింది. పక్కమంచంమీద పడుకున్న




కూతుర్ని ఒకసారి చూసి వచ్చేసింది.

కాలకృత్యాలు తీర్చుకుని, స్నానంచేసి, పూజ చేసుకుని వచ్చిందో లేదో "పూర్ణా! పూర్ణా!" అంటూ చంద్రమౌళి పిలుపు విని పించి గబగబా అటు వెళ్ళింది.

మరొకసారి అతడు పిలవబోయేలోపే ఆమె ఎదురుగా కన్పించింది. చంద్రమౌళి ఆమెని చూసి తృప్తిగా నవ్వాడు. "వచ్చే లోపే ఇన్ని పిలుపులా?" ఆమె కినుకగా అడిగింది. అతడు కొంటెగా నవ్వుతూ "పిలుస్తానని తెలిసినపుడు వెంటనే రావచ్చుగదా" అన్నాడు.

"నాకేం రెక్కలు లేవు ఎగిరి వచ్చి వాలి పోవడానికి" అతడు చాచిన చేతుల్లో ఒదిగి పోతూ అంటున్న ఆమెను ప్రేమగా చూశాడు. "లేవగానే నువ్వు నా కళ్ళకు కన్పిస్తే ఆరోజు నా పనులన్నీ దిగ్విజయంగా జరుగుతాయి. కనుక నీ అన్ని పనులకన్నా ఇది అర్జెంటు పనని తెలుసుకోవోయ్"

అతడి గుండెలమీద తలవాల్చి మెల్లిగా అంది "అదే వద్దంటున్నాను. మీకు తృప్తినీ, శాంతినీ ఇచ్చేది నేను కాదు, ఆ దేవదేవుడు. లేవగానే ఆయనను చూస్తే మన జన్మ ధన్యమైనట్లే"

చంద్రమౌళి భార్యను లేవదీసి నవ్వుతూ అన్నాడు. "నీలాగ నేను ఓపిగ్గా పూజలు చేయకపోవచ్చును. కానీ ఆ దేవుళ్ళ పేర్లన్నీ రోజూ పలుకుతూ ఉన్నాను" అన్నాడు.

వంట ఇంట్లో శాంతమ్మ టిఫిన్ ఏర్పాట్లు చూస్తోంది. అన్నపూర్ణ తయారవుతున్న ఇద్దరు కొడుకులనూ చూసింది. కృష్ణ, లలిత లేవకపోవడం గమనించి మళ్ళీ అటు తిరిగింది." ఎన్నిసార్లు చెప్పినా పెందరాళే లేవవేమిటిరా? ఇంట్లో అందరూ తెమిలిపోతున్నా నీకు చీమ కుట్టినట్లయినా ఉండదు." ఆమె చిరాగ్గా అంటూ కొడుకు దుప్పటి లాగేసింది.

కృష్ణమోహన్ బద్ధకంగా కళ్ళు విప్పాడు.

"అబ్బబ్బ. ఎప్పుడు లేస్తావు? ఎప్పుడు చదువుకొంటావు? అన్నలు చూడు. ఎలా బుద్ధిగా తెములుతారో?"

కృష్ణమోహన్ మళ్ళీ దుప్పటి లాక్కొంటూ "ఒకరితో పోటీ ఏమిటమ్మా! మన దారి మనది. నిద్రపోతున్న వాడిని లేపడానికి నీ మనసు ఎలా ఒప్పిందమ్మా?" అని ప్రశ్నిస్తోంటే అన్నపూర్ణకి ఒళ్ళు మండింది. "అలాగే నిద్రపో. నేను వెళ్ళి మీ నాన్నగారిని పంపిస్తాను" అంది.

తల్లి మాటలకి అదిరిపడి, బతిమాలుతున్నట్లు "మనమధ్య ఆయన ఎందుకమ్మా! అనవసరంగా పొద్దున్నే క్లాసు! చిటికెలో తెమిలిరానూ?" అంటూ మంచం దిగాడు.

"లలితా! ఎన్నిసార్లు లేపాలే! లే" అంటూ కూతురుని పిలుస్తోంటే కృష్ణమోహన్ అడ్డుపడుతూ, "చెల్లీ, నేను కలిసివస్తాం. నువ్వు పదమ్మా" అంటూ పంపించేశాడు.

చెదిరిన తల దువ్వుకొని అద్దంలో తన రూపాన్ని చూసికొని, ఒకసారి వెక్కిరించి చెల్లివైపు తిరిగాడు.

ఈ గొడవేం పట్టనట్లు నోట్లో వేలు పెట్టుకొని పడుకున్న చెల్లిని చూస్తే కృష్ణకి నవ్వు వచ్చింది. అమ్మ దీని నోట్లోంచి వేలు తీయించాలని శతవిధాల ప్రయత్నించింది. పగలు తమ బలవంతంవలన మానినా, రాత్రిళ్ళు మాత్రం ఆ పనిమానదు. చెల్లెలంటే అతడికి తగని ప్రేమ. ముద్దులాడుతూ ఆమెను లేపాడు.

లలిత లేచిన పావుగంటకి టైము చూసుకొని, "అయ్యయ్యో" అంది. కృష్ణమోహన్ ఏమిటన్నట్లు చూశాడు.

"అన్నీ నువ్వు ఇలాగే చేస్తావు చిన్నన్నయ్యా. ఈ లేపేవాడివి ఒకగంట ముందు లేపవచ్చునుకదా! నా హోంవర్క్ ఉండిపోయింది. ఇప్పుడు ఎలా?" దిగు

లుగా అంది.

చెల్లి ఏడుపు మొహం చూస్తే అతడికి జాలివేసింది. "ఇప్పుడేమయింది? నువ్వు లేచి త్వరగా తెములు. నేను నీకు హోంవర్క్ చేసి పెడతాలే" అంటూ అభయమిచ్చాడు.

లలిత అతడి భుజం చుట్టూ చేతులువేసి ఊగుతూ "మా చిన్నన్న ఎంత మంచి వాడో? " అంది.

"మా లల్లి ఎంత మంచిదో, చిన్నన్నచేత మళ్ళీ ఆరవతరగతి చదివిస్తోందికదా" అంటూ నవ్వేశాడు.

డైనింగ్‌టేబుల్ దగ్గర చంద్రమౌళి, నందు టిఫిన్ తినడానికి రెడీగా కూర్చున్నారు. "పూర్ణా! టైముకి తెమలడం నేర్చుకోమని నీ ముద్దుల కొడుక్కి చెప్పు." ఆయన ఒకింత కోపంగా అన్నారు. కృష్ణమోహన్, చెల్లెలితో కలిసి వచ్చేశాడు. అతడి చేతిలో లలిత హోంవర్క్ పుస్తకం ఉంది. అది చూసి ఆయన భృకుటి ముడిపడింది. "చంటీ! ఎప్పుడూ నువ్వు చేస్తోంటే దానికి ఆ లెక్కలు అవీ ఎలాగ వస్తాయి? ఇది మంచి పద్ధతి కాదు" అన్నాడు.

అంతకంటె బిడ్డలను మందలించడం ఆయనకి రాదు. కూతురికి కూడా సున్నితంగా ఆ విషయమే చెప్పారు. వేణుగోపాల్ వస్తూనే "సారీ డాడీ! బుక్స్ సర్దుకొనేటప్పటికి కాస్త లేట్ అయింది" అని సంజాయిషీగా అన్నాడు.

ఆయన మెరిసే కళ్ళతో పెద్ద కొడుకుని చూశారు. తనలాగే అడుగడుగునా ఫార్మాలిటీస్ పాటిస్తాడు. బట్టలు నలగనివ్వడు. తల చెరగనీయడు. ఎప్పుడు చూసినా ఫ్రెష్‌గా ఉంటాడు. ఆయన దృష్టి ఆ పక్కనే కూర్చున్న కృష్ణమోహన్‌మీద పడింది. దుస్తులు ధరించడంలో కూడా శ్రద్ధపెట్టడు. అని విసుక్కొన్నాడు మనసులో.

టిఫిన్ ప్లేటు చూసేటప్పటికి కృష్ణమోహన్‌కి ఒళ్ళు మండింది. నెయ్యిగిన్నె పుచ్చుకొని కాస్త దూరంగా నిల్చున్న శాంతమ్మగారిని చూసి విసురుగా అన్నాడు. "ఈ మాత్రం టిఫిన్ కోసమేగా, టిఫిన్‌కి రండి, టిఫిన్‌కి రండి అని పదిసార్లు కేకలు. నాకు తెలియక అడుగుతాను. ఈ పెసరపప్పు, అన్నం కలిపి ఉడకబెట్టేస్తే, పెద్ద టిఫిన్‌లాగ అయిపోతుందా? దీనికి ఒక కొబ్బరి చెట్నీ కూడా ఛీ...ఛీ" అంటూ చిరాకు పడుతున్న కొడుకుని అన్నపూర్ణ మందలింపుగా చూసింది. అయినా అతడి మొహం అప్రసన్నంగానే ఉంది.

"చిన్నన్నయ్య, పెద్దన్నయ్య, నాన్నగారు ఎలా తింటున్నారు. నువ్వు ఇలా అల్లరి చెయ్యవచ్చునా? " తల్లి మాటలకి కృష్ణ చిరాకుగా చూశాడు. "బావుంది. నన్ను అల్లరి పెడుతున్నది ఆవిడ. పిచ్చివన్నీ చేసి తినమంటే ఎలా? ఏ పూరీలో, ఉల్లిదోశలో చెయ్యవచ్చునుకదా"

అన్నపూర్ణ శాంతంగా "ఈ పూటకి తిను. రేపు మీకు కావలసినవి చేయిస్తాను" అంది. చంద్రమౌళి కల్పించుకొంటూ అన్నాడు "పూర్ణా! పిల్లలకి ఏది కావాలంటే అదే చెయ్యవచ్చును కదా! వాళ్ళని ఎందుకు ఇబ్బంది పెడతావు? "

వంటావిడ మొహం మాడ్చుకొంది. దేనికి ఈ అబ్బాయి పేచీ పెట్టడు? ఉప్మా చేస్తే ఉప్మా ముద్ద చేసి కష్టపడి పోయారా అంటాడు. సేమ్యా ఉప్మా అంటే పాములాగ అవెక్కడ దొరికాయంటాడు. సులువుగా చేసి తెములుదామంటే పడనీయడు. ఆవిడ చిరాగ్గా వంటింట్లో తిరుగుతుంటే పూర్ణకి కష్టమేసింది.

వెధవ తినేదీ ఉండదు, ఏడ్చేదీ ఉండదు... ఇంట్లో గోల తప్పించి అనుకొంది. మధ్యాహ్నం భోజనాలలోకైనా వాడికి నచ్చినవి చేయించాలనుకొంది. చంద్రమౌళి ఆఫీసుకి వెళ్ళేవరకూ అతడికి





కావలసినవి చూసి పంపించేసింది. అమ్మయ్యా ఖాళీ దొరికిందనుకొని సోఫాలో కూర్చోబోతోంటే పెద్దాడపడుచు, భర్త పిల్లలతో ఆటో దిగుతోంది. అన్నపూర్ణకి గుండె దడదడలాడింది. ఆవిడ వచ్చిందంటే ఏదో ఒక ప్లాను లేనిదే రాదు.

"ఈ వెధవ ఆటోలు ఎక్కలేక చస్తున్నాను. దర్జాగా కారు కొనమని మా తమ్ముడికి చెప్పాలి" అంటూ ప్రియంవద లోపలికి వచ్చింది. మరదలు అందిస్తున్న మంచినీళ్లు తాగుతూ పరిసరాలొక్కమారు చూసిన ఆమె మొహం ముడుచుకొనిపోయింది. 'హాయిగా వంటావిడ వండి పెడుతుంటే ఏ పనీలేక ఖాళీగా కూర్చుని సుఖపడుతోంది. తామేమో ఇళ్ళల్లో వంచిన నడుం ఎత్తకుండా పనిచేయలేక చస్తున్నాం. అందుకే అంటారు కాబోలు అదృష్టవంతులను పాడుచేసే వారుండరు. నిర్భాగ్యులను బాగుచేసేవారుండరని' అనుకొంటూ పైకి మాత్రం "మరదలా! బాగున్నావా? అయినా నువ్వు బావుండకేం కనుసన్నల్లో మెలిగే పనివాళ్ళు, వంటవాళ్ళు మా తమ్ముడు మహాముద్దు చేస్తాడు. నీకేం మహారాణివి" అంది.

గౌరికి అన్నపూర్ణంటే ప్రాణం. "మా అమ్మగారు ఎప్పుడూ ఖాళీగా కూర్చోరు. ఏదో ఒకపని మాతోపాటు చక్కపెడుతూనే ఉంటారు" అంది. ఆవిడను ఎవరేమన్నా దానికి కోపం వస్తుంది.

ప్రియంవదకి ఒళ్ళు మండిపోయింది. వేలెడంత లేదు ఈ గుంటముండ కూడా తనకి బదులు చెప్పడమే. ఎక్కడో పాకలో పడుండవలసినదానిని తమ్ముడు, మరదలు నెత్తికెక్కించుకొంటున్నారు. విసురుగా ఆ పిల్లని చూస్తూ అంది. "ఒసేవ్! పుల్లారుబుడ్డిలాగ అన్నింటిలో తలదూర్చావంటే ఊరుకోను. నౌకర్లు నౌకర్లులాగ పడుండాలి. తెలిసిందా? " అంది.

గౌరి చిన్నబుచ్చుకొని తలదించుకోవడం అన్నపూర్ణకి కష్టమే కలిగించింది. ఈవిడ వెళ్ళేంతవరకూ గౌరే కాదు. తను కూడా జాగ్రత్తగా ఉండాలి.

సాయంత్రం చంద్రమౌళి వచ్చి అక్కగారి కుటుంబాన్ని చూసి ఆనందించాడు. ఇద్దరూ సోఫాలో పక్కపక్కన కూర్చుని బోలెడు కబుర్లు చెప్పేసుకొన్నారు. ఆవిడ వచ్చిందంటే మొత్తం బంధువులందరి కబుర్లు తెలుస్తాయి.

అన్నపూర్ణ కజ్జికాయలు, చేగోడీలు ప్లేట్లలో పెట్టి తెచ్చి అందరికీ ఇచ్చింది. చంద్రమౌళికి కజ్జికాయలంటే ఎంతో ఇష్టం. అడుగడుగునా తన ఇష్టాలను తీర్చే భార్యంటే మరీ ఇష్టం. వెంటనే "పూర్ణా! నువ్వు కూడా తెచ్చుకో" అన్నాడు. "మీరు తింటూ ఉండండి. కాఫీలు పట్టుకొని వస్తాను"అంది.

శాంతమ్మగారు "మీరు కూడా వెళ్ళండమ్మా" అన్నా అన్నపూర్ణ విన్పించుకోలేదు. ఆవిడా పెద్దావిడే. ఒక్క మనిషి అందరినీ సమర్థించుకోవడం కష్టంకదా! అందులో అందరూ ఒక ఐటమ్ తీసుకోరు. ఒకరు కాఫీ, మరొకరు బోర్నవిటా. ప్రియంవద భర్తకి టీ కావాలి. అందుకే ఎవరికి అలవాటైనవి వాళ్ళకి తెచ్చి ఇస్తుంది పూర్ణ.

అన్నపూర్ణ టిఫిన్‌ప్లేటు తెచ్చుకొనే వరకూ నెమ్మదిగా తింటూ కూర్చున్నాడు చంద్రమౌళి. పూర్ణకి అతడు ఇచ్చే గౌరవం, ఆమె పట్ల కనబరచే ప్రేమ ప్రియంవదకి చిరాకు తెప్పిస్తుంది. అయినా నోరు విప్పదు. తన పనిని సాధించుకోవాలంటే తమ్ముడిని మంచి చేసుకోవాలి. తప్పదు. అందుకే గమనించనట్లూరుకొంది.

ప్రియంవద నెమ్మదిగా నోరు తెరిచింది. "తమ్ముడూ! ఒకపనిమీద నీ దగ్గరికి వచ్చానురా! మీ బావగారిని కలర్ టి.వి. కొనమంటే ఈ బ్లాక్ అండ్ వైట్ టి.వి. చాలదా? ఇది బాగానే వస్తోందికదా అంటు

న్నారు. పిల్లలేమో క్రికెట్ మేచ్‌లు, అవీ కల ర్‌లోనే బావుంటాయని పేచీ"

ప్రియంవద భర్త అందుకొన్నాడు. "చంద్రం! పిల్లల కోరిక కాదయ్యా! మీ అక్క గారి కోరికే అది. ఆవిడ సినిమాలు ఇందులో చూడలేదుట. ఆవిడ కోరికలకి అంతులేదు. ఒకదాని వెనక ఒకటి ఊరు తూనే ఉంటాయి. అవి తీర్చడం నావల్ల కాదు"

భర్త మాటలకి ప్రియంవద అడ్డుకట్ట వేసింది. "మీరు కొననన్నారు. ఊరు కోవ చ్చుకదా. నా పుట్టిల్లు నాకింకా ఉంది. మా తమ్ముడు మీలాగ పిసినారి కాడు. నువ్వే చెప్పరా! వయసులో ఉన్నప్పుడు కోరికలు తీర్చుకోకపోతే వయసుడిగాక తీర్చుకొం టామా? అదీగాక పిల్లలు ఫ్రెండ్సింటికి దానికోసం పోతున్నారు"

వాళ్ళ కబుర్లు వింటున్న నందగోపాల్‌కి ఒళ్లు మండింది. "మీ పిల్లలు చదువుకోరా అత్తయ్యా! క్రికెట్టు ఆట చూడటమే పనా? మావయ్యగారు అవకాశం చూసుకొని కొంటానన్నారుకదా" అన్నాడు.

ప్రియంవదకి నందు మాట్లాడటం నచ్చ లేదు. "ఆరి భడవా! మీ నాన్న సంపద నంతా నేనేం మోసుకెళ్ళిపోవడం లేదు" అంది.

నందు కూడా తక్కువ తినలేదు. వెంటనే అన్నాడు. "ఏమో! అత్తయ్యా! కిందటిసారి నువ్వు గాజులు ఒకజతే ఉన్నాయని నాన్న దగ్గర పదివేలు అడిగి పుచ్చుకోలేదూ?" గుర్తుచేశాడు.

ప్రియంవదకి గొంతుకి అడ్డుపడ్డట్లయింది. తమ్ముడు తనకిచ్చేవన్నీ ఈ వెధవలు లెక్క పెడుతున్నారు కాబోలు. పైకి మాత్రం నిష్ఠూరంగా చూస్తూ అంది. "ఏదో నిన్ను పెంచి పెద్దచేశానుకదా! నువ్వా ఇంజనీరుగా రెండు చేతులతో సంపాదిస్తున్నావని వచ్చా నురా! అక్కా తమ్ముళ్ళబంధం ఇలాగ పలు చనవుతుందనుకోలేదు. వీళ్ళు కూడా మాట్లా డేవాళ్ళే?"

నందు నవ్వుతూ తండ్రివైపు చూసి అన్నాడు. "నాన్నగారూ! మిమ్మల్ని మీ అన్నయ్యలు పెంచి పెద్ద చేశామంటారు ఒకపక్క. మరొకపక్క మీ అక్క పెంచి పెద్ద చేశానంటుంది. ఒక్క మనిషిని ఎందరు పెంచి పెద్ద చేశారేం? ఈ వరస బావుంది"

వెంటనే అన్నపూర్ణ కల్పించుకొంది. "నందూ! పెద్దవాళ్ళ కబుర్లలో నువ్వు ఎందుకురా నీ గదిలోకి వెళ్ళి చదువుకో" అని మందలించింది. నందు అక్కడి నుండి కదలలేదు.

చంద్రమౌళి భార్యవైపు చూసి అన్నాడు. "చిన్నవాడు. మేనత్తకదా అని ఏదో అంటు న్నాడు. సరదాగా తీసుకోక కసురుతావేం"

కొడుకు మాటలు తమ్ముడు తేలికగా తీసి పారెయ్యడం ప్రియంవదకి నచ్చలేదు. అలాగని తగాదా పెట్టుకోలేదు.

"చూడు తమ్ముడూ! పిల్లల్ని అదుపాజ్ఞ లలో పెంచాలి. మావాళ్ళు చూడు నేను కళ్ళు ఎర్రచేస్తే పెదవి విప్పరు. తండ్రి, తల్లి మందలింపులు లేకపోతే పిల్లలు చెడిపో తారు సుమా!"

చిన్నవాడు కృష్ణమోహన్ ఆవిడవైపు చూసి "ఇదిగో పెద్దత్తా! ఆయన ఎలాగో నీకు కావలసినవి ఇచ్చి పంపిస్తారు. దీనికి మేమేదో చెడిపోతామని దీవెనలు ఎందుకు? బావలు చేసే అల్లరి మాకు తెలి యదనుకొంటున్నావా" అన్నాడు.

ఆ రాత్రి ప్రియంవద అసహనంగానే ఉంది. మర్నాడు ఉదయమే వెళ్ళిపోతానని కూర్చుంది. చంద్రమౌళి ఆమెను, బావగారిని నాల్గురోజులుండమని బతిమాలాడు. చివర్లో తమ్ముడి కోసం ఉంటున్నట్లు ఆవిడ రెండు రోజులుండి, సకలమర్యాదలు చేయించుకొని తమ్ముడిచ్చిన పదివేలు తీసుకొని వెళ్ళింది.




మరో వారంలో మిగిలినవి డ్రాఫ్ట్ పంపుతానని అతడు మాట ఇచ్చాడు.

అన్నపూర్ణ దగ్గర వేణుగోపాల్ గొణిగాడు. తనకి వేరే ఒక స్కూటర్ కావాలంటే పట్టించుకోరు. కాలేజీకి బస్సులలో వెళ్లవలసివస్తోంది. అక్కగారికి మాత్రం వెంటనే అడిగినంత డబ్బు ఇస్తారు. కంప్యూటర్ ఇంజనీరింగ్ మొదటి సంవత్సరం చదువుతున్న అతడికి ఫ్రెండ్సుందరిలో బస్సులో తిరగడం చిరాగ్గా ఉంది. అన్నపూర్ణ సర్దిచెప్పినా వాళ్ళు సమాధానపడలేదు.

ఎంత ఇంటి ఆడపిల్ల అయినా తరచు వచ్చి డబ్బు పట్టుకొని పోవాలా అని వారి వాదన. తమ అవసరాలు తీర్చకుండా బయటివారికి ఎందుకు ఇవ్వాలి?

అన్నపూర్ణ ఏం మాట్లాడగలదు? తన భర్తకి గల బంధుప్రీతి ఆమెకి తెలుసును. తనవాళ్ళకి డబ్బు ఇవ్వవద్దని తను చెప్పగలదా? తనవలన కాదు. అసలు అతడికి ఎదురుచెప్పడమే తనకి ఇష్టం ఉండదు. అందరితో మంచిగా ఉండాలని అతడి తపన. ఆయనకి ముగ్గురు అన్నలు, ఇద్దరు అక్కలు. ఈయనే చివరివాడు. అంత పెద్ద కుటుంబం తనకున్నందుకే ఆయన పొంగిపోతాడు.

చంద్రమౌళి తల్లి అతడు హైస్కూలు చదువు సాగిస్తున్నప్పుడే పోయింది. అన్నయ్యలు, వదినలు, అక్కలు అతడిని అభిమానంగా చూశారని అతడికి కృతజ్ఞత. అలాగంటే ఈ పిల్లలు ఊరుకొంటారా? "తాతగారు డబ్బు పెట్టి చదివించారు. వాళ్ళెవరైనా చదివించారా? ఉత్త అభిమానం ఎవరూ చూపించరు" అని వాదిస్తారు.

ఎప్పుడూ చుట్టాల రాకపోకలు పిల్లలకి చిరాకు తెప్పిస్తోంది. చుట్టాలు వచ్చారంటే ఇల్లంతా సందడే. అదనపు ఖర్చు, అదనపు శ్రమ. అయినా అలాగ తరచూ వచ్చి వారాలు, వారాలు ఎలా ఉండిపోతారో అని నందు విసుక్కొంటాడు. "అమ్మా! తెప్పలుగా చెరువు నిండిన కప్పలు పదివేలు చేరుకదరా సుమతీ! అన్నట్లు నాన్నగారి దగ్గర డబ్బుందని వచ్చి ఇలాగ వాలుతున్నారు. ఇంతకీ వాళ్ళ ప్రేమ ఎవరిమీద?" అంటూ నవ్వుతాడు. నందుకి, కృష్ణమోహన్‌కి అసలు భయమనేది లేదు. మనసులో ఉన్నది స్పష్టంగా చెప్పేస్తారు. నందు తండ్రి దగ్గర కూడా తన అభిప్రాయాలు చెప్పేస్తాడు. కృష్ణమోహన్‌కి మాత్రం తండ్రి దగ్గర భయం.

వేణుగోపాల్‌ది అదొక తత్వం. దేన్నీ సీరియస్‌గా తీసికోడు. తన చదువుగోల తప్ప ఏదీ పట్టదు. అన్నపూర్ణ ఎప్పుడైనా "అన్నయ్య చూడు! నీలాగ వాదిస్తున్నాడా?" అంటుంది. వెంటనే నందు "వాడెందుకు వాదిస్తాడమ్మా! వాడు చదువులో మునిగాడా లోకం తలకిందులైనా వాడికక్కర్లేదు. నాకు ఇల్లు ప్రశాంతంగా ఉండకపోతే చిరాకు. చదవబుద్ధి కాదు" అంటాడు.

అన్నపూర్ణ కూడా ఊరుకోదు. "నాన్నగారు మన ఇంటి యజమాని. ఆయన ఇష్టాలు మనం గమనించవద్దా? ఆయన బంధువులని మనం గౌరవించవద్దా?" అంటుంది.

నందు రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెట్టి, "అమ్మా! ఆయనకో పెద్ద బలగం, నీకంత కన్నా పెద్ద బలగం. మీ ఇష్టం. మీ చుట్టాలిష్టం. నా గదివైపు వచ్చి నన్ను వాళ్ళు ఇబ్బంది పెడితే మాత్రం ఊరుకోను" అన్నాడు.

కృష్ణమోహన్ వాళ్ళని చూసి "మీకన్నా నేను అదృష్టవంతుడిని. వాళ్ళ విషయాలే నాకు పట్టవు" అంటాడు. దానికి వేణు నవ్వుతూ "ఒరేయ్! నందూ! వాడసలు ఇంటి దగ్గర ఉంటేకదా! క్రికెట్ అంటూ, ఫ్రెండ్సంటూ తిరుగుతాడు. ఇల్లు ఎలా

ఉన్నా వాడికి ఎందుకు పడుతుంది? " అన గానే నందు మరింత ఉడికిపోతాడు.

వేణుకి, నందుకి ఫ్రెండ్స్ ఉన్నా కాలేజీల వరకూ పరిమితం. బాగా దగ్గర స్నేహ మంటూ ఎవరితో చేయరు. కృష్ణకి అలాగ కాదు. ఫ్రెండ్సే లోకం. ఆటలంటే పిచ్చి. తన చదువేదో తను చదువుతున్నాడుకదా అని అన్నపూర్ణ ఊరుకొంటుంది. చంద్రమౌ ళికి మాత్రం చిరాకు. అందరినీ వెంట పెట్టు కొని తిరుగుతాడు. ఇలాగైతే టెన్త్ పబ్లిక్ ఎలా తెములుతాడు? మంచి మార్కులు రావద్దా అని ఆయన బాధ. అన్నపూర్ణ రూపాన్ని, రంగుని పుణికి పుచ్చుకొన్న కృష్ణ మోహన్, లలితంటే అతడికి ప్రత్యేక ప్రేమ. "ఇద్దరు నా పోలిక, ఇద్దరు నీ పోలిక బాగుందికదూ" అంటాడు.

'ఈ ఇద్దరూకూడా మీ పోలికే అయినా నేను ఏమీ అనుకోన్లెండి' అనే భార్యను అతడు ఆరాధనగా చూస్తాడు. 'అమ్మో! అందమైన నీ రూపానికి ప్రతిరూపాలు లేక పోతే నేను భరించగలనా' అనే భర్తను చూసి అన్నపూర్ణ నవ్వుకొంటుంది.

అందానికి ఇంత ప్రాధాన్యత ఉంటుందా అన్పిస్తుందామెకి. ఈ అందం శాశ్వతం కాదని తెలిసినా ఏమిటో ఈ వెర్రి అనుకొం టుంది. అందమే ఏం ఖర్మ జీవితాలే శాశ్వతం కాదు. అలాగని వీటిని అంతం చేసుకోగలమా? బతికిన నాలుగు రోజులూ అందాన్ని ఆస్వాదిస్తూ, ఆనందాన్ని అనుభ విస్తూ బతకాలనే భర్త వాదనను ఆమె త్రోసిపుచ్చదు. అర్థం చేసుకొనేందుకు ప్రయ త్నిస్తుంది. ఎవరి అభిప్రాయాలు వారికుం టాయి.

భర్తను ఎంత అర్థం చేసికొందామన్నా ఆమెలో ఏదో ఆవేదన. పూర్వం తమ సంసారం ఎంత బావుండేది. అతడికి వచ్చే జీతంతో తాము హాయిగా ఇల్లు దిద్దుకొనే వారు. అందులోనే మిగల్చడానికి చూసే వాళ్లు. ఆ రోజుల్లో డబ్బు అంటే ఎంత అపు రూపమో? అది తన భర్త చెమటోడ్చి సంపాదించిన కష్టార్జితమన్పించేది. జీతం రాగానే దేవుడి మందిరంలో పెట్టి కళ్లకద్దు కొని తర్వాత వాడుకొనేది.

అన్నపూర్ణకి ఆ రోజులు తలుచుకోవడ మంటేనే ఇష్టం. లలిత పుట్టిన దగ్గర్నుండి అంతా హడావుడే. అతడిలో కార్చిచ్చులాగ మార్పు. సంపాదన మీద ఇంత యావ దేనికి? అన్పిస్తుందామెకి. లలిత అంటే అత డికి ప్రాణం. ఆడపిల్ల కావాలని ఎంత పట్టు దల. ఎవరైతే ఏం అనే తన వాదనను కొట్టి పారేసేవాడు. పిల్లలంటే అతడికి ఇష్టం

నందు పుట్టాక తను ఆపరేషన్ చేయిం చుకొంటానంది. అతడు వినలేదు. సర్లే మరొక్క బిడ్డే కదా అనుకొంటే కృష్ణ పుట్టాడు. అప్పుడే తను పట్టుపట్టింది. తమకి వచ్చే జీతంలో ముగ్గురిని పెంచుకో వాలి. అందుకే ఇంక మరి ఆడపిల్లకోసం చూడవద్దంది. "పూర్ణా! నాకెందుకో ఈసారి పాపపుడుతుందని గట్టి నమ్మకంగా ఉంది. అసలు విషయం చెప్పనా పూర్ణా! నాకు జీవి తంలో ఏ లోటూ ఉండకూడదన్పిస్తుంది. పరికిణీ, జాకట్టులతో ఆడపిల్ల ఇంట్లో తిరు గుతూంటే ఇంటికే అందం. ఎందరు మగ పిల్లలున్నా ఆడపిల్లల సాటిరారు"

అతడి మాటలు వింటూ తను నవ్వి మరొక అబ్బాయి పుడితే అప్పుడేం చేస్తార నేది.

"అసలు నువ్వు మనసారా ఆడపిల్ల కావా లని కోరుకోవడం లేదేమో!" అని కినుకగా అనేవాడు. అన్నపూర్ణకి నవ్వు వచ్చేది. భగ వంతుడి అనుగ్రహం ఉండాలి. తాము ఏది కోరితే అది అవుతుందా? అలాగంటే అతడు ఒప్పుకోడు.

కృష్ణ తర్వాత అతడు ఆపరేషన్‌కి ఒప్పు కోకపోవడంతో తను కూడా మౌనంగా ఉండిపోయింది. తన వదినలు, చెల్లెలు,




తోడి కోడళ్లు అందరూ ఆటపట్టించేవారు. అతడన్నట్లు అతడిదీ పెద్ద కుటుంబమే. తనదీ పెద్ద కుటుంబమే. అన్నపూర్ణకి ఇద్దరు అన్నలు, ఒక తమ్ముడు, ఒక చెల్లి. చెల్లెలు ఇద్దరు పిల్లలతోనే ఆపరేషన్ చేయించుకొంది. చంద్రమౌళికి ముగ్గురు అన్నలు, ఇద్దరు అక్కలు. ఆఖరి వాడవడం వలన తండ్రికి చంద్రమౌళి అంటే గారాబం. పెద్దన్నగారు వ్యవసాయం, రెండవ అన్న వ్యాపారం, మూడవ అన్నకి ఎలక్ట్రిక్ ఆఫీసులో పని. వాళ్లకి పెద్దగా చదువులబ్బక పోవడంతో అతడి తండ్రికి చంద్రమౌళి బాగా చదువుకొన్నాడని గొప్ప. ఒక్క కొడుకైనా పెద్ద చదువులు చదివి పేరు సంపాదిస్తాడా అని ఆయన ఆవేదన పడేవాడు.

చంద్రమౌళి తండ్రి మోతుబరి రైతే. ఏం లాభం? ఆడపిల్లలిద్దరి పెళ్లిళ్లకి ఉన్న దాంట్లో సగం పొలం అమ్మేశాడు. మిగిలినది కొంత వాళ్ల పురుళ్లకి, ఖర్చులకి సరిపోయింది. ఉన్న కొద్ది భూమి పెద్దవాడు దున్నుతోంటే హాయిగా కృష్ణా, రామా అనుకొంటూ ఆయన కూర్చున్నాడు. రెండవ వాడు ఎరువుల వ్యాపారం, ధాన్యం కొనుగోలు చేస్తూ ఉంటాడు. మూడవ వాడిదీ చాలీచాలని సంపాదనే. అతడిని అత్తవారు ఆదుకొంటూంటారు కాబట్టి నెగ్గుకొస్తున్నాడు.

వాళ్లందరూ జాగ్రత్తపడేవాళ్లే. అడపాదడపా తమ్ముడి దగ్గరికి వచ్చి, వాళ్ల అవసరాలు ఏకరువు పెట్టి డబ్బు పట్టుకొని పోతారు. చంద్రమౌళిది మెతక స్వభావం ఎవరినీ నొప్పించలేడు. బాగా బతకాలనే తపన ఎక్కువ. ఈ సమాజంలో ధనవంతులకి, పలుకుబడి ఉన్నవారికి గల కీర్తి ప్రతిష్ఠలు సామాన్యులకున్నాయా అనుకొంటాడు.

అన్నపూర్ణ స్వభావం మెత్తనిది. ఆమె పెరిగిన వాతావరణం భర్తకు అనుకూలంగా బతకమనే నేర్పింది. తండ్రి గునపర్రులో భూస్వామి. పెద్దన్న టీచరుగా, చిన్నన్న బేంకు ఉద్యోగిగా స్థిరపడ్డారు. తమ్ముడు, మాత్రం రాజకీయాలంటే పడి చస్తాడు. గునపర్రు సర్పంచ్‌గా ఉంటున్నాడు. అటు చూసినా, ఇటు చూసినా కాస్త నదురుగా కన్పించే సంసారం చంద్రమౌళిదే. చెల్లి భర్త పూళ్లలో డాక్టరు. చిన్నతనం నుండీ అక్కాచెల్లెళ్లకి సఖ్యత ఎక్కువ.

అన్నపూర్ణ ఎంత తక్కువ మాట్లాడుతుందో చెల్లి రాజ్యలక్ష్మి అంత వాగ్ధాటి కలది. ఆకారం, రంగులో కూడా ఇద్దరిదీ వ్యతిరేకమే. అన్నపూర్ణ అంత పొట్టి, పొడుగూ కాని ఎత్తుతో ఉంటుంది. శరీరం మంచి తెలుపురంగు. పెద్ద కళ్లతో, పొట్టిగా, దుబ్బుగా ఉండే తలకట్టుతో ఇట్టే చూపరుల దృష్టి నాకర్షిస్తుంది. మనిషిలోని నెమ్మదితనం, మంచితనం ఆమెకి మరింత వన్నె తెచ్చాయి. రాజ్యలక్ష్మి కొద్దిగా నలుపురంగులో ఉంటుంది. మనిషిలో ఆకర్షణ ఎక్కువ. చిన్నవైనా తీక్షణంగా ఉండే కళ్లతో, విశాలమైన నుదురుతో, ఎప్పుడూ పెదవులపై చిరునవ్వుతో ఉంటుంది.

తను ఇంటికి వచ్చినా భార్య గమనించక పోవడంతో చంద్రమౌళి ఆమెను అంతగా ఆకర్షించిన విషయమేమిటా అని చూశాడు. కిటికీగుండా ఆ దృశ్యాన్ని చూసిన అతడి మొహం చిన్నబోయింది.

పైడితల్లి భార్యను, పిల్లలిద్దరినీ రిక్షాలో కూర్చోపెట్టుకొని తొక్కుతున్నాడు. ఎవరో ఒకావిడ రిక్షా కావాలని అడుగుతోంటే వీలవదని చెప్పి వెళ్లిపోతున్నాడు. వేణుకి, నందుకి పైడితల్లి రిక్షా కట్టేవాడు. వాళ్లని స్కూలుకి జాగ్రత్తగా తీసికెళ్లి జాగ్రత్తగా తీసికొని వచ్చేవాడు.

అతడి మంచితనం, నిజాయితీ చూసి అన్నపూర్ణ ఎంతో మెచ్చుకొనేది. తమ సహాయంతో బేంకు లోను పెట్టి అతడు సొంత రిక్షా కొనుక్కొన్నాడు. అతడికి తమ



కుటుంబం అంటే గౌరవం.

"పూర్ణా! ఇది చాలా అన్యాయం సుమా! ఇంటికి వచ్చిన భర్తకన్నా పైడితల్లి కుటుంబం నిన్ను ఎక్కువ ఆకర్షిస్తోంది" అంటున్న భర్త మాటలు విని పూర్ణ ఇటు తిరిగింది.

"ఓహ్! మీరు వచ్చేశారే. ఉండండి కాఫీ తీసికొని వస్తాన"ంటూ అక్కడినుండి కదల బోయింది. చంద్రమౌళి వెళ్లనివ్వకుండా ఆమెను ఆపాడు. "కాఫీకేంలే! ముందిది చెప్పు. నిన్ను నువ్వు మరిచిపోయి, పరిసరా లను మరిచిపోయి చూసేంత గొప్పదా ఆ దృశ్యం? " వద్దనుకొన్నా అతడి కంఠంలో నిష్ఠూరం ధ్వనించింది. ఒక్కొక్కసారి భార్య తనకి అర్థం కానట్లు అనిపిస్తుందతడికి.

అన్నపూర్ణ ఒకసారి భర్తవైపు తలెత్తి చూసింది. అతడి చూపులు సూటిగా తనని చూస్తున్నాయి. తర్వాత తన చేతి వేళ్లను చూస్తూ నెమ్మదిగా జవాబిచ్చింది.

"పైడితల్లికి భార్యాబిడ్డలంటే ప్రాణం. వారితో గడిపే ఆనందం కోసం తన సమ యాన్ని కేటాయించుకొంటాడు. మరొక బేరం వస్తున్నా వదులుకొన్నాడు తన వాళ్లకి అసౌకర్యం కలగకూడదని. అతడు నీతి నిజాయితీలకి ప్రాణం ఇస్తాడని మనకి తెలి సిన విషయమే కదా! తన పరిధిలో తను అలాగ బతకడం గొప్పేకదా!

"ఆ భార్యాబిడ్డల మొహాలలోని ఆనం దాన్ని చూస్తున్నాను అతడిలోని తృప్తికి కార ణాలను వెతుకుతున్నాను"

చంద్రమౌళి మొహం మ్లానమైంది. అంత లోనే సంభాళించుకొని "అయితే ఏమిటం టావు? మగవాడు ఏం సంపాదిస్తున్నాడ న్నది ప్రధానంకాదు. ఎలా సంపాదిస్తున్నా డన్నదే ప్రధానమా? అదేగా నువ్వు చెప్పేది? "

అతడి ప్రశ్నలోని వాడితనం ఆమెను కల వరపరిచింది. అయినా తొణకకుండా, నెమ్మ దిగానే "ఏ వ్యక్తి జీవితానికి అయినా నీతి నియమాలు అత్యవసరం" అంటూ వచ్చే సింది.

చంద్రమౌళి హతాశుడయ్యాడు. అన్న పూర్ణ తన అయిష్టాన్ని బయటపెడుతూనే ఉంది. తనే ఆమె అభిప్రాయం గుర్తించ నట్లు ప్రవర్తిస్తున్నాడు.

అయినా ఇదేం మనస్తత్వం? నగలు, డబ్బు, హోదా పరపతి ఇవేవీ ఈమెను ఆక ర్షించలేకపోతున్నాయి. ఎవరైనా మరొకరైతే భర్తను అవి తెమ్మని, ఇవి కావాలని గోల చేస్తారు. భర్త మనసుపడి సమకూర్చినవి కూడా ఈమెకు సంతృప్తి కలిగించలేకపోతు న్నాయి.

ఆలోచనలతో అతడికి తలనొప్పి వచ్చే సింది. భార్య తెచ్చిన కాఫీ వెంటనే అందు కొన్నాడు. ఇద్దరి మధ్యా ఇబ్బంది పెడు తున్న ఈ మౌనం అతడికి భరించలేనిదిగా ఉంది.

మాట మారుస్తూ అన్నాడు, "పూర్ణా! అక్కయ్యకి డబ్బు ఇచ్చానుకదా! నువ్వేం అనుకోలేదు కదూ! పాపం. ఎంతో ఆశతో అడిగినదాన్ని ఎలా కాదనగలను చెప్పు"

అన్నపూర్ణ నిండుగా నవ్వింది "ఆడపిల్లలు సంతోషంగా వెళ్లడమే మనకు కావలసింది. ఇందులో అనుకోవడానికేం ఉంది. డబ్బు ఉంది కనుక సర్దుబాటు చేశారు. ఔనా? "

చంద్రమౌళి ఆమె నిండు హృదయానికి పొంగిపోయాడు. ఇదే అవకాశమనుకొని "మరి మనవాళ్లనుకొన్న వాళ్లను సంతోషప రచడానికి డబ్బు అవసరమే కదా! సంపా దన ఎంత ఎక్కువగా ఉంటే అన్ని అవస రాలు తీరతాయి. ఔనా"

అన్నపూర్ణ ఫక్కున నవ్వింది. ఎప్పుడో తప్ప ఆమె అంతలాగ నవ్వదు. ఆ నవ్వు లోని అందాన్ని క్షణం మైమరిచి చూశాడు. "అయితే మీ అక్కయ్యగారు టీవీ కొనుక్కో వడం అవసరం జాబితాలోకి వచ్చిందన్న

మాట!"

అంతలోనే తననుతాను సర్దుకొంటూ "అవసరమంటే టీవీ, ఫ్రిజ్‌లు కావండీ! తిండి, బట్ట, గూడు ఇవీ అవసరాలు. ఇవి లేకపోతే మానవ మనుగడ కష్టం"

ఒక్కక్షణం అతడు అప్రతిభుడయ్యాడు. అంతలో తననుతాను సంభాళించుకొంటూ "అమ్మో! నోట్లో వేలు పెడితే కొరకలేని అమాయకురాలు మా పూర్ణయేనా ఇన్ని విషయాలు మాట్లాడ గలుగుతోంది" అనేశాడు.

మర్నాడు వేణుగోపాల్ తనకి వెహికల్ కొనిమ్మని తండ్రిని నిలదీశాడు. చంద్రమౌళి కొద్దిగా ఓపిక పట్టమని, ఈలోపు తన స్కూటర్ పట్టుకెళ్లమని అంటే అతడు ఒప్పుకోలేదు. "పెద్ద అత్తయ్యకైతే అడగగానే అన్నీ ఇస్తారు. నాకు నిజంగా అవసరం ఉండి అడిగితే ఇలా అంటారా" అని గొడవ.

చంద్రమౌళి కొడుక్కి నచ్చచెప్పడం కోసం "పెద్దత్తయ్య మన లలితని చిన్న కోడలుగా చేసుకొంటానంది కదా! మరి ఆవిడ అడిగితే ఇవ్వవద్దా" అని దెబ్బలాడాడు.

వేణు కూడా తెలివైనవాడే. 'ఎప్పుడో పెళ్లిచేసుకోబోతే ఇప్పటినుండీ అన్నీ ఇవ్వాలా' అని అతడి వాదన. పెళ్లిచేసుకొంటుందో, చేసుకోదో ఎవరికి తెలుసు? ముందే అన్నీ అప్పజెప్పడం మంచిదా అని అంటున్న కొడుకుని చంద్రమౌళి చిరాకుగా చూశాడు. బాలవాక్కు బ్రహ్మవాక్కంటారు. వాడి నోటి వెంట ఈ అపశకునం మాటలేమిటి అనుకొన్నాడు.

అన్నపూర్ణకి భర్త మనసు చివుక్కుమందని అర్థమైంది. కొడుకుని మందలించింది. "ఎందరు విద్యార్థులు బస్సులలో ప్రయాణం చేయడం లేదు? కష్టపడి తర్వాత సుఖపడవచ్చును. కానీ జీవితంలో ముందే సుఖాలు కావాలనుకొంటే ఎలాగ?"



నెల రోజులు తిరగకుండానే చంద్రమౌళి కొడుక్కి హీరో హోండా కొన్నాడు. అది చూసుకొంటున్న కొడుకు మొహంలోని ఆనందం అతడికి ఎనలేని తృప్తినిచ్చింది. నందు తనకేం బహుమతిస్తారని అడుగుతోంటే అతడు నవ్వుతూ "నువ్వూ అన్నయ్య లాగ ఇంజనీరింగ్ చదువు. అప్పుడు కొంటా"నన్నాడు. నందు తను ఇంజనీరింగ్ చదవనని, డాక్టరు అవడమే తన కోరికని తండ్రినొప్పించి ఇంటర్‌లో బై.పి.సి గ్రూప్ తీసుకొన్నాడు.

శాంతమ్మగారు అన్నపూర్ణకి హితబోధ చేస్తూనే ఉంది.

చంద్రమౌళి అక్క, బావ వచ్చి వెళ్లాక అతడి పెద్దన్న కుటుంబం, ఆ తర్వాత అన్నపూర్ణ తమ్ముడు, మరదలు ఇలాగ వచ్చి వెళ్లే వాళ్లకి ఎడతెరిపి లేకుండా అతిథి మర్యాదలతోపాటు బట్టలు... వచ్చిన ఆడవాళ్లకి ఏ జాకట్టు గుడ్డో పెట్టి పంపించేద్దామంటే చంద్రమౌళి ఒప్పుకోడు. "అలా ఏం బావుంటుంది? మనవాళ్లు కనుక వచ్చారు. బయ

టివాళ్లు వస్తారా? ఖర్చునుకొంటే ఎలాగ? "
అంటాడు.

శాంతమ్మగారు అననే అనేసింది. "అమ్మా! అన్నపూర్ణమ్మ తల్లీ! పెద్దదాన్ని కనుక చెపుతున్నాను. నాలుగు రాళ్లు సంపాదించుకొంటున్నప్పుడే వెనకేసుకోవాలి. లేకపోతే తర్వాత చిప్ప చేతికి వస్తుంది"

అన్నపూర్ణ మనసు ఆవిడ మాటలకి ఎంతో నొచ్చుకొంది. అయినా ఏంచేయగలదు? అతడికి ఎదురు చెప్పడం తనకి రాదు. అయినా ఇంటి విషయాలు, జమాఖర్చులు ఎప్పుడూ చూసుకొనేది అతడు. ఆయనకి తెలియదా అనుకొంది.

పెళ్లైన కొత్తలో గడిపిన జీవితానికి ఇప్పటి జీవితానికి చాలా తేడా ఉందన్పిస్తోంది. అప్పుడు ఇంత డబ్బు లేకపోయినా ఎంత సుఖంగా ఉండేవారు. ఎంత తృప్తిగా ఉండేవారు? ఆ రోజుల్లో చుట్టాలు వచ్చినా ఇన్ని కోరికలుండేవికావు.

నాలుగు డబ్బులు సంపాదిస్తున్నాడనేసరికి అందరూ ఏదో ఒక అవసరం చూపి డబ్బు అడిగేవారే! ఈనాడు అతడి సంపాదన తనని కలవరపెడుతోంది. ఆవగింజంత సంతోషాన్నైనా ఇవ్వడంలేదు. ఏదో తెలియని భయం వెంటాడుతోంది. వేధిస్తోంది.

లలిత గెంతుకొంటూ వచ్చి "మాకు సెలవులు, మాకు సెలవులు" అంది. నాలుగు రోజులు సెలవులొచ్చినా లలితకి ఆనందమే. కృష్ణ కూడా చెల్లిని అనుకరిస్తూ "మాకూ సెలవలు, మాకూ సెలవలు" అన్నాడు.

పిల్లలిద్దరూ సెలవలలో తాతగారి ఊరు వెళదామని గొడవ. అన్నపూర్ణకీ ఒక్కసారి వెళ్లి తల్లిదండ్రులను చూసి రావాలన్పించింది. ఆ విషయమే రాత్రి భర్తతో చెప్పింది.

అతడు అదిరిపడినట్లు చూశాడు. భార్య లేకుండా ఇంట్లో ఒంటరిగా ఉండటమంటే అతడికి ప్రాణం మీదికి వచ్చినట్లుంటుంది. అందుకే కృష్ణమాటు, లలితమాటు పురిటికి పంపడానికి కూడా అతడు ఇష్టపడలేదు.

"పిల్లలు సరదా పడుతున్నారు. నాలుగు రోజులు వెళ్లి వచ్చేస్తాం"

అన్నపూర్ణ మాటలకి అతడు చురుకుగా చూస్తూ "పిల్లలా సరదాపడేది, పిల్లల తల్లా? " అని అడిగాడు.

అన్నపూర్ణ చిరునవ్వుతో "మీరు ఎలా అనుకొన్నా ఫర్వాలేదు. పిల్లల తల్లికి కూడా తల్లిదండ్రులను చూడాలనుంది" అంది.

అతడు భార్య చేతిగాజులు సవరిస్తూ ప్రేమగా అన్నాడు, "పూర్ణా! నిత్యం నా సదుపాయాలు చూస్తూనే కాలం గడుపుతావు. వెళ్లిరా! నాలుగు రోజులు నీకు విశ్రాంతి ఉంటుంది. అయితే ఒక షరతు. పెందరాళే వచ్చెయ్యాలి"

పూర్ణకి నవ్వు వచ్చింది. అతడికి త్వరగా అన్న మాట తోచదు. ఎప్పుడూ పెందరాళే అనే అంటాడు. తను వెక్కిరించినా హాయిగా నవ్వేస్తాడు. అలాగే పెరుగు కావలసినా మజ్జిగలు పొయ్యి అంటాడు. పిల్లలు నవ్వుతూ "మజ్జిగ అనండి నాన్నగారూ! మజ్జిగలు బహువచనం" అంటారు. అయినా అదే అతడి అలవాటు. తను వెక్కిరించినపుడు 'ఆ నువ్వు మాత్రం మాటకి ముందొకసారి 'ఔనా? ' అని అనవేంటి? ' అని దబాయిస్తాడు. తనని ఆటపట్టిస్తాడు.

అన్నపూర్ణతో రావడానికి పెద్దవాళ్లిద్దరూ చదువుపోతుందని ఒప్పుకోలేదు. కృష్ణమోహన్, లలిత వెడుతున్నారంటే గౌరికి కూడా వెళ్లాలని కోరిక పుట్టింది.

అది నెమ్మదిగా అన్నపూర్ణ దగ్గర చేరింది. "అమ్మగారూ! నన్ను మీతో తీసికెళ్లండీ! నేను ఏనాడూ బస్సు ఎక్కలేదు. రైలు ఎక్కలేదు"అంటున్న దాని కళ్లల్లో కన్పిస్తున్న కోరికను కాదనలేకపోయింది.

అన్నపూర్ణకి గౌరిని చూస్తే జాలివేసింది.

తల్లి లేని పిల్ల. ఉన్న తండ్రి ఇల్లు పట్ట కుండా తాగి తిరుగుతూంటాడు. దాన్ని తెచ్చి అన్నపూర్ణ కాళ్లమీద పడేసి తల్లయినా తండ్రయినా మీరేనన్నాడు. అన్నపూర్ణ గౌరిని కూడా తీసికెళతాననడంతో శాంత మ్మగారు చిటపటలాడింది.

ఆవిడ దృష్టిలో గౌరికి అన్నపూర్ణ దగ్గర చనువు ఎక్కువై గీర ఎక్కువైంది. అది పని మనిషి మాటగానీ తనమాటగానీ వినకపో వడం, ఎంతసేపూ లలితతో ఆటలతో పాట లతో గడపడం ఆవిడకి చిరాకు కల్గిస్తోంది.

"అయ్యగారికి, అబ్బాయిగార్లకు ఏదన్నా కావాలంటే చేసి పెడుతుంది. దాన్నెందు కమ్మా ప్రయాణం చేస్తారు? "

కృష్ణమోహన్ శాంతమ్మగారిని చూస్తూ, "అమ్మా! శాంతం అంటే నెమ్మదిగా ఉండ టంకదూ! మరి మామ్మగారు ఎప్పుడూ గయ్యిమంటూ ఉంటారేం? " అన్నాడు.

ఆవిడకి చిర్రెత్తుకొచ్చింది. "మా అమ్మకి, బాబుకి బుద్ధిలేక ఆ పేరుపెట్టారు. నువ్వు ఆ పేరు మార్చి పెట్టునాయనా! బతికిపో తాను. వీడు పిల్లాడుకాదు పిడుగు" అంది.

"అయితే ఈరోజునుండే మీ పేరు దూర్వాసి. బావుందా" అన్నాడు నవ్వుతూ. గౌరికి ఆ పేరు ఎందుకు పెడుతున్నాడో అర్థమవలేదు. ఆవిడవైపు చూడకుండా 'కృష్ణబాబూ! ఆ పేరుకర్థమేంటి? ' అని అడి గింది.

"భడవకానా! పేరుకి అర్థం కావలసి వచ్చిందా? తన్నానంటే మీ నాన్నదగ్గర పడ తావు" అని ఆవిడ కళ్లెర్ర చేస్తున్నా లెక్క చేయకుండా "'దూర్వాసుడు' అనే ఓ కోపిష్ఠి మహర్షిగారు ఉన్నాడులే! ఊ అంటే కోపం, ఆ అంటే కోపం. అందరినీ శపించి పారే స్తాడు. మన మామ్మగారు అతడికి వారసు రాలన్నమాట"

"అన్నయ్య బలే పేరుపెట్టాడు" అంటూ లలిత గెంతుతూంటే శాంతమ్మగారు 'లలి తమ్మ తల్లీ! నువ్వేదో నెమ్మదస్తురాలివను కుంటే అతడితో చేరి అల్లరి చేస్తున్నావా? కృష్ణ బాబూ! తాచెడ్డకోతి వనమెల్ల చరిచిం దంటే ఇదే'. అనగానే 'అయితే నేను కోతినా' అంటూ మూతి ఎత్తుగా పెట్టి వెక్కిరించడం మొదలుపెట్టాడు. అన్నపూర్ణ కలగచేసుకోవ డంవలన కృష్ణ గొడవ సద్దుమణిగింది.

గౌరి మాత్రం ఆవిడని చూసి నవ్వుకో నేది. ఆవిడ గయ్యిమని 'ఎందుకే భడవా! నన్ను చూసి నవ్వుతున్నావ్' అంటే, పైకి మాత్రం 'ఏం లేదమ్మగారూ' అన్నా లోపల కృష్ణ పెట్టిన పేరు తలుచుకొని నవ్వేది.

అన్నపూర్ణ గౌరిని తీసికెళతాననడంలో మరొక విషయం కూడా ఉంది. లలితకి తోడుగా ఉంటుంది. లేకపోతే ఒక రోజైనా గడవకముందే లలిత ఇంటికి పద అంటుంది.

అన్నపూర్ణ సూట్‌కేసు సర్దుకొంటూంటే చంద్రమౌళి పక్కనే ఉన్నాడు. భార్య పెట్టు కొంటున్న బట్టలు చూసి ఉత్త జడ్డి. ఏం సర్దుకోవాలో, ఎలా ఉండాలో తెలియదనుకొ న్నాడు. ఆమెకి చూస్తే ఆడంబరాలు ఇష్టం ఉండవు. అతడికి ఆమె డాబుగా ఉండాలన్పి స్తుంది.

భర్త తీసిన చీరలు చూస్తూ "ఆ బిన్నీ సిల్కు చీర, అపూర్వ చీరలెందుకండీ? హాయిగా జరీచీరలు, వాయిల్స్ పెట్టుకొంటే బావుంటుందికదా!" అంది.

అతడు ఆమె మాటలు తీసిపారేశాడు. "నువ్వు వెనుకటి అన్నపూర్ణవికాదు. ఇంజనీ రుగారి అర్ధాంగివి. నువ్వు సాదాసీదాగా ఉంటే నా పరువేం కావాలి? " అని.

"మన పూర్ణ వచ్చిందంటే ఒకసారి చూసి వద్దాం అంటూ వచ్చే మీ బంధువుల ముందు దిష్టిబొమ్మలాగ ఉంటావా? " అన్నాడు.

చివరికి ఆవిడ వద్దంటున్నా వినకుండా

ఖరీదైన బట్టలు, నగలు అన్నీ ఇచ్చి పంపాడు. మామూలుగా అన్నపూర్ణ పుస్తెల తాడు, నల్లపూసలతో ఉండటాన్ని ఇష్టపడు తుంది.

అతడు పోరు పెట్టి పలకసరుల చంద్రహారాలు వేయించాడు. బంగారు గాజులు నాలుగైనా చేతికి ఉండాలంటాడు. ఇలా నెక్లసుతో ముత్యాలతో పెళ్లికో, పేరం టానికో వెళ్లినట్లుంటుంది కానీ కన్నవారిని చూడటానికి వెళ్లినట్లు ఉంటుందా? ఆమె అభిప్రాయం ఎవరికి కావాలి? చుట్టుపక్కల వాళ్లు ఏమనుకొంటారో బంధువులు తన వెనుక ఏం గుసగుసలు పోతారోనని ఆమె భయం.

చంద్రమౌళి తన గుండెలవైపు చూపుడు వేలు పెట్టి చూపిస్తూ "ఇదిగో! ఈ రోజునుండి నువ్వు నాకోసం, నా ఆనందం కోసం బతకాలి. తెలిసిందా? నా పూర్ణ నాకంటి వెలుగుగా ఉండాలి. నీడి మాటే నీకు వేదం కావాలి" అంటే ఆమె ఇంకేం మాట్లాడుతుంది?

ఆమె ఎప్పుడూ అనుకొంటుంది. మనం మనకోసం బతకాలి. ఇతరుల కోసం కాదు గదా? ఎవరో పొగడాలని, ఎవరో మెచ్చుకో వాలని తాపత్రయం ఎందుకో?

చంద్రమౌళికి ఆమె మనసు ఆమె కళ్లల్లో కన్పిస్తుంది. చిన్నపిల్లలాగ మౌనంగా ఉండి పోయిన భార్యను దగ్గరికి తీసికొని బుగ్గ లపై నుదిటిపై ముద్దులు కురిపిస్తాడు. అతడి ప్రేమ ముందు ఆమె కరిగి నీరవు తుంది.

అతడు ఒక్కొక్కసారి రాత్రిళ్లు పడుకొనేట ప్పుడు భార్యను గుండెలకి హత్తుకొని అంటాడు, "పూర్ణా! నేను ఈ ఉద్యోగం చూసి, ఈ హోదా చూసి, ఐశ్వర్యం చూసి గర్వపడటం లేదు. నిన్ను... నిన్ను చూసి, నీ అందాన్ని చూసి, నీ ప్రేమని చూసి గర్వ పడతాను. నాకు అన్నింటికంటే ఎక్కువ తృప్తినిచ్చేది ఇదే"

అతడి మాటలలోని నిజాయితీకి ఆమె కళ్లుచెమరుస్తాయి. 'భగవంతుడా! ఈ ఆనం దాన్ని నాకు ఎప్పుడూ ప్రసాదించు' అని మూగగా దేముడిని ప్రార్థిస్తుంది.

తల్లిదండ్రులు కూతురిని, పిల్లలను చూసి పొంగిపోయారు. ఎప్పుడు పిలిచినా రావడా నికి ఇష్టపడని కూతురు అంటే వాళ్లకి అప్పు డప్పుడూ కోపం వచ్చేది.

పోనీలే ఎక్కడో అక్కడ సుఖంగా ఉంది. అంతే చాలనుకుంటారు. తమ్ముడు, మర దలు ఆమెకి రాజోపచారాలు చేశారు. పిల్లలు కూడా పొలాలు తిరగడంలో బిజీ అయిపోయారు. ఈతపళ్ళు, తాటిముంజలు, కొబ్బరిబొండాలు ఒకటేమిటి చినమావయ్యా వాళ్ళకి అన్నీ అమర్చాడు.

అమ్మమ్మ చేసిపెట్టే తినుబండారాలతో, తాతగారు చెప్పే కబుర్లతో కథలతో వాళ్ళకి రోజులు హాయిగా గడిచిపోయాయి. మరో కరోజు ఉందాం, మరొకరోజు ఉందాం అంటూ కృష్ణ మారాం చేసేవాడు.

మావయ్య పాలు పితుకుతుంటే వెళ్ళి గుమ్మపాలు అడిగి తాగేవాడు. దూడలతో సమంగా పరుగెత్తేవాడు. కూతురి సంతా నాన్ని, ఐశ్వర్యాన్ని చూసి వాళ్ళు ఎంతో సంతోషించారు.

అన్నపూర్ణ వచ్చిందని ఊరు ఊరంతా చూడటానికి వచ్చింది. వాళ్ళు తన చీరలను, నగలను మెచ్చుకుంటుంటే, ఇంతింత కళ్ళతో చూస్తుంటే పూర్ణకి భర్తే గుర్తుకొచ్చేవాడు.

అక్కగారు వచ్చిందని తెలిసి రాజ్యలక్ష్మి కూడా వచ్చింది. ఇద్దరూ కరువుతీరా కబుర్లు చెప్పుకొన్నాక, ఒకరోజు మాత్రం రాజ్యలక్ష్మి కుండబద్దలు కొట్టినట్లు అనే సింది.

"అక్కా! నువ్వు తెలిసి ఊరుకొంటున్నావో, తెలియక అమాయకంగా ఉన్నావో నాకు అర్థమవడంలేదు. బావకి అక్రమ సంపాదన

ఎక్కువైపోయిందిట. ఆమధ్య మావారి స్నేహితులు అనుకుంటూంటే ఈయన వచ్చి చెప్పారు. రేపు ఏ సి. బి. ఐ. వాళ్ళో దాడులు చేశారా ఎంత అప్రదిష్ట. మనం నిజాయి తీగా సంపాదించుకొన్నది మనకి ఉంటుంది. పెడదారులు పడితే సంపద నిలుస్తుందా? నేనిలా అంటున్నానంటే నీమీద ప్రేమతోనే"

చెల్లెలిమాటలు చెళ్ళున అన్నపూర్ణ మన సుకి తగిలాయి. ఆయన ఆఫీస్ విషయా లన్నీ వాళ్ళందరికీ తెలుస్తున్నాయన్నమాట. అయినా తనెంత పిచ్చిది. పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగి లోకం కళ్ళు మూసుకొంది అనుకొంటే మాత్రం అవు తుందా?

వివర్ణమైపోయిన అక్కగారి మొహం చూసి రాజ్యలక్ష్మి బాధపడింది. తనే నెమ్మ దిగా అంది. "అక్కా! ఈ లోకంలో నువ్వు ఎప్పుడూ సుఖంగా ఉండాలని కోరుకునేవా ళ్ళల్లో నేను మొదటిదాన్నని నీకుతెలుసు కదా! నామాట విని బావను పక్కదారులు పట్టనీయకు"

అన్నపూర్ణ బరువుగా నిట్టూర్చింది. తనకి ఈ బాధ కొత్తేమీకాదు. ఏది మరిచిపోదా మని మార్పుకోసం వచ్చిందో ఆ ప్రస్థావనే ఇక్కడ. ఏమనగలదు?

రాజ్యలక్ష్మి అక్కగారి చేయి పుచ్చుకొని అనునయంగా చెప్పింది, "పిల్లలకి కూడా బావ బాగా ఆడంబరాలు నేర్పేస్తున్నాడు. రేపు వాళ్లని మనం కట్టుదిట్టం చేయగ లమా? వాళ్ళ జీవితాంతం ఈ స్టేటస్ మనం మెయిన్‌టేయిన్ చేయగలమా? "

అన్నపూర్ణకి తను, చెల్లెలు కలిసి గోంగూర పచ్చడితో అన్నం తిని, బడికి పోయే రోజులు గుర్తొచ్చాయి. ఇద్దరూ కలిసి ఒక కంచంలో తినేవారు. ఒకరిని వదలి ఒకరు ఉండేవాళ్ళు కాదు. తల్లిదండ్రు లకి అమాయకంగా ఉంటుందని అన్నపూర్ణ మీదే ప్రేమ. "రాజ్యం, అక్కని జాగ్రత్తగా తీసుకెళ్ళు" అనేవారు.

చిన్నప్పటినుంచీ అది ఆరిందాలాగా, తను ఆ పిల్లవెనుక నెమ్మదిగా తిరిగేవాళ్లు. చంద్ర మౌళి వచ్చి పెళ్ళిచూపులు చూసి వెళ్లిన నాడు ఇది తనని ఎంత ఆటపట్టించింది. తల్లిదండ్రులకన్నా, అన్నలకన్నా ముందు "అక్కా! నీకు అతడు నచ్చాడా? ఊ... చెప్పు... అతడిని పెళ్ళిచేసుకుంటావా? " అని ఊపిరి పీల్చుకోకుండా అడిగేసింది.

తను సిగ్గులమొగ్గయిపోతూ, "నీ మాట చెప్పు. నీకు ఎలా అన్పించారు? " అంది. అది చిలిపిగా చూస్తూ, "నా అభిప్రాయం కావాలా? " అని అడిగింది.

"చదువు చూస్తే ఓకే! ఇంజనీర్‌గా, ఉద్యోగం వచ్చిందంటున్నారు కాబట్టి హోదాకి లోటులేదు. పోతే రంగు మాత్రం నీ దగ్గర తీసికట్టు. మనిషి హుషారుగా ఉన్నాడు కాబట్టి ప్లస్ మార్కులు. పెద్ద కుటుంబంలో వాడు కాబట్టి అందరికీ వండి వార్చేటప్పటికి నీ పని గోవిందా? అతడి వరస చూస్తే నువ్వు నచ్చినట్లే ఉన్నావు. ఇంక నీ ఇష్టమే ఈ పెళ్ళి"

ఆమె మాటలకి తల్లి, తండ్రి ఒకటే నవ్వు. పెద్దన్న నవ్వుతూ, "అయితే అతడు నీకు బాగా నచ్చాడా? చెప్పు రాజ్యం. నచ్చితే నీ కొంగుకే కట్టేసుకో" అని వేళాకోళం చేశాడు.

రాజ్యం అన్నమాటలకి మూతి విరిచి, "అక్క నెమ్మది కనుక అతడు స్పీడ్ అయినా ఫర్వాలేదు. మన విషయంలో అది కాదుకదా. మనం స్పీడు, అతడూ స్పీడైతే మరి సంసారం /సాగినట్లే. అందుకే అక్కకి వదిలేస్తున్నాను" అంటుంటే అందరూ పగ లబడి నవ్వుకొన్నారు.

ఆ రాత్రి పడుకొన్న అన్నపూర్ణకి నిద్రపట్ట లేదు. తాను ఎప్పుడూ అతడి జీతంతో బత కలేమని అనలేదుకదా. సిరిసంపదలు కావా లని నిలదీయలేదుకదా!



అసలు మొదట్లో ఎంత చక్కగా ఉండే వారు? ఆఫీస్‌లో అందరికీ ఆయనంటే ఎంత గౌరవం. ఆ కళ్ళల్లో ఎంతగర్వం? ఆ నడకలో ఎంత ఠీవి?

తను, పిల్లలు, అతడు ఎంత హాయిగా గడిపేవారు. ఆఫీసులో వాళ్ళు ఎవరెవరో ఇంటికి వచ్చేవారు. గంటలు, గంటలు మాట్లాడుకొనేవాళ్ళు. ఏం విషయాలో, ఏమిటో తనకి తెలిసేదికాదు.

వాళ్ళకి కాఫీలు, ఫలహారాలు ఇవ్వడమే తన పని. పిల్లలు ఏం గొడవ చేస్తారో అని దూరంగా తీసుకెళ్ళేది. వాళ్ళు వెళ్ళాక ఎందు కొచ్చారని అడిగితే ఆఫీసు పని అనేవారు. చాలా సేపు ఆలోచనలో ఉండేవారు.

ఆయన పడే ఘర్షణ ఏమిటో తనకి అర్ధ మయ్యేదికాదు. "పూర్ణా ఈ సంసారం, నాతో జీవితం నీకు బావుందా? " అని ఆలో చనగా అడిగేవారు.

ఎందుకు బావుండదు? కళ్ళల్లో పెట్టుకొని చూసుకునే భర్త, ముత్యాల్లాంటి పిల్లలు. అతడితో అడవిలో ఉండటమన్నా తనకి ష్టమే. పచ్చడిమెతుకులైనా అమృతమే.

ఈ విషయాన్నే తెలియచెప్పితే పరిశీల నగా తనని పట్టిపట్టి చూసేవారు. అవి పై పై మాటలా? నిజమా అని ఆలోచించేది. తనకి నిజమేనన్పించేది. తను పెరిగిన వాతావరణం ఉగ్గుపాలతో ఋజు ప్రవర్తన లను నేర్పింది. అన్నయ్య అబద్ధం చెప్పాడని తండ్రి ఒకసారి శిక్షించడం తనకిప్పటికీ గుర్తే. నీతి, నిజాయితీలను నమ్ముకునే తల్లి దండ్రుల పెంపకంలో పెరిగిన తనకి అతడు తెచ్చే సంపాధన బాధనే కలిగి స్తోంది.

ఏం చేయడం? ఎలా ఆయనని ముసు పటి మనిషిగా చేసుకోవడం? ఈ ఆలోచన లతోనే ఆ రాత్రి జాగరం చేసింది. వెళ్ళిపో తామంటే వినకుండా తమ్ముడు, మరదలు మరో నాలుగు రోజులుంచేశారు.

మనిషి ఉందన్నమాటే కానీ మనసు తన ఇంటిచుట్టే తిరుగుతోంది. ఏదైనా అనకుం డానే చెల్లి వేళాకోళం. నీ మొగుడిని, పిల్లల్ని, ఇంటిని కాకెత్తుకుపోదులే. రెండురోజు లుండు అని బంధువుల బలవంతం.

రాత్రి పిల్లల్ని కూర్చోపెట్టుకుని అన్నాలు పెడుతూంటే టాక్సీ ఆగిన చప్పుడు, తల్లి, తండ్రి హడావుడిగా ఎవరికో మర్యాద చేయడం దూరంగా విన్పిస్తోంది. చెల్లి చెప్పు తున్న కబుర్లకి మళ్ళీ దృష్టి ఇటు నిలిచింది.

పిల్లలకి పెరుగు వేయడానికి లేచిన రాజ్య లక్ష్మి ఆనందంగా అరిచింది, "ఓహో, అక్కా, ఎవరొచ్చారో చూడు" అని ఒకపక్క అంటూ "బావగారూ! ఏమిటిలా మామీద దయక లిగి వచ్చేశారు. ఇది మామీద దయా లేక మీ గృహలక్ష్మిమీద ప్రేమా? " అని వేళా కోళం చేస్తుంటే అన్నపూర్ణ అపనమ్మకంగా తలెత్తి చూసింది.

గుమ్మం పొడవుగా తననే కన్నార్పకుండా చూస్తూ భర్త. రాజ్యలక్ష్మి పెరుగుగిన్నె అక్కడ పెట్టి, బావగారి దగ్గర చేరి మొహం మీద చేతిని పైకీ కిందికీ ఊపసాగింది.

"అబ్బ... కాస్త రెప్పవేయండి బావగారూ. మా అక్కకి దిష్టి తగిలేను. మా ఊళ్లో అయితే రెండు కేజీల మిఠాయిలు, రెండు కేజీల కాజాలు పట్టుకొని గానీ దిష్టి తీయం. సరేనా? "

మరదలి మాటలకి నవ్వుతూ తను తీసు కొని వచ్చిన స్వీట్లు, పళ్ళు చంద్రమౌళి అందించాడు. రాజ్యలక్ష్మి వాటిని అందు కుంటూ "ఏమిటి లైన్ క్లియర్ చేయమనా వెంటనే ఇస్తున్నారు" అని మరింత ఏడ్పిం చింది.

రాత్రి ఎనిమిది గంటలవేళప్పుడు అల్లుడు వచ్చినా అత్తమావలు అతడికి రాజోపచా రాలు చేశారు. ఏమిటో తన హడావుడి కొద్దీ వచ్చి ఈ పెద్దవాళ్లను ఇబ్బంది పెడుతు న్నానా అన్పించింది. మరదలు ఉత్సాహంగా

 

చెపుతున్న కబుర్లు, బావమరిది పలకరింపులు, అత్తగారి ఆదరణ అతడికి ఊపిరాడనీయలేదు.

భార్య తోడిచ్చిన వేడినీళ్ళు స్నానం చేస్తున్న చంద్రమౌళిని అన్నపూర్ణ ఇంటి విషయాలు అడగసాగింది. "అబ్బ... ఇప్పటికి నీకు నోరువిప్పి అడగాలన్పించిందా? అన్యాయం. పుట్టింటికి వస్తే మీ ఆడవాళ్ళు అందరినీ మరిచిపోతారు" అంటూ బాల్చీలోని నీళ్ల తీసుకొని భార్య మొహంమీద చిలకరించాడు.

అన్నపూర్ణ సిగ్గుగా మొహం పైటతో తుడుచుకుంటూ అటూ, ఇటూ చూసింది ఎవరన్నా చూస్తారేమోనన్నట్లు. అతడు పిల్లల గురించి చెపుతుంటే వింటూ అక్కడ నిలబడింది.

అంతలోనే రాజ్యలక్ష్మి సుడిగాలిలాగవచ్చింది. "ఇందుకా నూతిదగ్గర స్నానం చేస్తానన్నారు. బావగారూ, మా కందరికీ ఆకలి దంచేస్తోంది. త్వరగా రండి. మీకైతే ఈరోజు భోజనం అక్కరలేదని చెప్పినా మావాళ్ళు వినడంలేదు"

చంద్రమౌళి నవ్వుతూ, "మా తమ్ముడిని కూడా ఇలాగే ఏడ్పించి వదులుతున్నావా? పాపం. అందుకే కాబోలు మనిషి మరీ కన్పించకుండా నల్లపూసైపోయాడు" అంటూ ఎగతాళి చేశాడు.

"అబ్బే... మీ తమ్ముడా, ఉదయంనుండీ రాత్రివరకూ బిజీ అంటాడు. ఇంక ఏడ్పించడానికి అవకాశమెక్కడ? " అంటున్న మరదలిని నవ్వుతూ చూస్తూ ఇంట్లోకి నడిచాడు.

అత్తగారు ప్రేమతో వడ్డించిన భోజనం మావగారు చెపుతున్న కబుర్లుతో ఎక్కువే తినేసినట్లన్పించింది. కాసేపు బైటకూర్చుని వాళ్ళతో మొహమాటానికి కబుర్లు చెపుతున్నా, అతడి మనసు భార్యతో ఏకాంతానికి పరుగుతీస్తోంది.

ఆవలింతలు తీస్తున్న అల్లుడిని ప్రేమగా చూస్తూ మావగారు, "వెళ్ళిపడుకోండి. బాగా అలిసినట్లున్నారు" అన్నారు. తమ గదివైపు వస్తున్న అతడికి ఇంకా భోజనాలు చేస్తున్న ఆడవాళ్ళు కన్పించారు.

రాజ్యలక్ష్మి ఏదో నవ్వుతూ అనడం, అన్నపూర్ణ సిగ్గుగా తలదించుకోవడం, అత్తగారు సన్నగా చేస్తున్న మందలింపు అతడికి తెలుస్తూనే ఉన్నాయి.

చక్కటి పక్కపై పడుకుని కిటికీనుండి బయటి వెన్నెలను చూస్తున్న అతడికి ఎంతో శాంతిగా అన్పించింది. ఈ పల్లెటూరు వాతావరణం, ఈ చల్లటిగాలి అతడిని ఎంతో ఆనందపరిచాయి.

అన్నపూర్ణ వచ్చాక ఆమె చేతిని పట్టుకొని అన్నాడు, "పూర్ణా... ఇక్కడికి వచ్చాక ఈ వాతావరణం చూశాక నా వయసు ఇరవై సంవత్సరాలు తగ్గిపోయినట్లు అన్పిస్తోంది. నీకోసం రావడం వలన ఇంత అనుభూతి పొందగలిగాను"

అతడికి అంతలోనే గుర్తువచ్చింది, "నాలుగురోజులు మాత్రమే ఉండి వస్తానని బయలుదేరి, ఇక్కడికి వచ్చి, తమ్ముడితో మరో నాలుగురోజులు పోయాక పంపుతానంటున్నారని ఫోను చేయిస్తుందా? భర్త, పిల్లలు ఏం చేస్తున్నారోనన్న దిగులైనా ఉండవద్దా? "

భర్త ఆరోపణలన్నీ మౌనంగా విన్న అన్నపూర్ణ అంది, "అక్కడున్నప్పుడు మీమాట ఎలా కాదనలేనో, ఇక్కడికి వస్తే నాన్నగారిమాట కాదనలేను. అమ్మ బెంగగా ఉంది, నాలుగురోజులు ఉండివెళ్ళమని బతిమాలింది. ఎలా వచ్చెయ్యను? మీరే చెప్పండి? "

అతడు ఇంకేం మాట్లాడగలడు? "తల్లీ, నువ్వొక అజాతశత్రువువి" అనుకున్నాడు. అన్నపూర్ణలో ఉండే ఈ మెత్తని స్వభావమే అతడిని ఆమెవైపు ఆకర్షించింది. అతడు



ఆమెను దగ్గరకు తీసుకొని ప్రేమగా అన్నాడు, "పూర్ణా, ఈ ఇల్లు చూస్తే మన పెళ్ళిచూపులు, పెళ్ళి రోజులన్నీ గుర్తువస్తున్నాయి"

అన్నపూర్ణకీ అలాగే అన్పిస్తుంది. ఇంటరుగుమీద నిల్చుని తాను కనకాంబరం పూలు కొనుక్కొంటుంటే, చంద్రమౌళివాళ్ళు వచ్చారు. పెళ్ళివారు మధ్యాహ్నం వస్తారని మావయ్య చెప్పాడు. అలాంటిది ఉదయం వేళే వాళ్ళు రావడం చూసి తాను తొట్రుపడింది.

పెళ్ళికొడుకు ఉద్యోగంలో వెంటనే చేరాలట. అందుకే ఉదయం కూడా బావుందని బయలుదేరి వచ్చేశారట. మావయ్య అభిమానంగా తనని చూపిస్తూ, "మీరు ఇంట్లో నేచురల్‌గా ఉన్నప్పుడు చూస్తేనే బావుంటుంది. పెళ్ళిచూపులంటే అలంకారాలు, ఆర్భాటాలు అన్నారు కదా బాబూ! మా మేనకోడలు ఎలా చూసినా లక్ష్మీదేవే!" అన్నాడు. వాళ్ళందరూ లోపలికి వస్తోంటే చంద్రమౌళి చూపులు తనని వెంటాడుతోంటే పరుగున ఇంట్లోకి వచ్చేసింది. వెనకాల వాళ్ళు నవ్వుతున్న నవ్వులు విన్పిస్తూనే వున్నాయి.

ఊళ్ళో ఉన్న డాక్టర్ బాబయ్యగారింట్లో వాళ్ళకి భోజనాలు ఏర్పాటుచేశారు. వాళ్ళకి ఇలాంటివాటిలో పట్టింపులేదన్నా అమ్మ 'కలికితే అతకదని' పట్టుపట్టింది. ఉదయం పెళ్ళిచూపులు, వాళ్ళు డాక్టరుగారింట్లో భోజనాలు చేసి వచ్చాక, ఒక గంట విశ్రాంతి తీసుకొని వెళ్ళిపోయారు.

అతడు ఒక్కప్రశ్న కూడా తనని అడగలేదు. అతడి అక్కలు, బావగారు, అన్న, తండ్రి ఏవో ప్రశ్నలు వేశారు. వాటికే అతడు చివరలో విసుగ్గా వాళ్ళవైపు చూశాడు.

వెళ్ళబోయేముందు మొహం కడుక్కొని లోపలికి వస్తూ, పక్కగదిలో కూర్చున్న తన దగ్గర తువ్వాలుతో తుడుచుకుంటూ యధాలాపంగా ఆగినట్లు ఆగాడు. నెమ్మదిగానే అయినా మధురమైన స్వరంతో "నాకు మిమ్మల్ని చూడగానే పెళ్ళి చేసుకోవాలన్పించింది. త్వరలో పెళ్ళిమంటపంలో కలుసుకుందాం" అంటూ ఎదురువస్తున్న అన్నయ్యకి తువ్వాలు అందించి వెళ్ళిపోయాడు.

తను ఒక్కక్షణం నివ్వెరపోయింది. జరిగింది తెలుసుకోవడానికి తనకి అయిదు నిముషాలు పట్టింది. మొదట ఏమిటితని ధైర్యం అనుకున్నా అతడి చిలిపితనానికి నవ్వు వచ్చింది.

అందరితో కలిసి ప్రయాణమైపోతూ కొంచెం మంచినీళ్ళు కావాలి అన్నాడు. తను తండ్రి చెప్పగానే తీసుకొని వచ్చినా తల్లి అతడికి అందించింది. తాగిన గ్లాసు ఆమె చేతికివ్వకుండా, ద్వారం లోపల పెడుతూ తనున్నవైపు చూస్తూ నవ్వాడు. వెళ్ళివస్తానన్నట్లు కళ్ళతో సూచించాడు.

అన్నపూర్ణకి అవన్నీ నిన్నో, ఈరోజో జరిగినట్లు అన్పించసాగాయి. చంద్రమౌళికి కూడా మనసు అనురాగభరితమైపోయింది. అతడు ఆమె తలవంచి ముద్దుపెట్టుకున్నాడు.

మర్నాడుదయమే రాజ్యలక్ష్మి బావగారిని వేళాకోళం చేయసాగింది. "అసలు మీరిద్దరూ పెద్దవాళ్ళమయ్యామనుకొంటున్నారా లేదా? ఇప్పుడే పెళ్ళి చేసుకున్న నవదంపతుల్లాగా ఈ కబుర్లేమిటి? అక్క ఎప్పుడూ ఉండేదే. మా అందరితో గడపండి" అంటూ!

మావగారు, అత్తగారు మర్నాడు అతడిని వెళ్ళనీయలేదు. రాకరాక వచ్చావు ఈ ఒక్క రోజూ ఉండమని బతిమాలారు. కృష్ణమోహన్ తండ్రి దగ్గరికి వచ్చి "డాడీ, ఈరోజుండి రేపు వెళదాం. ఈరోజు మన ప్రయాణముంటుందని తెలియక వాళ్ళకి క్రికెట్ మ్యాచ్ పెట్టాను. ప్లీజ్. రేపు వెళదాం"

అన్నాడు.

అతడి వెనకే ఊళ్ళో పిల్లలు కూడా వచ్చి తనవైపు ఆశగా చూస్తుంటే చంద్రమౌళి కాదనలేకపోయాడు. ఖర్మ... రామేశ్వరం వెళ్ళినా శనేశ్వరం వదలలేదన్నట్లు వాడు ఇక్కడ కూడా ఆట మొదలెట్టాలా అనుకున్నాడు. కొడుకువైపు చూస్తూ వాడిని అడవిలోకి తీసికెళ్ళి వదిలినా ఆ చెట్లతో సైతం స్నేహం చేసుకొని, ఆటలాడిస్తాడు కాబోల నుకున్నాడు. లలిత కృష్ణ దగ్గరికి వెళ్ళి "అన్నయ్యా నన్ను ఎంపైర్‌గా పెట్టవా? " అంది ఆశగా.

కృష్ణమోహన్ పెద్ద చిక్కేదో వచ్చిపడినట్లు చెల్లివైపు చూశాడు. తల గోక్కుంటూ "ఎంపైర్ అంటే కష్టమే. ఆట అంతా అతడి నిర్ణయంమీద ఆధారపడి వుంటుంది. నువ్వేం చేయగలవు" అన్నాడు. లలిత మొహం చిన్నపుచ్చుకొంది.

రాజ్యలక్ష్మికి ఒళ్ళు మండింది. "పెద్ద చెయ్యడానికేముందిరా? ఫోర్ కొడితే రెండుచేతులూ ఇలా సాచి, సిక్స్ కొడితే రెండుచేతులూ డ్రిల్ క్లాసులోలాగా పైకిలేపి చూపించడమే కదా! ఇంతోటి ఊరికి ఈ ఎంపైర్ చాలు" అంది.

ఆ మాటలకి అందరూ నవ్వారు. కృష్ణకి క్రికెట్ ఆట అంటే ప్రాణం. ఆ ఆటను ఎవరైనా తేలికగా అంటే ఒప్పుకోడు. బొంబాయి, కలకత్తాలాంటి సిటీస్‌లో అయితే ఆడవాళ్ళే ముందు వరుసలలో కూర్చుని క్రికెట్ చూస్తారు. ఆట చూసి ఆనందిస్తారు. అభిమానిస్తారు. పూర్ విలేజ్ వుమన్. పిన్నిని చూస్తూ మనసులో అక్కసుగా అనుకున్నాడు.

రాజ్యలక్ష్మి అతడి భావాలు చదివినట్లు అంది "అదేమిటిరా, నన్నొక అనాగరికురాలి లాగ చూస్తున్నావు. నా చరిత్ర నీకేం తెలుసును? మా స్కూల్లో ఆటలలో నేనే ఫస్టు"

చంద్రమౌళి వెక్కిరింతగా చూస్తూ అన్నాడు, "కృష్ణా! మనం చూడలేదుకదా మీ పిన్ని ఎన్ని కోతలైనా కోస్తుంది. ఎన్ని జువ్వలైనా వదులుతుంది. ఇది దీపావళి కాదని చెప్పరా"

అందరూ సరదాగా నవ్వుకున్నారు. బావగారు తన పరువు తీసేస్తున్నారంటూ రాజ్యలక్ష్మి గోల పెట్టింది. అన్నపూర్ణ తల్లిదండ్రులకి పెద్దల్లుడంటే ఎంతో గౌరవం. ఎంత డబ్బు, హోదా ఉన్నా ఎటువంటి భేషజం లేకుండా తమతో కలిసిపోతాడు.

మర్నాడు వాళ్ళు బయలుదేరుతుంటే అన్నపూర్ణకి, పిల్లలకి ఆయన బట్టలు కొనిచ్చాడు. అల్లుడిచేతికి వెయ్యి రూపాయలిచ్చి బట్టలు కొనుక్కోమన్నాడు. చంద్రమౌళికి గొంతుక్కి అడ్డుపడ్డట్లయింది వాళ్ళ అభిమానం చూస్తే. ఏమీ మాట్లాడలేకపోయాడు. వద్దని ఎంత చెప్పినా వాళ్ళు విన్పించుకోలేదు. బలవంతంగా డబ్బు జేబులో పెట్టారు.

అతడు తిరుగు ప్రయాణంలో తమ ఊరివైపు చూస్తూ కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్న అన్నపూర్ణతో అన్నాడు, "పూర్ణా, రెండు నెలలకోసారి నువ్వు మీ వాళ్ళని చూడటానికి ప్రయాణం చేయించు. ఈ ప్రయాణం వలన నాకు ఎంతో బడలిక తీరినట్లు అన్పిస్తోంది. అక్కడుంటే మనమే పెద్దవాళ్ళమైపోయినట్లు, ఊపిరి ఆడని పనులతో ఎంతో వయసు వచ్చినట్లు అన్పిస్తోంది

"మీ ఊర్లో మనవాళ్ళందరి దగ్గరా అలాగ అన్పించలేదు. ఒకరికి అల్లుడిని, మరొకరికి బావను ఇలాగ నాకు నేను చిన్నవాడిగా అన్పిస్తున్నాను. ఒకవేళ నువ్వు బయలుదేరకపోయినా నేను ఊరుకోను. బలవంతంగా ప్రయాణం చేయిస్తాను"

అతడు అలాగ మనసు విప్పి మాట్లాడుతుంటే ఎంతో ఆనందంగా అన్పించిందామెకు. నిజమే పెళ్ళైన వెంటవెంటనే పిల్లలు పుట్టడం వలన వాళ్ళు ఎదిగిపోవడం వలన



తామేదో పెద్దవాళ్ళైపోయినట్లు అన్పిస్తోంది. చాలా జీవితం నడిచినట్లు అతడికన్పించ డంలో ఆశ్చర్యం లేదనుకుంది.

అన్నపూర్ణకి పుట్టింటికి వస్తే ఇక్కడే ఉండిపోవాలన్పిస్తుంది. వాళ్ళందర్నీ వదిలి ఎలా వెళ్ళడమా అని దిగులుగా ఉంటుంది. భర్త దగ్గర ఉంటే మళ్ళీ ఆ బాధ్యతలు, మమకారాలు. నాలుగురోజులెళితే ఆయన ఏం ఇబ్బంది పడతారోనని దిగులు.

కృష్ణ, లలితలకు తండ్రితో ప్రయాణం సరదాగా ఉంది. ఊపిరాడకుండా కబుర్లు చెప్పడం మొదలుపెట్టారు. కృష్ణమోహన్ తనకి తాతగారి ఊరు చాలా నచ్చిందని, పొలంపనులు ఎలా చేయించాలో తెలిశాయ న్నాడు. మేనమామతో వెళ్ళడం, అన్నీ చూడడం చెప్పాడు. లలితవైపు తిరిగిన అత డికి ఆ పిల్ల సిగ్గుతో తల వంచుకొని తల్లి భుజం వెనకాల దాక్కోవడం కన్పించింది. అన్నపూర్ణ కూతురిని చూసి "ఇదేం నేర్చు కొందో తెలుసా? బొమ్మల పెళ్ళిళ్ళు చేయడం, చింతగింజలాడటం, ముగ్గులే యడం" అంది.

అతడు భార్యను చూసి చిరునవ్వుతో, "ఇవన్నీ నీకు పెళ్ళికి ముందు వచ్చినవే. ఇప్పుడేం నేర్చుకున్నావు? " అన్నాడు. అన్న పూర్ణ మౌనం వహించింది. ఆమె చెవిలో చెల్లిమాటలు ప్రతిధ్వనించాయిగానీ అతడు ఆనందంగా చేస్తున్న ఈ ప్రయాణాన్ని పాడుచేయాలన్పించలేదు.

★ ★ ★

శుక్రవారంనాడు అన్నపూర్ణ పూజ చేసు కొంటూంటే పూజగదివైపు చంద్రమౌళి వచ్చాడు. పూలసజ్జలోనున్న నందివర్ధనా లను, మందారాలను, కనకాంబరాలను చూస్తే అతడికి ఎంతో తృప్తి కలిగింది. పాపం... ఈ మొక్కలకు అన్నపూర్ణ ఎంతో సేవచేస్తుంది. వాటినన్నింటిని తనే స్వయంగా సాకుతుంది. అన్ని రకాల పూలతో ఈ దేముళ్ళను అలంకరిస్తుంది.

ఆమె మందిరం దీపాలతో వేయికాంతు లను విరజిమ్ముతోంది. ఆ పూజగదిలో కొలువుతీరని దేముడులేడు. అన్ని పటాలకు పూలను అలంకరిస్తోంది.

అతడు లోపలికి వెళ్ళడానికి ఒక్కక్షణం తటపటాయించాడు. తాను నిద్రలేచిన మొహంతో స్నానమైనా చేయకుండా అడు గుపెట్టటమా? అతడు బయటనుండే భార్యని పిలిచాడు. అన్నపూర్ణ ఆశ్చర్యంగా వెనక్కి తిరిగింది.

భర్త ఉదయాన్నే నిద్రలేవడం ఒకవింతైతే పూజా గదివైపు రావడం మరొక వింత. ఆమె ఏమిటన్నట్లు లేచి వచ్చింది. అతడు భరిణలోనున్న పగడాల హారాన్ని అందిం చాడు "ఈరోజు శుక్రవారం గదా! దేముడి దగ్గర పెట్టుకుని వేసుకో" అంటూ.

అది తనకిచ్చి వెళ్ళిపోతున్న భర్తను చూస్తూనే గొలుసు తీసి మళ్ళీ దేముడి వైపు తిరిగింది.

చిన్న చిన్న పగడాలు, మధ్యలో బంగా రపు గుళ్ళు వరుసగా నాలుగేసి, మళ్ళీ పగ డాలు ఇలా ఎంతో చక్కటి తయారీతో రెండు పేటలతో ఆ గొలుసు ఎంతో బావుంది. దాన్ని భక్తిగా లక్ష్మీదేవి సింహాస నంలో వుంచింది.

పూజ ముగిశాక, అతడి ఆంతర్యం గుర్తుకు వచ్చి, దాన్ని తీసుకుని కళ్ళకద్దుకొని మెడలో వేసుకొంది. తన గదిలోకి వచ్చిన ఆమెను అతడు ఆరాధనగా చూశాడు. ను దుటిపై రెండు కుంకుమలతో, విశాలమైన కనుదోయితో, జారుముడితో నున్న తలక ట్టుతో, పట్టుచీరలో శుచిగా కనిపిస్తున్న అన్నపూర్ణ కాశీ అన్నపూర్ణలాగే అతడికి సాక్షాత్కరించింది.

మెడలో పలకసరుల గొలుసు, నల్లపూసల గొలుసు, పక్కన ఈ పగడాల గొలుసు మరింత మెరిసిపోతోంది. సన్నటి, తెల్లటి ఆ




మెడ క్రిందిభాగంలో సాయి విభూతి. అతడు రెప్పవేయకుండా భార్యను చూశాడు.

భర్త చూపులను తప్పించుకుంటూ "ఈ పగడాల గొలుసు ఎప్పుడు తీసుకొన్నార"ని అడిగింది. అతడు తృప్తిగా నవ్వాడు. భార్య తనంతట తాను ఏదీ కావాలని అడగదు. తన అక్క, వదినలు ఎప్పుడూ ఇది కావాలి, అది కావాలి అని ఇంట్లో అడుగుతూండటం, మగవాళ్లు చిరాకుపడటం అతనికి అనుభవమే.

తన స్నేహితులు కూడా మా ఇంట్లోవాళ్ళకి ఈ డబ్బు ఇవ్వాలి అనడం, వాళ్ళ ఆడవాళ్లు ఎప్పుడూ బజారు వెళ్ళి బట్టలు, నగలు కొంటారని అనుకోవడం అతడు వింటూనే ఉన్నాడు. తన విషయం చెపితే వాళ్ళు నమ్మరు కూడా!

నిజానికి ఏనాడూ పూర్ణ ఒంటరిగా బజారుకు వెళ్ళడం, కావలసినవి కొనుక్కోవడం చేయనేలేదు. ఉద్యోగం బాధ్యతతో పాటు భార్యాపిల్లల విషయాలు చూడటం కూడా తనవంతే అయింది. ఊపిరాడని పనులున్నా ఇవి అతడికి విసుగనిపించలేదు. ఎప్పుడైనా పక్కనున్నవాళ్లతో కలిసి బయటికి వెళ్ళరాదా అని తను దెబ్బలాడినా వినడు. సినిమాలైనా, షికార్లయినా తనతోనే. అందుకే చచ్చినట్లు ఇంటికి కొంత సమయం కేటాయించుకోవడం అలవాటు చేసుకొన్నాడు.

అతడు నెమ్మదిగా అన్నాడు, "పూర్ణా! నువ్వు ఏనాడూ ఏవీ కొనమని నన్ను అడగలేదు. బయట ఆడవాళ్ళను చూస్తే ఎన్ని రకాల ఆభరణాలవసరమో నాకు తెలుస్తుంది.

"నాకు నువ్వు ఈ జీవితంలో తృప్తినిచ్చావు. నా భార్య పదిమందిలో ఆధిక్యత పొందాలని నాకుండదా? మొన్న మనింటికొచ్చిన డాక్టరుగారి భార్య నీ నెక్లెసు చూసి ఎంత సరదాపడింది? ఎప్పుడూ వాళ్ళందరూ నిన్ను చూసి అసూయపడే స్థితిలోనే నువ్వు ఉండాలి"

భర్త మాటలు కొన్ని పూర్ణకర్థమవవు. బయటికి ఏ సందర్భంలో తీసికెళ్ళినా, ఏ హడావిడిలోనైనా పిల్లల, తన దుస్తుల విషయాలు, నగల విషయాలు అతడే చూస్తాడు. అతడికి తమ మీదున్న శ్రద్ధకి సంతోషించాలో, ఇటువంటి అల్పవిషయాలకి అతడిచ్చే ప్రాధాన్యత చూసి బాధపడాలో అర్థమవదు.

తన వదినల దృష్టిలో, అతడి కుటుంబం దృష్టిలో తనంత అదృష్టవంతురాలు ఉండదు. ఎక్కడో పల్లెలో పుట్టిన తను ఈ సౌఖ్యాలకి తగదు. తన మనసు వీటిని కోరదని అతడికి ఎప్పుడు అర్థమవుతుంది? అతడు తెచ్చే ఈ నగల అందంకన్నా, వీటి వెనకనున్న అతడి అక్రమ సంపాదనే తనకి కన్పిస్తుందని ఎలా చెప్పడం?

పూర్ణ గట్టిగా మనసులో అనుకొంది. ఎలాగైనా ఈ సమస్యను తను పరిష్కరించుకోవాలి. తనకి, తన బిడ్డలకి అతడి పైసంపాదన అవసరం లేదని చెప్పాలి. అతడికి ప్రభుత్వం ఇచ్చే జీతం చాలని చెప్పాలి.

బతకడానికి నగలు, చీరలు, హోదా, అధికారమే అవసరమా? తమకున్న పరిధిలో తాము బతకలేరా? పూర్ణకి ఒక్కసారిగా ఈ సమాజంపై కోపం వచ్చింది. ఈనాడు ఐశ్వర్యానికి, హోదాకి, ఆడంబరాలకి పెద్దపీట వేసే ఇలాంటి సమాజం ఉన్నన్నాళ్ళూ ఈ అవినీతి, అక్రమాలు తప్పవేమో?

తమకి వచ్చే జీతం ఏమీ తక్కువకాదు. తమ జీతంతో చీకూ చింతా లేకుండా బతకవచ్చును. ఎలాగైనా, బలవంతం చేసైనా అతడి దారి మరల్చాలి.

అన్నపూర్ణకి ఆమధ్య తాము ఇ.ఇ.గారింటికి పెళ్ళికి వెళ్లడం గుర్తువచ్చింది. ఆ పెళ్లికి ఎందరో రాజకీయ నాయకులు వచ్చారు. ఆయనకింద పనిచేసే ఇంజనీర్లు



ఎన్ని విలువైన కానుకలిచ్చారో చెప్పలేం. పొలిటికల్ లీడర్స్ సరేసరి. మహా ఆనందంగా వచ్చి, చెక్కులు అందించారు.

తనకి అప్పుడే ప్రపంచం కొంచెం కొంచెం అర్థమవుతున్నట్లు అన్పించింది. తన భర్త వెండి కంచాలు వధూవరులకి కొంటే తను ఆశ్చర్యపోయింది. తను బంధువులకైనా అలాగ ముట్టచెప్పలేదు. ఎవరో పై అధికారి కొడుకు పెళ్ళికి ఇంత ఆర్భాటమా? ఇంత ఆడంబరమా?

భర్త వాటిని ఎప్పుడు కొన్నాడో కూడా తనకి తెలియదు. ఇ.ఇ.గారి భార్య వాటిని ఎంతో మెచ్చుకొంటూ, "చంద్రమౌళిగారు ఏం కొన్నా ఎంతో బావుంటాయి. ఆయన సెలక్షన్ మీ డిపార్టుమెంటులో ఎవరికీ రాలేదు" అని అంది.

ఇ.ఇ గారు నవ్వుతూ తల గోక్కుంటూ, "ఏమయ్యా మౌళీ! నువ్వు ఎప్పుడు వచ్చినా నాకు చివాట్లు తప్పవేమో" అన్నారు. వాళ్ళందరితో భర్తకి గల సన్నిహితత్వానికి తనకి ఆశ్చర్యం వేస్తుంది.

అతడి స్నేహితులందరూ అన్ని విషయాలలో అతడి సహాయం తీసుకుంటారు. వాళ్ళందరిమధ్యా తను ఇమడలేకపోయింది. ఇ.ఇ. గారి భార్య సరోజమ్మ తనని ప్రేమగా చూసి, అందరితో కలపడానికి ప్రయత్నించింది.

వాళ్ళింట్లో సత్యన్నారాయణ వ్రతం, డిన్నర్ అన్ని హడావుడులూ పూర్తయ్యేవరకూ చంద్రమౌళికి తీరికే లేదు. ఆ పెళ్లిలో ఇ.ఇ. గారి భార్య తమకి వెండి కుంకుమ భరిణెలు పెద్దవి ఇచ్చారు. అందరు ఆడవాళ్లకీ అలాగే ఇచ్చారా అనుకుంటే మళ్లీ అదేం లేదు. తమ డిపార్టమెంటులోని సూపరింటెండెంటుల ఆడవాళ్లకి, వర్క్ ఇనస్పెక్టర్స్ భార్యలకు జాకెట్టుగుడ్డలే పెట్టి పంపించింది.





తనకి అప్పుడే అర్థమైంది. వాళ్లనుండి గౌరవం పుచ్చుకోవాలంటే హోదాలు కావాలి. వాళ్ల కనుసన్నలలో మెలగాలి. నిజానికి ఆ కుంకుమ భరిణలు ఎటెండర్స్ భార్యలకు, వర్క్ ఇన్‌స్పెక్టర్ భార్యలకు ఇస్తేనే బావుండేది. వాళ్లు ఎంత ఆనందిస్తారు. పై అధికారుల విశాలహృదయాన్ని ఎంత మెచ్చుకుంటారు? అబ్బే... తమలాంటివాళ్లకి చేసే మర్యాదలు వాళ్లకి ఎక్కడ జరిగాయి?

తను మధుసూదనంగారు పలకరిస్తే మాట్లాడుతూ, వాళ్ల బాబుని ఎత్తుకుని ముద్దులాడిందని వాళ్లు ఎంత చిరాకుగా చూశారు? పసిపిల్లలు పరమాత్మ ప్రతిరూపాలనైనా గుర్తించారా?

"అన్నపూర్ణా! నువ్వు ఒక ఆఫీసరు భార్యవి. కొంత స్టేటస్ మెయిన్‌టెయిన్ చేయడం నేర్చుకోవాలి. తెలిసిందా? లేకపోతే చంద్రమౌళిగారందరిలో పలచనైపోతారు" అంటూ డి.ఇ.ఇ. గారి భార్య సన్న సన్నగా చివాట్లు పెట్టడం తనకి చాలా బాధ కల్గించింది. తను ఏమీ మాట్లాడలేకపోయింది.

పెళ్లి అయిపోయాక మళ్లీ వాళ్లు తమ ఇంటికి వచ్చారు. తమ కుటుంబానికి ఖరీదయిన బట్టలు తీసుకొచ్చి ఇచ్చారు. ఆయన నవ్వుతూ "చంద్రమౌళీ! ఒక తమ్ముడిలాగ ఈ శుభకార్యంలో సాయపడ్డావోయ్! నువ్వు లేకపోతే చాలా ఇబ్బంది పడేవాడినే" అంటూ భర్త భుజాలమీద చేతులువేసి అభినందించారు.

అప్పుడు చూడాలి భర్త కళ్లల్లోని గర్వం. ఆరోజు అతడు చాలా ఆనందంగా ఉన్నాడు. వాళ్లు తమ ఇంట్లో భోజనాలు పూర్తిచేసుకుని వెళ్లారు.

వాళ్ళు వెళ్లాక పట్టుచీరను చూస్తూ తను అంది. "ఇంతింత ఖరీదు బట్టలు మనకి ఎందుకు? పెళ్ళిలో అందరితోపాటు ఇచ్చేదేదో ఇచ్చారుకదా! మీకు ఇచ్చారంటే అర్థం ఉంది. మధ్యలో నాకెందుకు?"

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ప్రతి నవలకు అందజేసే రు: **3000/–** పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షల కు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

డిసెంబరు చతుర నవల గమ్యం ..................

**సమీక్షకుని పేరు :** ..................

**చిరునామా :** ..................

..................

..................

..................

చంద్రమౌళి తనను ఏనాడూ లేనిది విసుగ్గా చూశాడు. పైకి మాత్రం దాన్ని కప్పి పుచ్చుకొంటూ అన్నాడు."వాళ్ళు ఎంతో దగ్గర వాళ్ళకి పట్టుచీరలు కొన్నారు. మనల్ని వాళ్ళలో కలుపుకొన్నారు. నా అర్ధాంగిలక్ష్మివి కనుక నీకు ఇచ్చారు."

"ముక్కూమొహం తెలియనివాళ్ళ దగ్గర ఇంతింత ఖరీదైనవి తీసుకోవడం నాకు ఇష్టం ఉండదు"

అన్నపూర్ణ మాటలకి అతడు డంగైపో యాడు. ఎంతమాట అంది పూర్ణ. కింది ఉద్యోగస్తులను పై అధికారులు చులకనగా చూస్తారు. కానీ తమ డిపార్టుమెంటు సంగతి వేరు. తమ ఇరిగేషన్ డిపార్టుమెం టులో తమందరికీ ఒక అవినాభావ సంబంధం ఉంది. తను ఇ.ఇ.తోకానీ, ఎస్.ఇ.తోకానీ మంచి సంబంధాలే ఉంచుకొన్నాడు. వాళ్ళకి ఎంత సన్నిహితంగా మసలకపోతే ఈ విధంగా కుటుంబ సభ్యుల్లాగ చూస్తారు.

అతడు చిరాకుగా అన్నాడు, "పూర్ణా! తెల్లవారుజామునే లేచి 'ఎవరు నేర్పారమ్మ ఈ కొమ్మకు, పూలిమ్మని రెమ్మ రెమ్మకు' అంటూ పాట పాడుకొంటూ పూవులు కోసుకొనే పనులే నీకు ఇష్టం. వాటిని పూర్ణగా ఎలా ఇష్టపడుతున్నావో, నా భార్యగా ఈ సొసైటీనీ ఇష్టపడాలి. నా కోసం ఈ బంధాలు ఏర్పరచుకోకతప్పదు" అతడి మాటలు ఆమెను సూటిగా తాకాయి.

ఆ సంఘటన జరిగి చాలాకాలమైనా పూర్ణ దాన్ని మరిచిపోలేదు. అతడు మాత్రం చాలా త్వరగా మామూలు మనిషై పోయాడు.

చంద్రమౌళి ఆఫీసులో అన్యమనస్కంగా ఉన్నాడు. అన్నపూర్ణకి ఏమవుతోంది? ఎందుకు తమ సిరిసంపదల్ని చూసి ఆనందించలేకపోతోంది. తనకి ఎదురు తిరగదు. కానీ భరించలేక భరిస్తున్నట్లు కన్పిస్తుంది. ఇది తన భ్రమా? నిజమా?

అతడు గట్టిగా నిట్టూర్చాడు. తిండికో. బట్టకో వెదుకులాడే యాతన లేదు. తన పరపతికి, ఐశ్వర్యానికి బంధువులంతా ఆనందిస్తున్నారు. కానీ భార్యలో కన్పిస్తున్న అసంతృప్తి తనని నిశ్చింతగా ఉండనీయడం లేదు.

అతడికి చదువుకొనేరోజులు గుర్తువచ్చాయి. ఎన్నో ఆదర్శాలు, మరెన్నో లక్ష్యాలు. ఈ దేశం నాది. ఈ దేశసంపదను సద్వినియోగం చేసే బాధ్యత నాది అన్పించేది. చిన్నప్పటినుండీ ఇంజనీరవ్వాలనే తన కోరికను భగవంతుడు నిజం చేశాడు.

భగవంతుడిని తలుచుకోగానే అతడి మనసు చివుక్కుమంది.

ఉద్యోగానికి వచ్చిన తొలిరోజులు గుర్తువచ్చాయి. నీతి, నిజాయితీలతో బతకాలనీ, మచ్చ లేకుండా జీవించాలనే ఆవేశంతో ఉద్యోగంలో ప్రవేశించాడు.

ఈ ఇరిగేషన్ డిపార్టుమెంటులో మడికట్టుకొని కూర్చునే వాళ్ళను వేళ్ళమీద లెక్కపెట్టవచ్చునేమో? తను ఎ.ఇ.ఇ.గా బాధ్యతలు స్వీకరిస్తోంటే ఎంత గర్వంగా ఫీలయ్యాడో? ఆ రోజుల్లో తన కళ్ళకి ఇ.ఇ.లను ఎస్.ఇ.లను చూస్తే సాక్షాత్తూ భగవంతుడిని చూసినట్లన్పించేది. తను ఎప్పుడు ఆ స్థానాలను పొందుతాడో? అనిపించేది.

ఆ రోజుల్లో భవిష్యత్తంతా బంగారంగా కన్పించేది. అన్నపూర్ణతో వివాహం, ముత్యాల్లాంటి పిల్లలు. ఓహ్ ఇంతకన్నా జీవితానికి కావలసినది ఏమిటుందన్పించింది. మండలంలో ఎ.ఇ.ఇ.గా ఉన్న తనకి మొదటిసారిగా తను భావించిన లోకం వేరు, ఇప్పుడు చూస్తున్న ప్రపంచం వేరన్పించింది.

కంట్రాక్టర్లంతా వేరే ప్రత్యేకంగా లేరు. రాజకీయ నాయకుల బంధుగణం అంతా కంట్రాక్టర్లే. వాళ్ళకే పనులు కేటాయించా

లని ఒత్తిడి. వాళ్ళకి నచ్చచెప్పడం ఎంత కష్టమో తనకి అనుభవపూర్వకంగా తెలిసింది.

ఇక వాళ్ళని నమ్ముకొన్న కార్యకర్త క్లాస్ ఫిఫ్త్ కాంట్రాక్టరులు. పనులు ఎన్ని చూపించినా వాళ్ళకి తృప్తి ఉండదు. పదివేలు ఖర్చుపెట్టి పనిలో పాతికవేలు లాభం రావాలంటారు. మండలంలో ఉండే చిన్న కంట్రాక్టులన్నీ తమవాళ్ళకే ఇవ్వాలని పేచీ.

ఈ పొలిటికల్ లీడర్స్ ప్రజాసేవ చేస్తామని పదవులలోకి వస్తారు. వీరు చేసే ప్రజాసేవ ఇదే. పనులలో నాణ్యత ఉండదు. ఎంతసేపూ డబ్బు రాబట్టుకొందామన్న యావే.

అతడికి తను ఉద్యోగంలో చేరిన తొలిరోజులలో జరిగిన సంఘటన గుర్తు వచ్చింది. మందలపర్తి అనే గ్రామంలో పెద్దచెరువు ఉంది. ఆ చెరువు నీటితో మూడు నాలుగు చుట్టుపక్కల గ్రామాలు వ్యవసాయం చేసుకొంటున్నాయి.

ఆ చెరువు మరమ్మత్తు పనులకి ప్రభుత్వం నిధులు మంజూరు చేసింది. అనుభవశూన్యుడైన మండలాధ్యక్షుడి తమ్ముడికి ఆ కాంట్రాక్టు ఇచ్చేదాకా నాయకులు ఊరుకోలేదు. అతడు పూర్తిచేసిన పని బావుండలేదని వర్క్ ఇన్‌స్పెక్టర్ గోలపెట్టాడు. తను అది చూసి అతడి బిల్లు పాస్ చేయనన్నాడు.

ఇక చూడండి గొడవ. ఒక్కొక్క రాజకీయనాయకుడు రంగంలోకి వచ్చారు. డి.ఇ.ఇ.గారినుండి రికమెండేషన్లు. తను ఎలా భయపడ్డాడో అలాగే అయింది.

ఆ చెరువుకి అతి తక్కువ కాలంలోనే గండి పడింది. చుట్టుపక్కల రైతులు ఎంతో నష్టపోయారు. ఏభైమంది వరకూ ప్రజలు చనిపోయారు. పశువులు కొట్టుకొనిపోయాయి. జరిగిన దారుణం తన మనసుని ఎంత బాధ పెట్టిందో.

కాంట్రాక్టు తీసికొన్నవాడికేం నష్టం? వాడి బంధువుకేం నష్టం. మధ్యలో ప్రజలు పోయారు. తను వాళ్లమీద చిరాకుపడి, ఇంకేం పనులూ కేటాయించనని మొరాయించాడు. జరిగిన నష్టాన్ని వాళ్లు పూడ్చగలరా? పోయిన ప్రాణాలు వాళ్లు తీసుకుని రాగలరా?

కానీ, తను ఒక్కడు ఖచ్చితంగా వుంటే ఏంలాభం? తనని అక్కడినుంచి ట్రాన్స్‌ఫర్ చేయించేశారు. మూడు సంవత్సరాలకి ఒకసారి చేయవలసిన ట్రాన్స్‌ఫర్ ఏవో కారణాలు చూపించి రెండేళ్లకే చేసేశారు.

కొత్తచోట చేరేటప్పుడే ఆఫీసులో హితబోధ. తనని నామినేటెడ్ వర్క్సు విషయంలో చూసీచూడనట్లు పొమ్మని, లేకపోతే ఏ పనికిరాని సెక్షన్‌కో ట్రాన్స్ఫర్ చేస్తామని హెచ్చరిక చేశారు.

ఒకపక్క నందుగాడి అనారోగ్యం, కొత్త ప్రదేశంలో ఉద్యోగంలో నిలదొక్కుకోవలసి రావడం, ఆఫీసులో అందరిదీ ఒకమాటే. తననో వెర్రివాజమ్మగా చూడడం. అబ్బ... ఎంత ఇబ్బంది పడ్డాడు. డి.ఇ.ఇ.లు పిలిచి హితబోధ ప్రారంభించారు. తనని వాళ్లదారికి అడ్డు ఉండవద్దన్నది దాని సారాంశం. తను బాగుపడి వాళ్లని బాగు చేయమన్నారు. ఊరికే వచ్చే టెన్‌పర్సెంట్ లాభం వదులుకోవద్దన్నారు.

తను వాళ్ల మాటలను సీరియస్‌గా తీసుకోలేదు. తనదారి తనది. వాళ్లు ఏం చేయగలరనుకొన్నాడు. ఆ సమయంలోనే జిల్లాలోని డి.ఇ.ఇ ఇంటికెళ్లడం తటస్థించిందో సారి.

ఆ ఇంట్లో ఎక్కడ చూసినా లక్ష్మీదేవి సందడే కనిపించింది. అయినా తనలాంటి ఉద్యోగస్థుడే. తనలాగే చదువుకొన్నాడు. కాకపోతే సీనియర్. అంతే. అతడి భార్య ఒంటిమీద గల నగలు, పిల్లల చదువులు, ఎక్కడికక్కడ ఖరీదైన ఫర్నిచర్... ఇవన్నీ




తనని ఎంతగానో ఆకర్షించాయి.

పెద్ద కాంట్రాక్టులు చేసే వారందరి తోనూ ఆయనకి స్నేహమే.

తను పెరిగిన వాతావరణంలో తను ఇలాగ మారడానికి ఎంతకాలం పడు తుంది. జీతమే సర్వస్వం అనుకొని బ్రత కాలా? లేక వాళ్ళందరిలో కలసి బత కాలా? ఈ జీతంతో తనని నమ్ముకొన్న వారిని పైకి తీసుకొని రాగలడా?

ఆఫీసులో నున్న సూపరింటెండెంట్ అందరి జీవితాలనూ కాచి వడబోసిన వాడిలాగ నవ్వుతూ, "ఏమిటి సార్! అంత లాగ ఆలోచనలలో పడిపోతున్నారు? నలుగురి మార్గంలోనే మనం వెడు తున్నాం. మనం వేరేదారిలో వెళ్లడం లేదుకదా. మీరు కొత్త కనుక ఇలాగ సత మతమవుతున్నారు. అన్నీ మాకొదిలే యండి" అన్నాడు.

అతడి మాటలు కొంత ధైర్యాన్నిచ్చినా ఈ నాయకులతో గొడవలు ఎవరు పడతా రనుకొన్నాడు.

ఆయనే అన్నాడు. "తమకి అనుకూ లంగా ఉన్నవారిని వాళ్ళు బదిలీ అవనీ యరు సార్! వాళ్ళకి ఎదురు తిరిగితేకదా శంకరగిరిమాన్యాలు పట్టవలసిరావడం. వాళ్ళ అవినీతి, బాధ్యతారాహిత్యం ప్రజ లకు తెలియవా? అయినా వాళ్ళే మళ్ళీ మళ్ళీ అధికారంలోకి వస్తున్నారు. ఈ కాలం ప్రజలు కొంత తిన్నా పని కాస్త యినా చేసేవాడు కావాలనుకొంటారేమో"

ఆయన నవ్వుతూ అన్న మాటలలో గల యదార్థం తను గుర్తించాడు. జీతం అయితే నెలకి ఒకసారే వస్తుంది. ఈ పైరాబడి నిత్యం ఉంటూనే ఉంటుంది. రోజుకి మూడు నాలుగువందలు వచ్చే ఈ రాబడి ఎవరికి చేదు? కొద్దికాలం గడవ కుండానే తను అన్ని విషయాలూ ఆక ళింపు చేసుకొన్నాడు. పై అధికార్లందరికీ తనంటే ప్రాణం అయిపోయాడు.



అన్నపూర్ణకి ఆ పూట చేయడానికి పనేం కన్పించలేదు. భర్త, పిల్లల పనులతోనే ఆమెకి రోజంతా గడిచిపోతుంది. మనసు ఏదో తెలియని చిరాకు పడుతోంది.

విజయవాడలో చదువుతూన్న పెద్ద కొడుకు నాలుగు రోజులకోసారి వస్తాడు. ఒక్కోసారి ఒక వారమంతా రాడు. చదువు హడావుడిలో ఉన్నానంటాడు. వాడు అక్కడ ఫ్రెండ్స్‌తో కలిసి చిన్న ఇల్లు తీసుకొన్నాడు. ముగ్గురు స్టూడెంట్లు కలిసి ఉండి, వంటమ నిషితో వండించుకొంటారు.

నిజానికి వాళ్ళ ఖర్చులేమిటో, భర్త వాళ్ళకి ఎలా డబ్బు ఇస్తాడో అన్నపూర్ణకి తెలియదు. వాళ్ళు కూడా తమ విషయాలు తనతో చెప్పరు. పిల్లలకి తండ్రి దగ్గర బాగా చేరిక. ఎటు చూసినా నందు మాత్రం తల్లి దగ్గర అన్నీ ఏకరువు పెడతాడు.

నందుకి ఇంట్లో సందడి కావాలి. తమ్ము డితో, తల్లితో కబుర్లు వేసుకొంటాడు. తండ్రి దగ్గరా చనువు ఎక్కువే.

అన్నపూర్ణకి ఆమధ్య జరిగిన సంఘటన

గుర్తు వచ్చింది.

ఏలూరులో గణపతి ఉత్సవాలు బ్రహ్మాండంగా జరుపుతారు. అసలు గణపతి నవరాత్రులూ, దేవీనవరాత్రులూ ఏ ప్రాంతంలోనైనా బాగా జరుగుతాయి. కానీ తమ ప్రాంతంలో మాత్రం పవర్‌పేటలో, ఏలూరులో ఎక్కడికక్కడే ఎన్నో గణపతి ప్రతిమలు, ఉత్సవాలు.

తమ పేటలో యువకులు నందుని తీసుకొని తన దగ్గరకి చందాకి వచ్చారు. అక్కడికీ తను నాన్నగారు వచ్చాక రమ్మనరా అని చెప్పింది.

నందుగాడు ఒప్పుకొంటేకదా. వాళ్ళకి మిగతా పనులుండవా? మన ఒక్క ఇంటికి నాలుగుసార్లు తిరుగుతారా, నువ్వు వెయ్యి చందా అంటూ మొదలుపెట్టాడు.

తను చేస్తున్నపని వదిలి, చేతులు తుడుచుకొని వచ్చి చందా పుస్తకం తీసుకొంది. వాళ్ళు ఈలోపు ఏవో కబుర్లలో పడ్డారు. తను చందా రాసి పుస్తకం, పాతిక రూపాయలు వాళ్ళకి అందించింది.

అది చూసివాళ్ళు బిక్కమొహం వేసుకొని, తనవైపు ఒకసారి చూసి తల గోక్కున్నారు. నందుకి వాళ్ళ మొహాలు చూస్తే అనుమానం కలిగిందేమో. పుస్తకం తీసిచూశాడు. తర్వాత వాళ్ళతో ఏదో చెప్పి పంపేశాడు.

కృష్ణమోహన్ ఇంటికి వచ్చాక తల్లి చేసిన పని చెప్పి నవ్వాడు. వాడూ నవ్వే. ఈలోపు భర్త వచ్చాడు. పిల్లలు ఆయనకి సంగతి చెప్పలేక చెపుతూ నవ్వుతున్నారు.

తనకి ఎంతో ఉక్రోషం వచ్చింది. నందు వీపుమీద రెండు తగిలించింది. ఎందుకురా అంత నవ్వు? అంత తేలికైన పని నేనేం చేశాను?

వాడు మరింత ఇల్లెగిరిపోయేలాగ నవ్వు. రెండు తగలనిచ్చిందన్న బాధ వాడిలో ఏ కోశాన్నలేదు.

భర్త సోఫాలో కూర్చుని నవ్వుమొహంతో కొడుకులను, అన్నపూర్ణను చూస్తున్నాడు. "డాడీ! అమ్మ ఈ చందా వేయడానికి ఎంత బిల్డప్ ఇచ్చిందనుకొన్నారు. చేతులు బాగా తుడుచుకొంటూంటే పాపం వాళ్ళు ఎంత వేసేస్తుందోనని ఆశపడ్డారు. పాతిక రూపాయలు. అబ్బ... పాతిక రూపాయలు ఎలాగో ప్రాణం బిగబట్టుకొని ఇచ్చేసింది. అమ్మ ఇచ్చిన చందా చూసి వాళ్ళ మొహాలు చూడాలి డాడీ" నందు మాటలాపి మళ్ళీ నవ్వడం మొదలుపెట్టాడు.

లలిత అన్నయ్యల వెనకాల వుండి సంగతి అర్థమవకపోయినా నవ్వసాగింది. నందు మళ్ళీ మొదలుపెట్టాడు. "పోనీ డాడీ, గునపర్రు అన్నపూర్ణమ్మగారి చందా అని వ్రాయవచ్చు కదా! అబ్బే... మళ్ళీ మీ పేరు..."

చంద్రమౌళి కూడా పకపకా నవ్వడం చూసి తను చిన్నపుచ్చుకొంది. తనేం చేసింది? పాతిక రూపాయలంటే ఎక్కువ కాదా? తన మొహం చూసి కృష్ణ అన్నాడు, "అది కాదమ్మా! మన వీధిలోనున్న టీ బడ్డీలవాళ్ళు సైతం అర్థనూటపదహారులకు తక్కువ రాయరు. అలాంటిది పెద్ద ఇంజనీరుగారి భార్యవి పాతిక రాస్తే నవ్వరా? నేనైతే ఆ పాతిక మా గ్రూపువాళ్ళని అసలు తీసుకోనీయను"

వాళ్ళ మాటలు విన్న చంద్రమౌళి, "మీ మమ్మీ దృష్టిలో నేనేం పెద్ద ఇంజనీరుని కాదురా! అందుకే అలాగా చందా వేసింది" అంటూంటే తనకి మరీ ఒళ్ళు మండింది. భర్త తిట్టినందుకు కాదు తోడికోడలు నవ్వినందుకు అన్నట్లు పిల్లలు ఎగతాళి చేసినందుకన్నా భర్త వాళ్ళతో చేతులు కలిపినందుకు ఒళ్ళు మండింది.

అతడు కాసేపున్న తర్వాత కొడుకుని "అయితే వాళ్ళకి ఏం చెప్పావురా?" అని




అడిగాడు.

నందు తండ్రివైపు గర్వంగా చూస్తూ అన్నాడు, "ఈ ప్రాంతంలో డాక్టరుగారు, మీరు ఎక్కువ చందా ఇస్తారుకదా డాడీ! అందుకే అయిదువందలు రాశాను"

అతడు తృప్తిగా తలపంకించాడు. కృష్ణ మోహన్ తమ క్రికెట్‌గ్రూప్ ఫ్రెండ్సంతా వేరొకచోట గణపతి నవరాత్రులు చేస్తున్నారని మరొక అయిదువందలు లాగాడు.

అన్నపూర్ణ గుండె గుభేలుమంది. అంతంత చందాలా? ఏమన్నా బాధ్యత తెలుసుకొని ప్రవర్తిస్తున్నారా?

తనమాట వినేవారెవరు? నందు తన మాటలకి నవ్వుతూ అన్నాడు, "మన స్టేటస్‌కి తగినట్లు ఇవ్వకపోతే అందరూ ఎగతాళి చేస్తారమ్మా"

కృష్ణమోహన్ అప్పుడే తమకి మరొక విషయం చెప్పాడు. అంతకుపూర్వం జరిగిన ఎన్నికలలో నిలబడిన నాయకుడొకరు ఈ పిల్లలందరినీ తమపార్టీ పెట్టే మీటింగ్‌కి వచ్చి, చప్పట్లు కొట్టమన్నారుట. వాళ్ళ అన్నయ్యలను, తల్లిదండ్రులను పెద్దలందరినీ మరీ మరీ తీసుకొని రమ్మన్నారుట.

ఈ పిల్లలందరూ కలిసి క్రికెట్ బేట్స్ కొనిస్తే తప్పక వస్తామన్నారుట. మొత్తానికి వాళ్ళు ఆయన చేత క్రికెట్ సామాగ్రి కొనిపించారుట.

ఏమాత్రం ఖాళీ దొరికినా వీణ తీసుకొని వాయించడం అన్నపూర్ణకి అలవాటు. మనసు తల్లిదండ్రులవైపు వెళ్ళి బెంగగా ఉన్నా వీణానాదంలోనే సేద తీరుతుంది.

అన్నపూర్ణకి భగవంతుడు మంచి గొంతు ఇచ్చాడు. పాత పాటలన్నా, కృష్ణశాస్త్రిగారి పాటలన్నా ఆమెకి ఎంతో ఇష్టం. ఎదురింటి వాళ్ళ అమ్మాయి వీణ నేర్చుకొంటూంటే వీధి వాకిలిలో నిలబడి తను ఆసక్తిగా గమనించ సాగింది.

"హిమగిరి తనయే... హేమలతే" అని ఆ అమ్మాయి చక్కగా కీర్తన వాయిస్తోంటే తన మనసు గాలిలో తేలిపోసాగింది. ఎప్పుడు వచ్చాడో ఏమో భర్త, వీణపాఠం పూర్త య్యాక తను ఇటు తిరిగినప్పుడు కన్పించాడు.

అతడు తనని ఏకాగ్రతగా చూస్తూ, "పూర్ణా! నీకు వీణ నేర్చుకోవాలనుందా?" అని అడిగాడు. తను అతడు అడగడంలోని విషయాన్ని అర్థంచేసుకోలేక "ఈ వయసులో నేర్చుకొంటే నవ్వుతారేమో?" అంది.

తన మొహమాటాన్ని, వీణపై గల కోరికను అతడు గ్రహించాడు. తర్వాత నవ్వుతూ అన్నాడు, "పిచ్చి పూర్ణా! విద్య నేర్చుకొందుకి వయసు ఏమిటి? కుతూహలం, శ్రద్ధ ఉండాలిగానీ ఎప్పుడైనా నేర్చుకోవచ్చును"

ఆ సంభాషణతో తను ఆ విషయమే మరిచిపోయింది. కానీ పదిరోజులు గడవకుండానే తమ దగ్గర పనిచేసే వర్క్ ఇనస్పెక్టర్ చక్కటి అందమైన వీణను తీసుకొచ్చి ఇచ్చాడు. ఆయనది బొబ్బిలిట. భర్త అతడిని పంపి తమకు వీణ తెమ్మన్నారుట.

ఆ వీణను తాకుతోంటే ఒక అనిర్వచనీయమైన ఆనందం. మర్నాటికి ఎదురింట్లో పాఠం చెప్పే గురువుగారు తమ ఇంటికి వచ్చారు. ఆయన తనను చూసి నవ్వుతూ అన్నారు, "అమ్మా! మిమ్మల్ని చూస్తే అపర సరస్వతిలాగా ఉన్నారు. మీలాంటి శ్రద్ధగల వాళ్ళకి విద్య నేర్పడంకన్నా ఆనందం ఏముంటుంది?"

ఆయనకి తన మీద ఏర్పడిన వాత్సల్యం వలననో, తన శ్రద్ధవలననో తనకి ఆయన విద్యనంతా ధారపోశారు. తనకంటూ ఒక ఆనందాన్ని కల్పించారు.

అన్నపూర్ణకి వీణను ఒడిలోకి తీసుకొంటూంటే ఒళ్లు గగుర్పొడుస్తుంది. గంటలు నిముషాల్లాగ పరుగులు తీస్తాయి. ఈమధ్య వాయించుకోవడం అవలేదనుకుంటూ

మెత్తటి గుడ్డతో వీణను తుడిచి, శ్రుతి చేసికొని వాయించడం మొదలుపెట్టింది.

కొన్ని కీర్తనలు వాయించాక చివరలో 'సంగీత సాహిత్య సమలంకృతే, స్వరరాజ పద యోగ మంత్రాత్మికే" పాటను వాయించసాగింది. మంచి సినిమాలలోని చక్కటి పాటను అన్నపూర్ణ వీణపై వాయిస్తూ ఉంటుంది.

పాట పూర్తయ్యాక వీణ దాచబోతూంటే చంద్రమౌళి "పూర్ణా! 'మనసే అందాల బృందావనం' పాట వాయించి విన్పించవా" అని అడిగాడు. బయటినుండి వచ్చినవాడు బట్టలైనా మార్చుకోకుండా కూర్చోవడం చూసి కాఫీతెచ్చి ఇస్తానంది.

"నువ్వు పాటలు వాయిస్తోంటే ఎంత ఆనందంగా ఉందో పూర్ణా! ఇప్పుడే కాఫీ వద్దు. వాయించు"అంటోంటే లేవబోయిన పూర్ణ మళ్లీ వీణను చేతిలోకి తీసికొంది.

అతడికి ఆ పాట అంటే ఇష్టం. అలాగే 'నగుమోమూ గనలేని నా జాలీ తెలిసీ...' కీర్తనంటే ప్రాణం. అతడు అడగకుండానే 'నగుమోము' కూడా వాయించింది.

భార్య నుదుటిమీద అలుముకొన్న చిరుచెమటలు చూస్తూ అన్నాడు, "పూర్ణా! చాలా సేపటినుండి వాయించినట్లున్నావు. నేను వచ్చి మరింత శ్రమ పెట్టాను"

పూర్ణ నిజాయితీగా అంది, "వీణ వాయించడంలో శ్రమ ఏముంది? మీరే రోజంతా పనిచేసి శ్రమపడి వచ్చారు. దీన్ని నాకు అందించిన వారు మీరు. మీకోసం ఎంత సేపైనా వాయించగలను"

అతడు ఆప్యాయంగా భార్య చేతులు నొక్కాడు.



ఆ రాత్రి సన్నిహితంగా నున్నపుడు పూర్ణ నెమ్మదిగా చెల్లి చేసిన హెచ్చరిక, తమ గురించి బంధువులు అనుకొంటున్న మాటలు చెప్పింది.

మనం ఆనందంగా ఉండే సమయంలో ఆ బరువైన విషయాలెందుకంటూ అతడు సంభాషణ తప్పించేశాడు.

మర్నాడుదయం పొరుగూళ్ల రైతులు వచ్చి గోల పెట్టారు. గుర్రపుడెక్క మొక్కలు కాలువలలో ఎక్కువగా పెరిగిపోయాయిట. ఆ మొక్కలు కాలువలకడ్డం పడటం వలన నీటి సరఫరా సరిగ్గా అవడంలేదుట. పంట పొలాలు ఎండిపోతున్నాయి అంటూ వాళ్లు ఫిర్యాదు చేశారు.

పక్క గదిలో ఏదో పని చేసికొంటున్న అన్నపూర్ణ వాళ్లందరినీ చూసి గుమ్మం వెనుకగా నిల్చుని వినసాగింది. వచ్చిన వాళ్లందరూ సన్నకారు రైతులు. కేవలం వ్యవసాయం మీద ఆధారపడి బతుకుతున్నారు. చంద్రమౌళి వాళ్ల మాటలన్నీ ఓపికగా విని అన్నాడు "కాలవలకడ్డం పడుతున్న ఆ గుర్రపు డెక్కల మొక్కలను తీయమనే కదయ్యా మన ప్రభుత్వం కోట్లు ఖర్చు పెడుతున్నది. లబ్ధిదారులైన మీరే ఆ కాంట్రాక్టులు తీసికొంటే బావుంటుంది. మీరు ఆ పనిచేయరు. ఆ కాంట్రాక్టులు తీసికొన్న వాళ్లు మీలాగ శ్రద్ధగా పనిచేయరు! మరి నన్నేం చేయమంటారో చెప్పండి"

వచ్చినవాళ్లు ప్రాధేయపూర్వకంగా చూస్తూ అన్నారు. "మీకు తెలియందేముంది చెప్పండి. ఆ యం.ఎల్.ఏ బంధువులు ఈ కాంట్రాక్టులన్నీ బినామీ పేర్లతో తీసేసుకొన్నారు. ఆళ్లు సొమ్ము తింటే తిననీయమని ఊరుకొన్నాం. అధికారం ఆళ్ల సేతులలో ఉంది. అయితే సొమ్ము తిని కూడా పని సరిగా పూర్తి చేయడం లేదు. మేమందరం వెళ్లి వాళ్లని నిలదీస్తే మీకు దిక్కున్నచోట చెప్పుకోండన్నారు"

చంద్రమౌళి కాసేపు మాట్లాడలేదు. ప్రభుత్వధనం సరిగ్గా పనులకు ఉపయోగపడటం లేదని అతడికి తెలుసు. ఏం చేస్తాడు?

ప్రభుత్వం టెండర్లకి పిలిచినపుడు పొలిటికల్ లీడర్సే ముందుగా వస్తారు. ఫలానా ఊళ్లో తమ తమ్ముడు ఉన్నాడనో, తమ బావమరిది ఉన్నాడనో చెపుతారు. వాళ్ల పేర్ల మీద కాంట్రాక్టులు కైంకర్యం చేసికొంటారు.

లబ్ధిదారులుగానున్న ఆయకట్టుదారులు ప్రభుత్వం చేపట్టే కార్యక్రమాలలో భాగస్వాములైతే బావుంటుంది. కాని అది జరగడం లేదు. బినామీ పేర్లతో ఈ నాయకులు పల్లెల్లోని పనులు సొంతం చేసికొంటున్నారు. ఒకసారి ఇలాగే పని చూడటానికి ఒక గ్రామం వెళితే ఆ పని తీసికొన్న వ్యక్తే ఆ గ్రామంలో లేడు. మండలాధ్యక్షుడే లేని పేరుని, వ్యక్తిని సృష్టించి పని కైవసం చేసికొన్నాడని తేలింది.

చంద్రమౌళి పట్టించుకోకపోతే ఈ ఏడాది తాము పంటల మొహం చూడలేమని వాళ్లు కాళ్లా వేళ్లాపడి చెప్పారు.

చంద్రమౌళి వర్క్ ఇనస్పెక్టర్‌ని పిలిపించి విషయం చెప్పాడు. అతను తను ఎన్నిసార్లు చెప్పినా వర్క్ శుభ్రంగా అనుకొన్న వేళకి కంట్రాక్టర్ పూర్తి చేయడం లేదని చెప్పాడు.

చంద్రమౌళి ఈసారి విషయాన్ని తేలికగా వదలదలచుకోలేదు.

పనులు కాంట్రాక్టు తీసికొన్నవాళ్లని పిలిపించాడు. తాను నాలుగు రోజులలో అటువైపు కేంప్ వేస్తున్నానని, అప్పటికి పంట కాలువలలోని నీటి సరఫరాకి ఎటువంటి అంతరాయం ఏర్పడకూడదని చెప్పాడు.

వాళ్లనీళ్లు నములుతూ తామంటే గిట్టని ప్రతిపక్షంవాళ్లు రైతులని రెచ్చగొడుతున్నారని, అతడిని ఆ విషయాలు పట్టించుకోవద్దని చెప్పారు. తాము చేస్తున్నది తప్పని ఒప్పుకోరు. తినే డబ్బు తిన్నా పని శ్రద్ధగా చేయడానికి ఇష్టపడరు.

వాళ్లతో అతడికి అరగంటసేపు వాదన జరిగింది. అతడి పర్సంటేజీ అతడు తీసికొంటూ అలాగ గొడవ చేయడం వాళ్లకి నచ్చలేదు.

అంతవరకూ ఓపిక పట్టిన అతడు చివరికి కోపంగా అనేశాడు. "ఈ పనులవలన మీకు ఎంత లాభం వస్తుందో నాకు తెలుసును. మీరుగానీ నేనుగానీ ఆ రైతులు, వాళ్ల పనులు ఉండటంవలన బతుకుతున్నాం. వాళ్లు ఓర్పు చూపిస్తున్నారని మనం చెలరేగితే, మనకి శృంగభంగం తప్పదు"

ఈ గొడవలతో విసిగిపోయి ఇంటికి వచ్చిన అతడిని అన్నపూర్ణ మౌనం మరింత చిరాకు పెట్టింది. ఏమనడానికీ వీల్లేకుండా అతడి అన్నావదినలు, తండ్రి వచ్చి ఉన్నారు. వాళ్లతో కబుర్లు చెపుతూ, వాళ్ల విషయాలన్నీ ప్రేమగా తెలిసికొన్నాడు.

తండ్రికి నలతగా ఉందంటే అతడు కలవరపడ్డాడు. ఆయనకి ఈమధ్య తరచుగా గుండెనొప్పి వస్తోందిట. మర్నాడు అతడు తండ్రిని మంచి డాక్టరుకి చూపించాడు. ఆయన రాసిన మందులన్నీ కొని వాళ్లని పంపాడు.

రెండవ అన్నగారు అర్జెంటుగా పదివేలు సర్దమని ఫోనుచేశాడు. అతడిది పక్కా వ్యాపారపు బుర్ర. వచ్చి ఛార్జీలు ఖర్చు పెట్టుకోవడం ఎందుకని ఫోను చేశాడు. చంద్రమౌళి ఏమనగలడు? చూసి పంపుతానన్నాడు.

మనసును సర్దుకోలేక అన్నపూర్ణతో ఆ విషయాలే ఎత్తాడు. డబ్బు భర్త పంపక పోడు. ఇంకెందుకీ ఆవేదన? వాళ్లు ఎలాగైనా అతడు సర్దుతాడనే ధైర్యంతో అడుగుతున్నారు.

అన్నపూర్ణ ధైర్యం కూడదీసికొని అంది, "మీకు పైరాబడి వస్తోంది కనుక వాళ్ల అవసరాలు ఎక్కువవుతున్నాయి. ఇదే మనం మన జీతం మీద ఆధారపడి బతుకుతున్నప్పుడు అడుగుతారా? ఎంత మాత్రం అడ

గరు. పైన వచ్చే డబ్బు పైపైనే ఖర్చయిపో తోంది"

అతడు చిరాకుగా అన్నాడు "బోడి తలకీ మోకాళ్లకీ ముడిపెట్టకు. ఇలాగ అందరికీ సర్దుతూంటే పిల్లలకి ఏం దాచగలమని నా భయం. కుటుంబాలలో ఎవరు ఎవరి దగ్గర తీసికొన్నా అప్పుగా తీసికోవాలి. మళ్లీ వీలునిబట్టి తీర్చాలి"

అన్నపూర్ణ అతడివైపు విచిత్రంగా చూసింది. అప్పుగా ఒకరిదగ్గర నుండి ఒకరు తీసికోవాలని భర్త సూచించడమా? ఇదొక ఉమ్మడి కుటుంబ వ్యవస్థ. అందరూ కలిసి ఉన్నట్లేననే కదా అతడు, అతడి అన్న దమ్ములూ అంటూంటారు.

"ఉమ్మడి కుటుంబంలో పొరపొచ్చాలు తెచ్చానని తనను అందరూ అంటారు. ఎవ రైనా అభివృద్ధి చెందారన్నా, పతనమైపో యారన్నా అతడి వెనుకనున్న భార్యే కారణ మంటారు. మీరు ఇలాగ ప్రవర్తించడానికి నాకు ఎంతవరకు బాధ్యత ఉందో మీకు తెలుసును కానీ పైవారికి తెలుస్తుందా?

"మొన్నటికి మొన్న రైతులు వచ్చి ఎంత ఆక్రోశించారు? అలాగే ఆమధ్య యువకులు కొందరొచ్చి తమకు ప్రభుత్వ పనులు కేటా యించమని మిమ్మల్ని అడగలేదా?

"కొందరి పబ్బం గడపడానికి ఎందరికో అన్యాయం చేస్తున్నారు. భగవంతుడు ఆశీ ర్వదించి మీకిచ్చిన అధికారాన్ని దుర్విని యోగం చేయడం కాదా? "

అతడు నిర్వీర్యుడయ్యాడు. తన అన్న పూర్ణ ఏనాడూ ఇల్లు, పిల్లలు తప్ప ఏమీ పట్టని అన్నపూర్ణ తనని ఈనాడు ప్రశ్ని స్తోంది.

"పూర్ణా! నేను ఏది చేసినా మీకోసం, పిల్లల కోసం కాదా? "

పూర్ణ మనసు దానితో మరింత విలవిల లాడింది. "ఏమండీ! ఏనాడైనా ఈ ఆడంబ రాలు కావాలని నేను మిమ్మల్ని కోరానా? ఒక అంతస్థు సంపాదించమని ఒత్తిడి చేశానా? "

అతడు కోపంగా అన్నాడు. "ఏ ఆడంబ రాలూ, అంతస్థులూ అక్కరలేనపుడు ఏ గుమాస్తానో పెళ్లి చేసుకోలేకపోయావా? అప్పుడు సరిపోయేది.

"అసలు నాదే తప్పు. భార్యాపిల్లలని అపు రూపంగా చూడాలనుకోవడం, తన వాళ్లం దరూ అభివృద్ధి చెందాలనుకోవడం నా బల హీనతే"

అన్నపూర్ణకి అతడి వాదన అర్థరహితంగా అన్పించింది. అందుకే నెమ్మదిగానైనా ఖచ్చి తమైన స్వరంతో అంది, "ఈ లోకంలో అందరూ వాళ్లకి తోచిన మార్గాలలో కుటుం బాలను పోషించుకొంటూనే ఉన్నారు. దాని కోసం నైతిక విలువలకి తిలోదకాలివ్వాలా?

"మీరు... మీరే కాదు మీ మగవాళ్లంతా తమ తప్పుడు ప్రవర్తనలకి భార్యలే కారణ మంటారు. అసలు తప్పంతా మీ ఆలోచన లలోనే ఉంది. ఇదే నా జీతం. ఇందులోనే నువ్వు, బిడ్డలు బతకాలి అంటే ఏ భార్య ఒప్పుకోదు?

"మీ భార్యలు సాదాసీదాగా ఉంటే మీకు నచ్చదు.

"వాళ్లకి పట్టుబట్టలు కట్టబెట్టాలి. నగలు చేయించి నిలువెత్తునా ముంచేయాలి. ఎందుకంటే ఆ భార్యల ద్వారా మీ ఆడం బరం సమాజానికి చాటుకోవాలి. మీకు మానసిక తృప్తి అవసరంలేదు. సమాజం ఇచ్చే గుర్తింపు కావాలి"

అన్నపూర్ణకేమైనా పిచ్చిపట్టిందా అన్నట్లు చూశాడు చంద్రమౌళి. వ్యంగ్యంగా అన్నాడు "అవునులే. ఎక్కడో పల్లెటూర్లో ఉన్నదాన్ని తెచ్చి అందలం ఎక్కించానుకదా! అందుకే నేను, నా సంపాదన వెగటైపోయాం"

అన్నపూర్ణ సహనం చెదిరిపోయింది. తన భర్త మాటలు వాడిముళ్లల్లాగ ఆమె




హృదయానికి గుచ్చుకొన్నాయి. తమ గదులలో నుండి ఈ గొడవ వింటున్న నందు, కృష్ణ భయపడ్డారు. తమ తల్లి ఆవేదన, తండ్రి అధికారం వాళ్లని విచలితులను చేస్తోంది.

అన్నపూర్ణ ఇంక ఊరుకోలేకపోయింది. "ఈ పల్లెటూరు పిల్ల కుటుంబం ఉన్నంతలో తిని బతికిన కుటుంబం. నీతీనిజాయితీలే ప్రాణమనుకొన్న వారి రక్తంతో బతికిన శరీరం ఇది.

"ఇంక నా కోసం అంటూ మీరు ఏ అవినీతి సంపాదనలూ చేయకండి. మీ జీతంలో బతకడానికే నేను నిర్ణయించుకొన్నాను.

"గాలిమేడల్లాంటి ఈ అంతస్తులు కాలంలో ఎప్పుడు కూలిపోతాయో తెలియదు. ఒక రిక్షావాడి భార్య నిశ్చింతగా తన భర్త సంపాదన అనుభవిస్తోంది. కానీ నేను... నేను ఎన్నో భయాలకి గురై, నిశ్చింత అన్నమాట మరిచిపోతున్నాను. పిల్లి కళ్లు మూసుకొని పాలు తాగితే లోకం చూడలేదనుకొంటే సరా? ఎందరు మన గురించి అనుకొంటున్నారో మీకేం తెలుసు? ఎన్నిసార్లు ఈ ప్రస్తావనలు మనమధ్య రాలేదు? మీకు... మీకు నేనంటే నేనంటే.. "

ఆపై అన్నపూర్ణకు నోటినుండి మాట రాలేదు. కళ్లు పెద్దవై తీక్షణమైపోయాయి. గుప్పిళ్లు బిగుసుకొని పోయాయి. నోటి నుండి విచిత్రశబ్దాలు వస్తోంటే మనిషి, నిల్చున్న పళంగా కిందపడిపోయింది.

క్రమేపీ ఆమె కళ్లు మూసుకొనిపోయాయి. అస్థిమితంగా తలా, కాళ్లూచేతులూ వణికిపోవడం మొదలుపెట్టాయి. చంద్రమౌళి ఆమెను గభాలున ఎత్తుకొని తన గదివైపు తీసికెళ్లాడు. పిల్లలు అతడు వేసిన కేకలకి వెంటనే ఇవతలికి వచ్చారు.

చంద్రమౌళి భార్యను పక్కమీద పడుకోపెట్టి డాక్టరుగారికి ఫోను చేశాడు.

శాంతమ్మగారు పెరట్లో పని వదిలేసి లలిత వెనకాల పరుగెత్తుకొని వచ్చింది. ఆవిడకి భార్యాభర్తల వాదనేదీ తెలియదు. లలితకి కథ చెపుతూ పెరట్లో పనిచూస్తోంది.

లలిత, కృష్ణ తల్లి పరిస్థితి చూసి ఏడ్పు మొదలు పెట్టారు. చంద్రమౌళికసలు కాళ్లూ చేతులూ ఆడటంలేదు. నందుని మళ్లీ డాక్టరుకి ఫోను చేయమన్నాడు. అన్నపూర్ణని పట్టుకోవడం శాంతమ్మగారి వలన అవడం లేదు. ఆవిడకి సాయంగా అతడు కూడా కాళ్లు గట్టిగా పట్టుకొని కూర్చున్నాడు. లలిత తెచ్చిన నీళ్లు అందుకొని ఆవిడ అన్నపూర్ణ మొహం తుడవసాగింది.

డాక్టరుగారు వచ్చి పరిస్థితి చూశారు. అన్నపూర్ణకి ఫిట్స్ వచ్చాయని చెప్పి ఇంజక్షన్ చేసి మందులిచ్చారు. కాసేపటికి సర్దుకొని నిద్రపోతుందని చెప్పి వెళ్లిపోతూ "చంద్రమౌళిగారూ! ఆవిడ బలహీనంగా కన్పిస్తున్నారు. ఏ పరిస్థితిలో ఇలాగ పడిపోయారు? " అని అడిగారు.

చంద్రమౌళి ఏం చెప్పగలడు? అతడు పెదవి విప్పే లోపు శాంతమ్మగారు అంది. "అయ్యో నాయనా! ఆయన పిల్లని పువ్వులాగ చూస్తున్నాడు. మా అమ్మాయి వింటుందా! మేమెందరం ఉన్నా పనులన్నీ నెత్తిన వేసుకొంటుంది. విశ్రాంతి లేకపోతే ఇలాగే వస్తాయి" అంటూ కళ్లనీళ్లు నింపుకొన్నారు.

డాక్టరుగారు చెప్పినట్లే ఒక అరగంటకి అన్నపూర్ణ శరీరం యధాస్థితికి వచ్చింది. ఆమె నిద్రపోతున్నా గుండెలు ఆయాసంతో ఎగిసిపడుతున్నాయి. చంద్రమౌళి పిల్లల వైపు చూశాడు. వాళ్లు ఎంతో దైన్యంగా తల్లి పక్క దగ్గర కూర్చున్నారు. ఆ తల్లీబిడ్డలవైపు చూసిన చంద్రమౌళి మనసు నీరయింది.

పిల్లల్ని ఎలాగో సమాధానపరిచి భోజనాలు పెట్టించాడు. శాంతమ్మగారు ఎంత

చెప్పినా అతడు భోజనం చేయలేదు. ఆకలి లేదంటూ మృదువుగా తిరస్కరించాడు. శాంతమ్మగారు వేడిగా హార్లిక్సు కలిపి ఫ్లాస్కులో పోసి అతడి గదిలో పెట్టారు.

లలిత ఫోనులో వేణు అన్నని పిలిచి తల్లి అనారోగ్యం సంగతి చెప్పడం చంద్రమౌళికి విన్పించింది. అతడికి మనసంతా అపరాధ భావంతో నిండిపోయింది.

ఈనాటి ఈ అశాంతికి కారకుడు తానే కదా అన్న బాధ అతడిని క్రుంగదీస్తోంది. తాను ఏం చేశాడు. అన్నపూర్ణ మనసు మెత్తనిదని తెలిసి వాదన పెంచాడు. కనీసం ఆమె బాధపడుతున్నప్పుడైనా సంభాషణ ఆపాడా? లేదే ఈ రోజు తన తల మీద ఏ దెయ్యం కూర్చుంది?

తన ప్రవర్తనకి వాళ్లు కారకులా? తనని ఎక్కువగా సంపాదించమని వాళ్లు వేధించారా? అయినా ఇదేం ఖర్మ. ఈ లోకంలో కష్టంతో కొందరు, తెలివి తేటలతో కొందరు, అదృష్టం అందలం ఎక్కించి కొందరు పైకి వస్తున్నారు.

ఎందరు పక్క మార్గాలలో సంపాదన చేయడం లేదు? డాక్టర్లు, లాయర్లు... ఒక రేమిటి, అన్ని చోట్లా అవినీతి ఉంది. ఎక్కడో నీతిని, న్యాయాన్ని పట్టుకొని మడి కట్టుకొని కూర్చున్నవాళ్లు ఉన్నారు. అసలు అలాంటి వాళ్లు లేరని తను అనగలడా? అనలేడు.

ఎంత దురదృష్టం? తన సంపాదన తన భార్యకి సుఖ, సంతోషాలను కలిగించడానికి బదులుగా అశాంతి కలిగిస్తోంది. ఈనాటి నుండీ పూర్ణ విషయంలో తను జాగ్రత్తగా ఉండాలి.

రాత్రి పది గంటలప్పుడు అన్నపూర్ణకి తెలివి వచ్చింది. తన పక్కనే పిచ్చివాడిలాగ కూర్చున్న భర్తను చూస్తే ఆమెకి కళ్లనీళ్లు తిరిగాయి.

ఆమెను నెమ్మదిగా లేపి చంద్రమౌళి హార్లిక్స్ తాగించాడు. దానితో అన్నపూర్ణకి కొంచెం శక్తి వచ్చినట్లనిపించింది. భర్తవైపు చూసిన ఆమెకి బాధ కలిగింది.

అతడు ఎప్పుడూ ఎంతో ఫ్రెష్‌గా ఉంటాడు. అలాంటిది నీరసంగా, చెదిరిన క్రాఫ్‌తో వడిలిన మొహంతో ఎంతో బాధను, అలసటను సూచిస్తున్న కళ్లతో ఎలాగో ఉన్నాడు.

అన్నపూర్ణకి అతడు భోజనం చేసి ఉండడన్పించింది. అతడిని భోజనం చేసి రమ్మని చెప్పింది. అంత నీరస పరిస్థితిలో తన గురించి ఆలోచిస్తున్న భార్యను చూస్తే అతడి అపరాధ భావం రెట్టింపయింది.

భార్య బలవంతంపై తనూ ఒక గ్లాసు హార్లిక్సు తాగాడు. గదిలోని అలికిడికి బయట కూర్చుని కునికిపాట్లు పడుతున్న గౌరి పరుగెత్తుకొని వచ్చింది.

"అమ్మగారూ! ఇప్పుడెలా ఉంది?" అంటూ అడుగుతున్న దాన్ని అన్నపూర్ణ ప్రేమగా చూసింది. "నాకేమైందే పిచ్చి మొద్దూ! కొద్దిగా కళ్లు తిరిగి చిరాకుచేసింది" అంటున్న అన్నపూర్ణతో ఏదో చెప్ప బోతున్న గౌరిని చంద్రమౌళి వద్దన్నట్లు ఆపేశాడు.

గౌరి వెళ్లి పిల్లల్ని కూడా లేపి తీసికొచ్చింది. 'అమ్మా! బావుందా' అంటూ నిద్ర మత్తు కళ్లతో అడుగుతోంటే అన్నపూర్ణ తల్లి మనసు తల్లడిల్లిపోయింది.

అన్నపూర్ణ గడియారం వైపు చూసింది. ఇన్ని గంటలు తను తెలివి లేకుండా పడుకొందా? తలుపు దగ్గరకు వేసి వస్తున్న చంద్రమౌళికి అన్నపూర్ణ మొహంలోని భావాలు అర్థమయ్యాయి.

ఆమె పక్కన చోటు చేసికొని పడుకొంటూ ఆర్ద్రంగా, బాధగా అన్నాడు. "చూడు పూర్ణా! ఈ పక్క నిన్ను నవ వధువుగా చూసింది. గర్భవతిగా కొత్త అందాలు సంతరించుకోవడం చూసింది. బాలింతరా

లిగా, మాతృమూర్తిగా రీవిగా అధిరోహించడం చూసింది. ఇప్పుడు ఇన్నాళ్లకి ఇలాగ... అనారోగ్యస్థితిలో పడుకోవడం చూస్తోంది"

అతడికి గొంతుక్కి అడ్డుపడ్డట్టయింది. "వద్దు పూర్ణా! నీవు ఇలాంటి స్థితిని ఎప్పుడూ పొందవద్దు. ఈ పక్కా, ఈ గదే కాదు ఈ నీ భర్త మనసు కూడా దాన్ని తట్టుకోలేదు. నువ్వు ఉత్సాహంగా, ఉత్తేజంగా, నా జీవన సహచరిగా ఉండటమే నాకు కావాలి. తెలిసిందా పూర్ణా!"

అన్నపూర్ణకి అతడి ఆవేదన అర్థమైంది. తనకి కూడా మనసు పిండినట్లవుతోంటే అతడిని హత్తుకొని పోయి గుండెలలో తల దాచుకొంది.

అతడు భార్య తలను గట్టిగా అదుముకొన్నాడు. తలపై గాఢంగా ముద్దుపెట్టుకొన్నాడు. ఆమె చేతులు అతడిని గట్టిగా చుట్టుముట్టాయి.

అతడు డగ్గుత్తికతో అన్నాడు "పూర్ణా! నీ భర్త మనసు లేనివాడు, మూర్ఖుడుకాదు"

అతడు ఇంకా ఏదో చెప్పబోతూంటే తన చేతిని అతడి పెదవులకడ్డం పెట్టి వారించింది. "మీరు నిద్రపొండి. ప్లీజ్" అంటున్న ఆమెను ఆర్తిగా చూస్తూ, ఆ చేతిని తన చేతులలో బంధించాడు.

మర్నాడు వేణు బయలుదేరి వచ్చేశాడు. తల్లిని చూసి అతడు ఆశ్చర్యపోయాడు. "అదేమిటమ్మా! ఇంత నీరసంగా కన్పిస్తున్నావు, ఏమైంది నీకు" అంటూ కలవరపడ్డాడు.

అన్నపూర్ణ పైకి నవ్వి ఊరుకొన్నా, పిల్లల్ని, భర్తని తన అనారోగ్యంతో కలవరపెట్టినందుకు సిగ్గుపడింది. శాంతమ్మగారు ఆమెను సన్నసన్నగా చివాట్లు పెట్టింది.

"రాత్రి మేమంతా ఎంత భయపడ్డామో తెలుసా తల్లీ! నువ్వు ఏ పనీ చేయవద్దు. నీకు నచ్చినట్లు మేం చేస్తాం. సరేనా? హాయిగా రత్నాల్లాంటి పిల్లలు, అనుకూలుడైన భర్తతో చీకూ చింతా లేకుండా గడపక ఈ అనారోగ్యమేమిటి? "

డాక్టరుగారు చంద్రమౌళిని అన్నపూర్ణను జాగ్రత్తగా చూడమని హెచ్చరించారు. మానసిక అశాంతి, చిరాకులుగానీ శారీరక దుర్బలత్వంగానీ ఫిట్స్ రావడానికి కారణాలన్నారు. ఆయన దృష్టిలో మానసిక సమస్యలు అన్నపూర్ణకి ఏమిటుంటాయి? అందుకే శారీరక శ్రమను తగ్గించుకోమని చెప్పాడు.



ఆఫీసులో అన్నపూర్ణ అనారోగ్యం విషయం తెలిసింది. వాళ్లంతా రావడం, పలకరించడం మరింత ఇబ్బందిగా ఆమెకి అన్పించింది.

చంద్రమౌళి, అతడి స్నేహితుడు గోపాలరావు హోటల్లో కూర్చుని కాఫీ, టిఫిన్ తీసికొంటున్నారు. గోపాలరావు కూడా ఎ.ఇ.ఇగా పని చేస్తున్నాడు. ఇద్దరూ అరమరికలు లేకుండా స్వంత విషయాలు చెప్పుకొంటారు.

చంద్రమౌళి అన్నపూర్ణ పడుతున్న అలజడి, తమమధ్య ఉద్యోగం విషయంలో వస్తున్న అభిప్రాయ భేదాలు చెప్పాడు.

గోపాలరావు చంద్రమౌళినే కేకలేశాడు. "అన్ని విషయాలూ భార్యా పిల్లలకి చెప్పాలా? ఉద్యోగ జీవితం వ్యక్తిగతమైనది. దానిలోని సాధక బాధకాలు మగవాళ్లవే. అలాగే ఇంటి విషయాలు ఆడవాళ్లవే. సమాజంలో గుర్తింపు పొందాలంటే ఏవేవో చేస్తారు. అన్నీ అందరికీ చెప్పవలసిన అవసరం లేదని గోపాలరావు వాదన.

చంద్రమౌళి నెమ్మదిగా అన్నాడు "ఎవరికోసమైతే మనం అహర్నిశలూ బాధపడి శ్రమిస్తున్నామో, వాళ్లకే మనం వెళ్లేదారి నచ్చనపుడు, దారి మరల్చుకోవడం అవసరమేమో? "

అతడి మాటలకు గోపాలరావు అదిరిపడ్డట్టు చూశాడు. కొంతసేపు గడిచాక అన్నాడు. "చంద్రమౌళీ! మీరు అనుకొంటున్న విషయం సరైనదికాదు. మీకు సమర్థత ఉంది. అధికారం ఉంది. పిల్లలు, చదువులు, ఎన్నో అవసరాలున్నాయి. మనం నీతి, న్యాయం అంటూ మాట్లాడితే మనల్ని పక్కకి తోసేస్తారు. మనోహర జోషిగారి విషయం మీకు తెలియందికాదు. ఈ పొలిటికల్ లీడర్స్ అవినీతికి అలవాటుపడిపోయారు. వాళ్లు పదవులు పొందడం కోసం ఎన్నికలలో ఖర్చుపెడతారు. దానికి మూడింతలు అధికారంలోకి వచ్చాక సంపాదించుకోవాలనుకొంటారు.

"మనల్ని, మన వ్యతిరేకతని గమనిస్తే క్షణాల్లో మనల్ని బదిలీ చేయిస్తారు. వాళ్లకి అనుకూలమైన వాళ్లని తెచ్చుకొంటారు. మనల్ని ఏ సర్వే డిపార్టుమెంటుకో, ఇన్వెస్టిగేషన్‌కో బదిలీ చేయిస్తారు. మీకు తెలియనివా ఇవన్నీ"

చంద్రమౌళికి గోపాలరావు అన్నమాటలన్నీ యదార్థాలని తెలుసు. అతడు చెప్పినట్లు మనోహర్ జోషీగారు గోల్డు మెడలిస్టు. ఆదర్శాలు ఆయన ఊపిరి. ఆయన్ని, ఆయన నిజాయితీని భరించలేకపోయారు. పనికిరాని డిపార్టుమెంటుకి తరలించారు.

చంద్రమౌళి బరువుగా నిట్టూర్చడం చూసి గోపాలరావు బాధపడుతూ అన్నాడు "మౌళీ! మీరు ఆవిడకి ఈ విషయాలు ఏం చెప్పకండి. కాస్త జాగ్రత్తగా ఉండండి"

"ఈ దేశంలో ఉన్నంత అవినీతి, లంచగొండితనం ప్రపంచంలో మరెక్కడా లేదు. అందుకే ఇన్ని వనరులున్నా ఇంత సువిశాల ప్రజాస్వామ్య దేశమైనా ప్రపంచంలో ఉగ్రస్థానం పొందలేకపోతోంది. తమ స్వార్థం కోసం దేశాన్ని దేశ హితాన్ని తాకట్టు పెట్టే ప్రబుద్ధులు అందలమెక్కి, ప్రజలను శాసిస్తున్నారు"

గోపాలరావు, చంద్రమౌళి ఆలోచనలో పడిపోయారు. తామింకా న్యాయం కొంతవరకూ చేస్తున్నారు. పనులు సకాలంలో పూర్తి చేయకపోతే ఊరుకోరు. వాళ్లని బతిమాలో, భయపెట్టో మరీ దోచెయ్యకుండా చూస్తూ ఉంటారు.

ప్రభుత్వం ప్రజలకు మంచి చేయాలని ఎన్నో పథకాలు ప్రవేశపెడుతుంది. ఈ రోజు మైనర్ నీటిపారుదల వసతులకోసం, రైతుల శ్రేయస్సుకోసం, వ్యవసాయాభివృద్ధి కోసం కొన్ని కోట్లు ఖర్చుపెడుతోంది. ఇంజనీర్లు ఫ్రాడ్ చేస్తారని కంట్రాక్టులు ఇవ్వడం మొదలుపెడితే అదే మరింత లోపభూయిష్టమైపోతోంది.

విలేజ్ లెవల్ కమిటీలు వేయమంటుంది. ప్రజల ద్వారా ఎన్నికైన వ్యక్తులకే పనుల బాధ్యతలను అప్పచెప్పమంటుంది. ఎంత చక్కటి ప్రణాళికలు వేసినా ఫలితం పూజ్యం. నాయకులలో అధికారులలో చిత్తశుద్ధి లోపిస్తే ఏ పథకమైనా బూడిదలో పోసిన పన్నీరే ననుకొన్నారు.

చంద్రమౌళి పనుల హడావుడితో మరీ తీరిక లేకుండా ఉన్నాడు. ఆ సమయంలోనే అతడి చిన్నక్క రేవతి కొడుక్కి ఉపనయనం చేస్తున్నానని పిలవడానికి వచ్చింది.



చంద్రమౌళికి రేవతి అంటే ప్రత్యేక అభిమానం. రేవతికి ఇద్దరే పిల్లలు. కూతురు పెద్ద, కొడుకు చిన్న.

ఇద్దరు పిల్లలతోనే ఆపరేషన్‌కి సిద్ధపడిందని రేవతి అత్తగారు గోలపెట్టింది. అయినా రేవతి విన్పించుకోలేదు. ప్రియంవద దెబ్బలాడినా వినలేదు.

ఆమె దృష్టిలో పిల్లలంటే ఎంతో ఖరీదైన ఇష్టాలు. వాళ్ళకి అన్నీ అమర్చేటప్పటికి సరి. ఆమె రావడం ఒక ఎనలేని తృప్తి అయితే, అన్నపూర్ణలో మునుపటి ఉత్సాహం చూడటం మరింత సంతోషం కలిగించింది.

అతడు వచ్చేటప్పటికి రేవతి, అన్నపూర్ణ కలిసి ఒక్కలాగా కబుర్లు చెప్పేసుకుంటున్నారు. పూలమాల కడుతూ నవ్వుతున్న అన్నపూర్ణను రెప్పవేయకుండా చూశాడతను.

రేవతి నవ్వుతూ తమ్ముడి తలమీద మొట్టికాయ వేసింది. "ఏరా! రావడానికి నాకు అవలేదు. నువ్వయినా వచ్చి కన్పించవద్దా? "

అతడు మనసారా నవ్వాడు. "అక్కా! ఈ మొట్టికాయలు తిని ఎన్నాళ్ళయిందే? ఇప్పుడే వచ్చేస్తానుండు" అంటూ అతిత్వరగా బట్టలు మార్చుకుని వచ్చాడు.

భార్య ప్లేటులో తెచ్చిన తినుబండారాలు చూడగానే అతడు నవ్వుతూ అన్నాడు, "అక్కా! అమ్మ ఉన్నా ఇలాగ నా ఇష్టాలు గమనించి చేయలేదేమో? "

రేవతి అభిమానంగా తమ్ముడి తల నిమిరింది. పూతరేకునొకటి తీసి తమ్ముడి నోటికందించింది. అక్కతో కబుర్లు చెపుతూ పూతరేకులు, చక్కిలాలు తిన్నాడు. తొక్కుడులడ్డూ చూస్తూ "పూర్ణా! ఇవి నీవి. నువ్వే తిను" అంటూంటే రేవతి నవ్వింది.

అన్నపూర్ణకి తొక్కుడులడ్డు అంటే ఇష్టం.





తన ఒడిలో తల పెట్టుకుని పడుకున్న తమ్ముడిని అభిమానంగా చూస్తూ, "ఒరేయ్! నువ్వొక ఇంజనీరువంటే ఈ క్షణంలో ఎవరన్నా నమ్ముతారా? " అంది.

మరదలు నీరసం... ఉందని దెబ్బలాడింది. చంద్రమౌళి అక్కతో ఫిర్యాదు చేస్తున్నట్లు అన్నాడు, "మరికొంచెం దెబ్బలాడక్కా! ఎప్పుడూ బొంగరంలా తిరుగుతూ విశ్రాంతి తీసుకోదు. ఈవిడని పుట్టింటికి పంపించేద్దామా? "

రేవతి తమ్ముడివైపు ప్రేమగా చూస్తూ, "ఈ పిల్ల లేకపోతే నువ్వు ఉండలేవురా మౌళీ. నీ ఇష్టాలు నీకన్నా నాకే తెలుసు" అంది.

రేవతి తమ్ముడిని పరీక్షగా చూసింది. "మౌళీ! ఈ కళ్ళజోడేమిటి? కళ్ళకింద ఆ నలుపు చారలేమిటి? ఊరికే నీరసపడక ఒక నెల సెలవు పెట్టి నా దగ్గర ఉండరా!"

అన్నపూర్ణ తను ఎప్పుడు సెలవు పెట్టమన్నా అతడు వినడని, దెబ్బలాడినా పట్టించుకోడని ఫిర్యాదు చేసింది.

అతడు తర్జని చూపిస్తూ "ఔరా...? అక్కతో నామీద చాడీలు చెపుతావా? ఉండు. అక్క వెళ్ళాక నీ పని పడతాను" అన్నాడు.

లలిత, కృష్ణ నవ్వుతూ వాళ్లను చూస్తున్నారు. రేవతి అత్త వస్తే యిక వాతావరణమే వేరు. రేవతి తమ్ముడి విషయాలన్నీ అడిగి తెలుసుకొంది.

అంతలోనే గుర్తు వచ్చినదానిలాగా అంది. "అవునురా అందరికీ డబ్బులు పంచుతున్నావట. ఏంరా! ఏవన్నా చెట్టుకి కాస్తున్నాయనుకుంటున్నావా? "

చంద్రమౌళి భార్యవైపు చూశాడు. తనవలన తెలిసిన విషయం కాదన్నట్లు ఆమె భర్తవైపు చూసింది. రేవతి వెంటనే అందుకొంది. "ఒరేయ్ నీ చూపులకర్థం నాకు తెలుసు. ఆమె నాకు చెప్పలేదు. అక్కకి గొప్ప కావాలికదా! తనే ఉత్తరం వ్రాసింది"

అతడు ఇబ్బందిగా తల గోక్కున్నాడు. "నోరు విడిచి అడిగినప్పుడు కాదనటం ఎలా చెప్పక్కా? "

ఆమె మందలింపుగా అంది. "నోరు తెరిచి అడిగారని అందరికీ అన్నీ జరపగ లమా? అక్కకి బావ ఎంత సంపాదించినా చాలదు. గొప్పలు కావాలి. మా పుట్టింటి వాళ్ళు ఇచ్చారని చెప్పుకోవడం కోసం నిన్ను బాధపెడుతోంది"

చంద్రమౌళి అనునయంగా "పోనీలే అక్కా! మన అక్కే కదా అడిగేది. మనల్ని కాకపోతే ఎవర్ని అడుగుతుంది? "

రేవతి తమ్ముడి అమాయకత్వానికి నవ్వు కొంది.

"మౌళీ! నడుస్తున్న వాళ్ళను నడవనీయా లిరా! ఎత్తుకోకూడదు. ఒకసారి ఏడుస్తున్నా రని ముచ్చటపడి ఎత్తుకొన్నామా వాళ్ళు మరి దిగడానికి ఇష్టపడరు. డబ్బు సంపా దించడమేకాదురా! దాన్ని నిలుపుకోవడం కూడా తెలుసుకోవాలి"

చంద్రమౌళి మొహం పైకెత్తి, అభిమా నంగా అక్కను చూస్తూ అన్నాడు, "అక్కా! నాతో దెబ్బలాడటానికైనా నువ్వు తరచూ రావాలే! నిన్ను చూస్తే నాకు తెనాలి రామ లింగడివారి నిగమశర్మ అక్క గుర్తువ స్తుంది"

రేవతి తమ్ముడి మాటలకు తృప్తిగా చూసింది. ఆరోజు డైనింగ్ టేబుల్ దగ్గర సందడే వేరు. వడ్డన కోసమని నిలబడిన మరదలిని దెబ్బలాడి తనతోపాటు కూర్చోపె ట్టుకుంది.

మర్నాడు తమ్ముడిని పెందరాళే రమ్మని, అందరూ సినిమాకి వెళ్ళారు. పిల్లల చదు వులు ఆరాతీసింది. ఆమె రెండవరోజే వెళ్ళి పోతానంది. చంద్రమౌళి, భార్య ఒప్పుకో లేదు.

మూడవనాడు పనులున్నాయని బయలు దేరిపోయింది . చంద్రమౌళి ఆమెకు అయి దువేలు ఇస్తూ ఆమెకి కావలసింది కొనుక్కో మన్నాడు. రేవతి అతడితో దెబ్బలాడింది. అతడు ఎంత బలవంతం చేసినా ఆమె ఒప్పుకోలేదు. మీదుమిక్కిలి డబ్బంతా దుబారా చేస్తున్నాడని తిట్టింది.

అన్నపూర్ణ తన దగ్గరున్న మంచి చీర, జాకట్టు బొట్టు పెట్టి ఇచ్చింది. శుభకార్యం దగ్గర ఎలాగో పెట్టాలి, ఇప్పుడెందుకన్నా వినలేదు. "మాకు ఎవరున్నారు చెప్పండి? మందలించినా, అనునయించినా మీరే" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకొన్న మరదలిని దగ్గరికి తీసుకొంది. అందరినీ నాలుగు రోజులుముందరే ఒడుగుకి రమ్మనమని చెప్పి వెళ్ళింది.



చంద్రమౌళి చిన్నపిల్లాడిలాగా ప్రయాణానికి సిద్ధం కాసాగాడు. పిల్లలందరినీ తీసుకొని, సరదాగా వెళ్ళాలని బంధువులందరినీ ఈ సందర్భంలో కలుసుకోవచ్చునని ఆనందప డ్డాడు.

అక్క ఏమీ డబ్బు తీసుకోకుండా వెళ్ళింది. అందుకే అక్కకి, వాళ్ళ కుటుంబానికి మంచి బట్టలు తీసుకున్నాడు. నాలుగురోజులు ఆఫీ స్‌కి సెలవు పెట్టేశాడు.

పెద్దవాడిని ఎలాగైనా వీలు చేసుకొని రమ్మనమని ఫోన్ చేశాడు. స్నేహితులందరూ చిన్నపిల్లాడిలాగా అతడు ప్రయాణానికి సిద్ధ మవుతుంటే నవ్వారు.

తీరా ప్రయాణం అయ్యే ముందురోజు కృష్ణమోహన్ రానని పేచీ. అతడు అదే సమ యంలో క్రికెట్ టోర్నమెంట్ పెట్టుకున్నా డుట. "చుట్టుపక్కల ఊళ్ళవాళ్ళు వస్తారు. నేను వస్తే ఎలాగా? " అని అతడు గొడవ.

చంద్రమౌళికి కొడుకుమీద పట్టరాని కోపం వచ్చింది. అత్త ఇంట్లో శుభకార్యమని పిలి చింది. ఇలాంటి సమయంలో ఆట ఎందుకు పెట్టావని కొడుకుతో దెబ్బలాడాడు. కృష్ణ

మోహన్‌కి ఒళ్ళు మండింది. "అత్త వచ్చాక నేను పెట్టలేదు. అంతకుముందే మేం పెట్టు కున్నాం. పొరుగూళ్ళ వాళ్ళని రమ్మని ఇన్వి టేషన్స్ ఇచ్చేశాం. ఇప్పుడెలా"గని అతడి వాదన.

చంద్రమౌళి కొడుకు అందించిన ఇన్విటే షన్ చూశాడు. క్రికెట్ టోర్నమెంట్ అంటూ అతడు కొట్టించిన ఇన్విటేషన్ చూస్తే అతడికి ఒళ్ళు మండింది. దాంట్లో అతడు రూల్సూ, రెగ్యులేషన్సూ కూడా వ్రాశాడు.

కృష్ణ స్థిరంగా అన్నాడు "బోలెడు టీము లని పిలిచాం. వాళ్ళు వచ్చే సమయంలో నిర్వాహకుడిని నేను లేకపోతే ఎలాగ? ఒడుగునాడు వస్తాను. మీరందరూ ముందు వెళ్ళండి"

"నా మాట వినకుండా ఈ క్రికెట్ ఆట లతో గడుపుతోంటే పదవ తరగతి పబ్లిక్ ఏమవుతుంద"ని తండ్రి దెబ్బలాడాడు.

పరీక్షలు ఇంకా నెలరోజుల పైనే ఉన్నాయి. ఈలోపు ఆరు పబ్లిక్‌లు వ్రాయ వచ్చని కొడుకు అంటూంటే అతడు మొదటి సారి కొడుకుపై చెయ్యి చేసుకొన్నాడు.

ఇంట్లో మిగిలిన ఇద్దరి కొడుకుల దారి వేరు. వాళ్లకి చదువంటే లక్ష్యం ఉంది. వీడే మరీ ఇలాగ తయారవుతున్నాడు. వీడికి ఫ్రెండ్స్, ఆటలు కావాలి. ఏ సెంటర్లో చూసినా ఈ వెధవే అని విసుక్కున్నాడు.

అన్నపూర్ణ కృష్ణని దగ్గర కూర్చోపెట్టుకుని పరీక్షలయ్యేంతవరకూ ఇంక ఇలాంటివి పెట్టుకోవద్దంది.

అతడు తల్లి మాటలకి నవ్వాడు. "ఏమి టమ్మా! నువ్వు మరీను. నాన్నగారు ఏం చెపితే అది చేసెయ్యడమేనా? పరీక్షల య్యాక క్లాసు రాకపోతే అప్పుడు తిట్టమను. ఎప్పుడో వచ్చే పరీక్షలకోసమని ఇప్పటినుంచే అన్నీ మానడం నా వలన కాదమ్మా"

కొడుకు మాటలకి అన్నపూర్ణ విస్మయంగా చూసింది. "నాన్నగారు నీ గురించి భయప డుతున్నారురా! ఆయన చెప్పినట్లు వినవచ్చు కదా"

"బావుందమ్మా! నాకు మాత్రం సరదాలు వద్దా? నాకు ఆ ఆటంటే ఇష్టం. అప్పుడ ప్పుడూ ఇలాంటి సందడులు లేకపోతే ఏం బావుంటుంది? "

తల్లీకొడుకుల మాటలు వింటున్న చంద్ర మౌళికి కోపం వచ్చింది. వాళ్ళుమాట్లాడుకుం టున్న గది దగ్గర నిలబడి అన్నాడు "ఈ ప్రబుద్ధుడికి సంధడులు లేనిదెప్పుడు? 'గణ పతి నవరాత్రులు' జరిపిస్తాడు, 'క్రికెట్ టోర్నమెంట్స్' పెడతాడు, 'దేవీనవరాత్రులు' అంటాడు. కార్తీకమాసంలో మూడువారాలు ఎవరో ఒకరు పిలిచారని పిక్నిక్‌లకి ఊరేగు తాడు. ఇదిగో పూర్ణా! ఇప్పుడే చెపుతు న్నాను. వీడు చదువుకుంటాడని, బాగుపడ తాడని నాకు ఏ కోశానా అన్పించడంలేదు"

అన్నపూర్ణకి భర్త అలాంటి మాటలు మాట్లాడడం కష్టమన్పించింది. చిన్నపి ల్లాడు. తెలియకపోతే చెప్పాలికానీ అలాగ మాట్లాడితే ఎలాగ?

కృష్ణమోహన్ గొణుక్కున్నాడు. "మీకు మాత్రం సందడులు అక్కరలేదా? లైన్స్ క్లబ్ అంటారు. ఆఫీసర్స్ క్లబ్ అంటారు. నేను నా ఫ్రెండ్స్‌తో తిరిగితే చివాట్లు"

అన్నపూర్ణ భయంగా కొడుకువేపు చూసింది. చంద్రమౌళికి అతడి మాటలు వినబడక భార్యనడిగాడు. కృష్ణ విసురుగా వీధిలోకి వెళ్ళిపోయాడు.

మొత్తానికి చంద్రమౌళి అనుకున్నట్లు అందరితో కలిసి ప్రయాణం చేయడం అవ లేదు. అన్నపూర్ణ "అందరం కలిసి వెళ్ళడం లేదని నాన్నగారు నిరుత్సాహపడు తున్నారురా" అని కృష్ణతో అంటే "అటు నుండి అందరం కలిసి వద్దాంలేమ్మా సర దాగా" అన్నాడు.




"అయినా అందరం ఇల్లూ అదీ వదిలేసి వెళ్ళిపోతే దొంగలభయం ఎక్కువగా లేదా" అంటున్న కొడుకుని చూసి నవ్వింది. "ఈ ఇంటిమీద శ్రద్ధ ఎప్పటినుంచిరా? " అని నందు ఏడ్పించాడు.

కృష్ణ మాటలకి తడుముకోడు. "మరేమిటైతే? శాంతమ్మగారు పెద్దదైపోవడం లేదా? ఒక్కరూ ఎలా ఇల్లు నిద్రమానుకొని చూడగలరు? "

నందు, లలిత అయితే గౌరి మనతో వస్తోందా అని తల్లినడిగారు. కృష్ణ జవాబిచ్చాడు. "దానికి ఈమధ్య కితకితలు ఏమీ కలగడంలేదుట. తీసుకెళ్ళండి"

అందరూ గౌరిని చూస్తూ అతడి మాటలకి నవ్వుకున్నారు. గౌరికి బస్సు ఎక్కినా, రైలు ఎక్కినా కితకితలు అన్పిస్తాయట. కిందటిసారి తమతో గునపర్రు వచ్చినప్పుడు బస్సులో ఒకటే నవ్వు. దాన్ని చూసి అందరూ నవ్వడమే. ఆ సంఘటనను గుర్తు చేస్తూ కృష్ణ అంటున్నాడని వాళ్ళు గ్రహించారు.

కృష్ణ తల్లిదగ్గర మారాం మొదలుపెట్టాడు. "పెద్ద ఇంజినీరు భార్యవి. ఒక కప్పు అయినా నీపేరుమీద ఇవ్వకపోతే ఏం బావుంటుంది? మా ఆటలకి నువ్వు డొనేషన్ ఇవ్వక తప్పదమ్మా"

అన్నపూర్ణకి అతడిని ఎలా మందలించాలో అర్థమవదు. ఏం చెప్పినా నవ్వుతూ కొట్టిపారేస్తాడు.

కృష్ణ తల్లివైపు నవ్వుతూ చూశాడు. "అసలు నిన్ను ముఖ్య అతిధిగా మా ఫంక్షన్ నాడు పిలుద్దామనుకొన్నానమ్మా! అందరికన్నా ఎక్కువ డొనేషన్ ఇస్తున్న నీకు ఆమాత్రం గౌరవం ఉండవద్దా? "

నందు తల్లిని వేళాకోళం చేస్తూ "మరేం? ఇంక అమ్మ సభలకి, టోర్నమెంట్స్‌కి వెళ్ళచ్చు బాగా అలవాటు చేస్తున్నావురా చంటీ" అన్నాడు.

అన్నపూర్ణ కొడుకు బాధపడలేక వందరూపాయలు ఇస్తానంది. అతను ఆటలు పెడుతున్నది తనేనని, మొదట తనవాళ్ళే ఇవ్వకపోతే అందరూ ఎలా ఇస్తారని వాదన.

ఈ గొడవంతా వింటున్న శాంతమ్మగారు ఉండబట్టలేక అనేశారు. "చిన్నబాబూ! అమ్మగారిని ఎందుకలా విసిగిస్తారు? అసలు మీకు ఇలాంటివి ఎందుకు చెప్పండి? మీ చదువేదో మీరు చూసుకోవచ్చునుకదా"

"చూడండి. మీరు మీ వంటపని, ఇంటిపని ఏదో చక్కగా చూసుకోవచ్చుకదా! అన్నింటిలో ఎలా సరదాగా కల్పించుకొంటున్నారో నేనూ అంతేనండీ! మీరే నాకు మార్గదర్శకం" అన్నాడు.

శాంతమ్మగారు మొహం చిట్లించుకుంటూ, "ఏదో పెద్దదాన్ని, మీ తల్లిలాంటిదాన్ని అనుకుని అన్నాను."అంది.

కృష్ణ ఆవిడలాగే చేతులు తిప్పుతూ, "ఏదో చిన్నవాడినని జవాబు చెప్పాను. మీ బిడ్డలాంటివాడినని చెప్పాను" అన్నాడు.

ఆవిడ మరి మాట్లాడలేకపోయింది. నందు అననే అనేశాడు 'వాడితో వాదించి గెలవలేరు. ఎందుకొచ్చిన గొడవ'ని.

కృష్ణ, తల్లి బీరువా దగ్గరికి వెళ్ళేవరకూ మారాం చేస్తూనే ఉన్నాడు. "అమ్మా! అసలు నిన్ను ఇలాగ నాన్నగారు, మీవాళ్ళు కూపస్థమండూకాన్ని చేసేశారు. బయటి ప్రపంచం నీకు లేకుండా పోతోంది. నీకన్నా మా వర్ధనమ్మ మామ్మగారు నయం. ఆవిడని చూసైనా నేర్చుకో"

నందు తమ్ముడి మాటలకి పకపకా నవ్వాడు. "ఆ డబ్బులు వాడి చేతులలో పడే వరకూ ఎన్ని కబుర్లైనా చెపుతాడు"

అన్నపూర్ణ నందుని "వర్ధనమ్మగారు వీళ్ళకి డొనేషన్ ఇస్తారా? " అని అడిగింది.

కృష్ణ వెంటనే అందుకున్నాడు. "ఛ...

ఛ...ఛ... ఆవిడదగ్గర డొనేషన్ వసూలు చేస్తామా? ఆవిడ మా క్రికెట్ సంఘ వీరాభిమాని. అమ్మా! మీరెవ్వరూ గ్రౌండ్‌లోకి రారు కానీ ఆవిడ చక్కగా వచ్చి ఎంకరేజ్ చేస్తారు"

వర్ధనమ్మగారి విషయం నందు తల్లికి చెప్పాడు. వర్ధనమ్మగారి ఇంటి ఎదురుగానే పెద్ద గ్రౌండ్ వుంది. కృష్ణావాళ్ళు అక్కడే ఆడుతూ ఉంటారు. మొదట్లో ఆవిడి పెరట్లో గల జామకాయలుని ఈ పిల్లలెవ్వరూ ఉండనిచ్చేవారు కాదు. ఆవిడ పెరటిగోడ ఎక్కి దొంగతనంగా కాయలుతెంపే వాళ్ళని నానా తిట్లూ తిట్టేవారు.

వర్ధనమ్మగారు తిట్టినా పిల్లలకి లెక్కలేదు. ఆవిడ ఆకారం ఎంత నవ్వు తెప్పించేదో ఆవిడ తిట్లూ అంత నవ్వు తెప్పించేవి. గుండు, గుండుచుట్టూ తెల్లసైను పంచె కప్పుకుని, పొట్టిగా, నెమ్మదిగా నడిచివచ్చి తిట్టే ఆవిడను వీళ్ళు లెక్కచేసేవారు కాదు. ఆవిడకి ఒక్కడే కొడుకు. ఆయన కాస్తా విదేశానికి వెళ్ళిపోయాడు. ఏం రెండేళ్ళకో వచ్చి చూస్తాడు. ఈవిడని అక్కడికి రమ్మంటే వెళ్ళదు. నువ్వు ఉన్న దేశంలో ఉండలేకపోతే నేను పొరుగుదేశంలో ఉండలేనురా అని సున్నితంగా తిరస్కరించింది.

భర్త పోయాక వస్తున్న ఫించనుతో, స్వంత ఇల్లు చూసుకుంటూ ఉండిపోయింది. ఆవిడకి బోదకాలవడం వలన తరచూ జ్వరం వచ్చేది. ఒకసారి అలాగ జ్వరతీవ్రతతో పడి ఉన్న ఆవిడను ఈ పిల్లలే డాక్టర్‌ని పిలిపించి చూపించారు. జ్వరం తగ్గేవరకూ ఇద్దరు అక్కడ పడుకునే ఏర్పాటు కృష్ణ చేశాడు. ఆవిడ ఇల్లు విడిగా ఉండటం, పెద్దగా నోరుపెట్టి తిడుతుందని ఆ వీధివాళ్ళు ఎక్కువగా కల్పించుకునేవారు కారు.

ఆనాటినుంచీ ఈ పిల్లలు ఆవిడకి ప్రాణమైపోయారు. అంతకుముందు మంచినీళ్ళు ఎన్నో తిట్టి ఇచ్చే ఆవిడ, ఇప్పుడు తనే స్వయంగా జామకాయలు, చాక్‌లైట్లు పంచియిస్తుంది. ఆ పిల్లలు, ఆ క్రికెట్ ఆట, ఆ సందడి ఆవిడకి ఒక కాలక్షేపం అయ్యాయి.

అన్నపూర్ణ అంతా విని నవ్వుతూ "పెద్ద వాళ్ళతో నీకు ఏం పనిరా. ఇంక ఆటలు తగ్గించుకుని చదువు ధ్యాసలో పడు" అంది.

ఎలాగైతేనేం తల్లి ఇచ్చిన అయిదువందలు పుచ్చుకొని అతడు ఫ్రెండ్స్‌ని కలవడానికి వెళ్ళిపోయాడు.



చెప్పినట్లుగానే తమ్ముడు మరదలుతో, పిల్లలతో నాలుగురోజులు ముందే వచ్చినందుకు రేవతి పొంగిపోయింది. నెమ్మదినెమ్మదిగా చంద్రమౌళి అన్నదమ్ములు, ప్రియంవద వచ్చారు. ప్రియంవదకి చెల్లెలు ఈ ఉపనయన కార్యక్రమం పెట్టుకోవడం నచ్చలేదు. పిల్ల పెళ్ళిలో పిల్లాడికి ఒడుగు చేసేస్తే ఖర్చు కలిసివస్తుంది కదా అని ఆమె ఆలోచన.

రేవతి ఎవరి మాటా వినదని అక్కకి కోపం. రేవతి వాళ్ళకి చెప్పనే చెప్పేసింది. కూతురు డాక్టరు చదువుతానంటోంది. పెద్ద చదువులకి వెళ్ళే ఆడపిల్లల చదువు,




మధ్యలో ఆపలేరుకదా! దానిపెళ్ళి విషయం తర్వాత ఆలోచించవచ్చు. కొడుక్కి ఒడుగు చేస్తే కాస్త దీపం, ధూపం పెట్టుకోవడానికి దైవపూజ చేసుకొందుకు వీలవుతుంది.

చంద్రమౌళి ఉపనయన సమయంలో అక్కకి, బావగార్కి, వటువుకి బట్టలు పెట్టాడు. తమ్ముడు చెల్లికి కొనిచ్చిన టిష్యూ పట్టుచీర చూసి ప్రియంవద మొహం గంటుపెట్టుకుంది. అందరూ బంధువుల నుంచి ఎక్కువ రాబడుతుందని తనను ఆడి పోసుకుంటారు. కానీ నెమ్మదిగా నోట్లోనా లుక లేనట్లుండే చెల్లెలే ఎక్కువ వసూలు చేస్తోందనుకొంది.

ఈ బట్టలు తమ్ముడు తీసి ఉండడు. మరదలి పనే నిశ్చయంగా. ఆమె బజారు ఎక్కువగా వెళ్ళదు. ఎప్పుడూ ఏవీ కొన్న పాపానపోలేదు. అందుకే ఇంత ఖర్చుచేసి ఉంటుంది.

ప్రియంవద అడిగిన ప్రశ్నకి అతడు నవ్వే శాడు. "నీ మరదలు అంత చొరవగా పనులు చక్కబెడితే నాకు ఇంక కావల్సిందే మిటి? నేనే కొన్నానక్కా? "

ఇంక ఆమె ఏం మాట్లాడగలదు? రేవతి పీటలమీద నుంచి లేచాక తమ్ముడితో దెబ్బ లాడింది. "ఏరా మౌళీ! ఇంత డబ్బు బట్ట లకి ఎందుకు ఖర్చుపెట్టావు? ఏమైనా నీకు దుబారా ఎక్కువైపోతోంది"

రేవతి భర్త కిషోర్ భార్య మూడ్ మార్చ డానికి నవ్వుతూ "కొననీయవోయ్! బావ గారు మనకోసం ఇంకెప్పుడు ఖర్చుపెడ తారు? " అన్నాడు.

"మా చిన్నక్కకి ఏమిచ్చినా తక్కువేనండీ" అంటున్న తమ్ముడిని ఆమె ప్రేమగా చూసింది. "ఈ బావమాటలు వినకురా. బావమరిది దొరికాడు కదా అని నొక్కేద్దా మనుకుంటున్నారు అంతేనా? ఇంతకు ఇంతా మా తమ్ముడికి ముట్టచెప్పేస్తాను"

"బాబోయ్! మీ ఆడవాళ్ళు తలుచుకుంటే ఏమైనా చేయగలరు? హతోస్మి. ఆ దేముడే నన్ను రక్షించాలి"

నలుగురూ అతడి మాటలకి నవ్వేశారు.

బాగా చనువున్న పెద్దావిడ అననే అంది, "ఇదిగో అమ్మాయీ! తమ్ముడి కూతురుని నీ కొడుక్కి ముడిపెట్టుకోవే! నీ సంపద నీ కోడలే అనుభవిస్తుంది"

రేవతి ప్రేమగా లలితవైపు చూసింది. ప్రియంవదకిదేం నచ్చలేదు. విషయం ఎక్క డినుంచి ఎక్కడవరకు వెళ్ళింది. తను కల్పించుకోకపోతే లాభం లేదనుకుంది.

"మా తమ్ముడి కూతురు నా కోడలు. దానిపై ఎవరూ ఏ ఆశలూ పెట్టుకోనక్కర లేదు. నా వెనకాల మాట్లాడేసుకుంటే సర నుకుంటున్నారు కాబోలు"

అంతా ఆమె మాటల తీవ్రతకి నొచ్చుకు న్నారు. ఏదో వరసైన పిల్లలుంటే ఇలాంటి శుభకార్యాలలో అనుకోవడం మామూలే. రేవతే సంభాషణను అక్కడితో ఆపించి, పక్కదారి పట్టించింది.

అన్నపూర్ణ వడ్డనల సమయంలో ఎక్కువ శ్రమ పడటం చూసి రేవతి మందలిం చింది. మగవాళ్ళు అందుకొంటారు లెమ్మని బలవంతంగా ఇవతలికి తీసుకువచ్చింది.

భార్య మొహంమీద అలుముకున్న చెమ టలు చూస్తూ చంద్రమౌళి అక్కలను అల్లరి పెట్టేశాడు "నా భార్య అసలే సుకుమారి. నా ఎదురుగానే నా భార్యను కష్టపెడ తారా? " అంటూ,

కిషోర్ హాస్యంగా చూస్తూ "సుకు మారా? ఆవిడెవరు బావగారూ? వేరే సెటప్పా" అన్నాడు.

రేవతికి ఆ మాటలు వినబడ్డాయి "అయ్యో! మా తమ్ముడు మీలాగ కనబడ్డ ఆడవాళ్ళందరి వెనకాల పడడు. శ్రీరా ముడిలాగా ఏకపత్నీవ్రతుడు. మీ వేళాకో ళాలు మీ దగ్గరే అట్టేపెట్టండి"

కిషోర్ భార్యవైపు జడిసిపోతున్నవాడి

లాగా చూశాడు. "బాబోయ్. మీ తమ్ముడి మీద ఈగ కూడా వాలనిచ్చేలాగా లేవు. కట్టుకున్న నామీద కూడాఎప్పుడూ ఇంత ప్రేమ చూపలేదు. ఇంక మీ తమ్ముడిని పన్నెత్తి ఒక్కమాట అననులే"

వచ్చిన బంధువులందరూ వాళ్ళ అనురాగానికి ముచ్చటపడ్డారు. రేవతి అన్నలకు, అక్కకి, తమ్ముడికి బట్టలు పెట్టింది. పిల్లలందరికీ బట్టలు తీసింది. ఆమె వరుసగా, పేరుపేరునా అందిస్తోంటే వచ్చిన బంధువులంతా సరదాపడ్డారు. కొందరు వచ్చిన వాళ్ళైతే ఆమెలాగా శుభకార్యం అంత బ్రహ్మాండంగా ఎవరూ చేయలేరని మెచ్చుకున్నారు.

చంద్రమౌళి బట్టలు తీసుకుంటూ అక్కాబావల పాదాలకు నమస్కరించాడు. "ఎందుకక్కా! ఇంత ఖర్చుపెట్టుకొన్నా"వంటున్న తమ్ముడిని నవ్వుతూ చూస్తూ, "చంటీ! అవసరమైనప్పుడు పెట్టకపోతే ఎలాగరా? అంతా నా స్వజనం. నా వాళ్ళను నేను గౌరవించుకున్నాను తప్పా? "

అతడు ఏం మాట్లాడగలడు? కృష్ణమోహన్ భుజంమీద చెయ్యేసి తర్జని చూపిస్తూ, "నువ్వు అందరికంటే వెనుక వచ్చావు కనుక మరో నాలుగురోజులుండి వెళ్ళాలి. నీకు ఈ అత్తవిధించే శిక్ష ఇదే"

కృష్ణమోహన్ కూడా ఏం తీసిపోలేదు. "మరోసారి పబ్లిక్ పరీక్షలయ్యాక వచ్చి ఈ మేనల్లుడు ఆ శిక్ష పూర్తి చేసుకుంటాడు" అన్నాడు.

"అమ్మో! అత్తా అల్లుళ్ళు సరిసమానులే" అంటూ అక్కడున్నవాళ్ళు మేలమాడారు.

చంద్రమౌళి కోరిక ప్రకారం తిరుగుప్రయాణం అందరూ సరదాగా చేశారు. దారిలో అతడు పిల్లలికి రేవతి గురించి చెప్పాడు. పిల్లలికి కూడా రేవతి సంసారం ఎంతో నచ్చింది. ఎవరింట్లో అయినా శుభకార్యాలప్పుడు భార్యాభర్తలు చిరాకుపడటాలు, చిన్న తగాదాలైనా పడటాలుంటాయి. ఎవరి దాకానో ఎందుకు? ప్రియంవద, భర్త ఏ పూటకాపూట దేనికో దానికి ఘర్షణ పడుతూనే ఉంటారు. భర్త తనకి విలువ సరిగ్గా ఇవ్వడంలేదంటుంది. ప్రతీ విషయంలో ఆవిడ మాటే వినాలా అని అతడివైపు వాదన. బంధువులున్నారనైనా చూడకుండా వాదించుకొంటారు. చివరికి అతడు ఒక్కొక్కసారి ఊరుకుంటాడు. మరొకసారి "నీ మొహం. నీకేం తెలియదు. అన్ని విషయాలలోకి ఎందుకు తల దూరుస్తావు" అంటాడు. ఆమెకి మరింత కోపం వచ్చి నన్ను ఏదో ఒకటి అనకపోతే మీకు తోచదని దెబ్బలాడుతుంది.

చంద్రమౌళి అక్కలిద్దరి స్వభావాలలో ఉన్న వైరుధ్యానికి ఆశ్చర్యపడుతూంటాడు. రేవతి మనసు మెత్తన. ఒకరిని నొప్పించడం ఆమెకిష్టం ఉండదు. అలాగని ఎవరు చెప్పిన విషయాలనైనా అంగీకరిస్తుందనుకుంటే పొరపాటే. ఆమెకి నచ్చకపోతే బ్రహ్మరుద్రాదులొచ్చినా ఆ పని చేయించలేరు.

చంద్రమౌళి పెదవులపై సన్నగా నవ్వు వచ్చింది. నందు ఆయన్ని చూస్తూ, "డాడీ! ఎందుకు మీలో మీరు నవ్వుకుంటున్నారు? మాకుకూడా చెప్పరా? " అంటూ పట్టుపట్టాడు.

చంద్రమౌళి మనసు గతంలోకి తొంగిచూసింది. ఈరోజు చంద్రమౌళి ఈ విధంగా ఎదగడానికి, ఖచ్చితమైన నడవడి అలవరచుకోవడానికి, ఉన్న విషయాన్ని నిర్భయంగా మాట్లాడటానికి ప్రేరణ అతడి అక్క రేవతే. అతడికి తెలియకుండానే ఆమె ప్రభావం అతడిపై చిన్ననాటినుంచీ పడసాగింది.

ప్రియంవద ఇంట్లో ఎక్కువగా పనులు చేసేదికాదు. కష్టమైన పనులన్నీ రేవతే నిర్వహించేది. ఉదయం, సాయంత్రం అందరికీ కాఫీ, టిఫిన్లు చూసే బాధ్యత రేవతిదే.

వంటింట్లోకి రాగానే మెరుపుతీగలాగ పనులు చక్కబెట్టేది. ఆ టైముకి ఆ పని జరగకపోతే ఆవిడకి చిరాకు.

ఒకసారి పాలుకలిపి చంద్రమౌళిని వచ్చి తీసుకోమని పిలిచింది. అతడు చిన్నన్నగారితో కబుర్లు చెపుతున్నాడు. రెండవసారి ఆమె పిలిచింది. ఇదిగో వస్తున్నా అన్నాడే కానీ కదలలేదు. నెమ్మదిగా వస్తున్న తమ్ముడిని చూస్తూ పాల గ్లాసు చేతిలోనుంచి వదిలేసింది. అతడు తెల్లబోయి చూశాడు.

ఆమె కోపంగా అంది. "పిలిచిన వెంటనే రాకుండా నువ్వు చేస్తున్న రాచకార్యాలేమిటి? మొహం కడుక్కోగానే వచ్చి ఇచ్చినదేదో తాగాలని తెలియదా? ఇంత చిన్నపనే టైముకి చేయనివాడివి, జీవితంలో ఏ పని చేస్తావు? నా పని కూడా పాడుచేశావు. ఈ రోజుకి నీకు ఏదీ ఇవ్వను. అదే శిక్ష"

అన్నట్లుగానే ఆరోజు ఉదయం మరి పాలు ఇవ్వలేదు. సాయంత్రం కూడా ఇవ్వలేదు. చిన్నన్న హాయిగా పాలు తెచ్చుకొని తాగుతూ కబుర్లు చెపుతూంటే తను నిలబడటం తప్పేనని తర్వాత తర్వాత తెలిసింది. పాలు నేల పారపోసిందని తండ్రి గోల పెట్టాడు. అయినా ఆమె లెక్కచేయలేదు. "ఇవతలి వాళ్ళు పిలిచినప్పుడు వెంటనే స్పందించాలని, టైముకి పనిచేసుకోవాలని వాడికి తెలియవద్దా? ఒకపూట పాలు పోయాయని ఊరికే ఇదవకండి" అని నిర్మొహమాటంగా చెపుతున్న కూతురిని ఆయన ఏమనగలరు?

ఆరోజునుండి ఆమె దేనికి పిలిచినా అందరూ పరుగెత్తేవారు. వెళ్ళకపోతే జరిగే పర్యవసానం అందరికీ అర్థమైంది. ఓసారి చెరువులో ఈతలు కొట్టి చంద్రమౌళి ఆలస్యంగా ఇంటికి వచ్చాడు. ప్రియంవద, తండ్రి తిట్టారుకానీ రేవతి ఏమీ అనలేదు. అతడు కాళ్ళూ, చేతులూ, కడుక్కొని, బట్టలు మార్చుకొని వచ్చేవరకూ ఓపిక పట్టింది. తర్వాత గోడకుర్చీ వేయించి చదివించింది. కొంచెం కిందికి జారినా ఒప్పుకోలేదు. అసలే ఈత కొట్టడంవలన కాళ్ళు లాగుతున్నాయి. పైగా ఈ శిక్ష. కళ్ళనీళ్ళ పర్యంతమవుతూ మరెప్పుడూ చేయనని బ్రతిమాలినా ఆమె వినలేదు.

తనూ మరెప్పుడూ వేయించనని, ఇప్పుడు చేసినదానికే ఈ శిక్షని ఖచ్చితంగా చెప్పింది. అక్కగారు ఏదో చెప్పబోతుంటే, "వాడు నల్లగా చేసి తీసికొచ్చిన బట్టలు, ఈరోజునుండీ నువ్వు ఉతుకుతానంటే నేను తప్పుకొంటాను" అంది. పెద్దక్కకి బట్టలు ఉతకడమంటే గొప్ప బద్ధకం. సబ్బు రాయాలి, ఉతకాలి అవితీసి ఆరెయ్యాలి. మళ్ళీ ఆరాక తెచ్చి మడతలుపెట్టి అందరికీ అందించాలి. ఏమాటకామాటే చెప్పుకోవాలి. రేవతి మల్లెపూవులాంటి బట్టలు వాళ్లకి అందించేది. చాకలి ఉన్నా వారానికి ఒకసారి పట్టుకెళ్ళేది. తక్కువ బట్టలుండటంవలన ఈ శ్రమ తప్పేదికాదు.

చంద్రమౌళి అప్రయత్నంగా కాళ్ళవైపు చూసుకొన్నాడు. ఒకసారి చదువు విషయంలో అబద్ధం చెప్పాడని మోకాళ్ళమీద నిలబెట్టింది. మోకాళ్ళమీద నిలబడి రెండు మూడు గంటలు చదవడమంటే ఎంత కష్టమో బాగా తెలిసి వచ్చింది. ఎప్పుడూ ఆ తర్వాత అబద్ధమాడలేదు.

ఆ శిక్షలు అనుభవిస్తున్నప్పుడు ఆమెపై కోపం వచ్చినా, జ్వరంతో తను మంచం మీద వున్నప్పుడు, కళ్ళల్లో వత్తులేసుకొని కాపాడేది. క్లాసులో వెనకబడిపోతే ఆ పాఠాలు అర్థమయ్యేలాగ చెప్పేది. నోట్సులు రాసిపెట్టేది. అందువలన ఆమె అంటే భయం, భక్తి, ఆరాధనా కలిగేది. ఆమె చూపించే కఠినవైఖరికి పళ్ళు లోపల్లో పల నూరుకొన్నా, ప్రేమించే ఆ మనసుకి, కర్తవ్యాన్ని నిర్వహించే ఆ సంకల్పానికి తల వంచక తప్పేదికాదు.

పిల్లలు ఇంకా చెప్పు నాన్నా, ఇంకా మీ

చిన్నప్పుడు అత్త ఏంచేశారు అని అడుగుతూంటే చంద్రమౌళి హాయిగా నవ్వేశాడు. "నాకేమిటి? మా నాన్నగారికే ఆమె అంటే భయం. ఆయన ఏదైనా పొరపాటు చేసినా వెంటనే ఏమిటి నాన్నగారూ, ఎందుకలాగ చేశారంటూ అనేది. ఎటొచ్చీ మనకులాగ శిక్షలు ఆయనకి వేయలేదు. అంతే"

చంద్రమౌళి భార్యవైపు చూస్తూ "పూర్ణా! చిన్నక్క పెళ్ళి గొడవ నీకు చెప్పాను కదూ!" అని అడిగాడు. పిల్లలు ఆమె జవాబు చెప్పేలోపే "మాకు చెప్పండి డాడీ! మాకు తెలియదుకదా" అని అడిగారు. వేణుగోపాల్‌కి, నందుకి ఆమె విషయాలు వింటూంటే గొప్ప సరదాగా ఉంది. తండ్రి బాల్య సంఘటనలు వాళ్ళకి నవ్వు పుట్టిస్తున్నాయి.

నందు తండ్రిని వేళాకోళంగా చూస్తూ, "మీరు చూస్తే చురుకైనవారు. ఫ్రెండ్స్ లేనిదే గడపరు. ఈ లెక్కన చూస్తే అత్త చేత మీకు బోలెడు శిక్షలు పడిఉండాలే!" అన్నాడు.

చంద్రమౌళి అతడి మాటలకి నవ్వుకొంటూ, "ఊ... నా ప్రవర్తన చాలావరకు సరిదిద్దింది మా రేవతక్కే. పెద్దక్క పెళ్ళై వెళ్ళి పోయాక, మరింత బాధ్యత తనపై పడింది" అన్నాడు.

చంద్రమౌళికి గాలిపటాలు ఎగరవేయడమంటే ఎంతో ఎంతో ఇష్టం. ఆదివారాలు చదువు ఎగ్గొట్టి ఆటలకు వెళ్ళాలని చూసేవాడు. రేవతి ముందే అతడిని కూర్చోపెట్టి హోంవర్క్‌లు చేయించి పంపేది. అక్క ధర్మమా అని అతడు ఏనాడూ క్లాసులో మాటపడలేదు.

ఇంజనీరింగ్ చదువుతుండగా తండ్రి అర్జెంటుగా ఇంటికి రమ్మంటే చంద్రమౌళి వెళ్ళాడు. ఆయన చాలా చిరాకుగా కనబడ్డాడు. ఇంట్లో పెద్దక్క, బావ కూడా కన్పించారు.

ఎప్పుడూ చిరునవ్వుతో ఎన్నో కబుర్లు చెప్పే రేవతి, తమ్ముడిని పలకరించి ముభావంగా ఉండిపోయింది. తండ్రిని విషయమేమిటని అడుగుతోంటే, కోపంతో మండిపడుతూ పెద్దక్క విషయం అతడి చెవిని వేసింది.

కిషోర్ వాళ్ళకి దూరపు బంధువు అవుతాడు. వాళ్ళకీ వాళ్ళకీ రాకపోకలు బాగానే ఉన్నాయి. రేవతి అంటే అతడికి ఇష్టం ఏర్పడింది. డిగ్రీ చదువుతూండగా అతడికి ఎల్. ఐ. సి. లో రికార్డు అసిస్టెంటుగా ఉద్యోగం వచ్చింది. వచ్చిన ఉద్యోగం వదులుకోవడం ఎందుకని, చదువు మధ్యలో ఆపి అతడు ఉద్యోగానికి వెళ్ళిపోయాడు.

ఉద్యోగం వచ్చాక ఏదో ఒక నెపంతో అతడు వాళ్ళ ఇంటికి వస్తూండేవాడు. వాళ్ళ వాళ్ళు పెళ్ళి సంబంధాలు వస్తున్నాయని, పెళ్ళి చూపులకి అతడు సెలవు పెట్టుకొని వస్తే వెళదామని ఉత్తరాలు రాయసాగారు. చివరికి అతడు ఇంటికి వచ్చి వాళ్ళవాళ్ళతో రేవతిని తప్ప మరెవ్వరినీ పెళ్ళిచేసికోనని చెప్పేశాడు.

ఆడపెళ్ళివాళ్ళను వెళ్ళి దేహీ, మీపిల్లను ఇవ్వండని మొదలు అడుగుతామా అని తండ్రి మండిపడ్డాడు. తనే రేవతిని అడుగుతానని అతడు వచ్చాడుట.

సన్నజాజిపూలు మాలకట్టుకొంటున్న రేవతి దగ్గరికి సాయంత్రంవేళ వచ్చి నెమ్మదిగా నిలబడ్డాడుట. ఈసారి అతడి ప్రవర్తనంతా ఆమెకి వింతగానే ఉంది. ఎప్పటిలాగ హుషారుగా కబుర్లు చెప్పలేదు. తమ విషయాలు అడగలేదు. మన్నుతిన్న పాములాగ ఉండిపోయాడు. మధ్యాహ్నం భోజనం కూడా సరిగ్గా చేయలేదు.

రేవతి అతడికి కుర్చీ తెచ్చి వేయడానికి లేవబోతూంటే ఆపి, ఆమెకి కొద్దిదూరంలో కూర్చుని, విషయం ఎలా చెప్పడమా అని ఆలోచనలో పడ్డాడు. అతడికి ఆ క్షణంలో




తను నోరు విప్పకుండా ఆ అమ్మాయి తన మనసు గ్రహిస్తే ఎంత బాగుండునన్పించింది. ఎందుకలాగ నీళ్ళు నములుతున్నాడో ఆమెకి అర్థమవలేదు.

చివరికి ఎలాగో తంటాలుపడి అన్నాడు "మావాళ్ళు నాకు ఈ ఏడాది వివాహం చేసేయాలనుకొంటున్నారు. నాకు ఏమీ పాలుపోవడంలేదు"

రేవతి విస్మయంగా చూసింది. అతడి పెళ్ళి అయితే తనకి ఎందుకు చెప్పడం? ఏదైనా ప్రేమ వ్యవహారం ఉందేమో? అందుకే ఆటపట్టిస్తూ అంది. "మరింకేం? పెళ్ళి చేసికొని మాకు త్వరగా విందు భోజనాలు పెట్టించండి"

అతడు చిరాకుగా చూశాడు. "నా బాధ మీకు అర్థమైనట్లులేదు"

"బాధా...? పెళ్ళి చేస్తామంటే బాధం టారేం? అందరం ఎప్పుడో ఒకప్పుడు ఆ సంసార సాగరంలోకి దిగవలసినవాళ్ళమే"

ఆ మాటలు అతడికి విషయాన్ని చెప్పే దారి చూపించాయి. ఆమెవైపు సూటిగా చూస్తూ అన్నాడు "అదే మిమ్మల్ని అడుగుతున్నాను. మీరు ఆ సంసార సాగరంలోకి ఎప్పుడు దిగుదామనుకొంటున్నారు? "

రేవతికి అతడు ఏదో చెప్పదలచి చెప్పలేక పోతున్నాడన్పించింది. "నేను ఇప్పుడు సంసారసాగరంలో మెడలోతు మునిగే ఉన్నాను. మా అమ్మగారు పోయాక నాకు మరింత బాధ్యత ఏర్పడింది"

"ఈ సంసారం గురించి కాదు నేను అడిగింది. మీకు సంబంధించే సంసారం గురించి. అర్థమైందా? మీ పెళ్ళి గురించి నేను అడుగుతున్నాను"

అతడి మాటలకి ఆమె ఏం జవాబు చెప్పలేదు. తనని చూసినప్పుడు అతడి కళ్ళల్లో మెరిసే మెరుపు, తరచుగా తమ ఇంటికి రాకపోకలు సాగించడం ఇప్పుడు వేరొక అర్థాన్ని ఆమెకి తెలియచేస్తున్నాయి.

అతడు వెంటనే అన్నాడు. "రేవతీ! మీరంటే నాకు ఎంతో ఇష్టం. మీకోసం, మిమ్మల్ని చూడటం కోసమే నేను వస్తున్నాను. నా మనసు మీరు గ్రహిస్తే ఎంతో సంతోషిస్తాను. మిమ్మల్ని తప్ప వేరొకరిని నా జీవితంలోకి ఆహ్వానించలేను. మా వాళ్ళకి నేను మన విషయం చెప్పాను. మీరు నన్ను తిరస్కరించరని నా నమ్మకం. ఆపై దైవనిర్ణయం"

రేవతికి అంతా ఆశ్చర్యంగా ఉంది. ఈతడు తను అనుకొన్నట్లు అమాయకుడు, మెత్తనివాడు కాదు. తనకి కావలసినది తను తీసుకొనే చురుకైన వ్యక్తిత్వం కల వాడు.

అతడు ఆమెవైపు అర్థిస్తున్నట్లు చూశాడు. "చూడండి. ఇప్పటికి ఇప్పుడు నేనేం చెప్పగలను? ఆలోచించుకోవడానికి నాకు కొంత టైము ఉండాలికదా"

అతడు అర్థమైనట్లు అక్కడినుండి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి అందరికీ పక్కలు పరిచి వెళ్ళబోతున్న ఆమెతో "ఇదేమిటో చూడండి" అన్నాడు.

అతడు అందించిన పలక తీసికొని ఆమె తన గదిలోకి వచ్చేసింది. దానిపై అతడి దస్తూరి ఎంతో అందంగా కన్పించింది.

"రేవతీ! మీ ఆలోచన ఇంకా అవలేదా? ఆలస్యం అయ్యేకొద్దీ నా మనసు ఆందోళితమవుతోంది. నాకు మీరు కావాలి. నాతో జీవితం అద్భుతంగా ఉండకపోయినా, ఆనందంగా మాత్రం ఉంటుందని నమ్మకంతో చెపుతున్నాను. దయచేసి మన వివాహానికి అంగీకరించండి"

ముత్యాల్లాంటి ఆ అక్షరాలను చూస్తూ చాలాసేపు ఉండిపోయింది. అతడి ప్రవర్తన, మంచితనం నెమ్మది నెమ్మదిగా ఆమెను ఆలోచనలో పడేశాయి.

ప్రభాతవేళ నిద్రలేచిన అతడికి నవ్వుతున్న ఆమె అందమైన మోము ప్రత్యక్ష

మైంది. "రేవతీ! మీరు... మీరు మన పెళ్ళికి అంగీకరించినట్లే కదూ? "

ఆనందంగా అడుగుతున్న అతడిని చూసి "మీరు నాన్నగారితో మాట్లాడండి" అని వెళ్ళిపోయింది. అతడి ఆనందం అంబరాన్ని తాకింది.

బయలుదేరి వెళ్ళిపోయే సమయంలో రేవతి తండ్రితో అసలు విషయం బయట పెట్టాడు. తనవాళ్ళు త్వరలో వస్తారని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆనాటినుండీ ఇంట్లో వాగ్వివాదాలే. అన్నయ్యలు అటూ ఇటూ కాకుండా ఊరుకొన్నారు. ఆ అబ్బాయే వచ్చి అడుగుతున్నాడు కనుక కట్నకానుకల బాధ ఎక్కువగా ఉండదని వాళ్ళ ఆలోచన. ప్రియంవదకి, ఆమె భర్త భాస్కరరావుకి, తండ్రికి ఈ సంబంధం బొత్తిగా నచ్చలేదు.

చదువు చూస్తే గ్రాడ్యుయేషన్ అయినా లేదు. ఉద్యోగం చూస్తే సామాన్యం. కుటుంబానికి ఆస్తి పాస్తులు లేవు. ఎందుకు వెళ్ళివెళ్ళి ఆ సంబంధం చేసుకోవాలని వారి వాదన. ప్రియంవదయితే తమ అత్తవారి కుటుంబాలు నవ్వుతాయని గొడవ. అన్నదమ్ములని ఒక్క ఆడపిల్ల పెళ్ళి చేయలేరా అని ఈసడించింది. చివరికి వారు కూడా ఈ నిష్ఠూరాలు భరించలేక సంబంధం వదులుకొందామనేశారు. కాని అందరి అభిప్రాయాలనూ ఆమె కొట్టిపారేస్తోంది. "తనంతట తానుగా వచ్చారంటే నాపై గల ఇష్టంతో వచ్చారు. సిరిసంపదలు శాశ్వతం కాదు. బళ్ళు ఓడలవవచ్చును. ఓడలు బళ్ళు అవవచ్చును. చదువుదేముంది.? ప్రైవేటుగా చదువుకోవచ్చును.

"నన్ను ఇష్టపడి వచ్చేవాళ్ళతో నా జీవితం బావుంటుందని నా నమ్మకం. ఆపై దైవ నిర్ణయం"

ఎందరు ఎన్నివిధాలుగా చెప్పినా ఆమె వినలేదు. అక్కగారు డబ్బులేనివాడని ఈసడిస్తే, ఎంత డబ్బు ఉంటే తృప్తి ఉంటుందని ఎదురు ప్రశ్నించింది.

డబ్బుకి, జీవితాలకి లంకెపెట్టడం ఆమెకి సాధ్యంకాలేదు. నిర్మలమైన అతడి ప్రేమకి కట్టుబడిపోయింది. "అక్కా! నాకు డబ్బు కంటె, హోదాలకంటే స్వేచ్ఛ ముఖ్యం. నేను నేనుగా ఆయన దగ్గర బతకవచ్చును. నా పద్ధతులు నచ్చేకదా ఆయన అభిమానించింది. దీని విలువ నీకు ఇప్పుడు నేను చెప్పినా అర్థమవదు. కాలం ఈ విషయం తెలియచేస్తుంది"

చంద్రమౌళి మాత్రం రేవతినే సమర్థించాడు. ఆమె ఆలోచనలు సరైనవే అని అతడి నమ్మకం. అలాగ రేవతి పెళ్ళి కిషోర్‌తో జరిగిపోయింది. తమ పెళ్ళికి అంగీకారం మనస్ఫూర్తిగా తెచ్చిన చంద్రమౌళి అంటే వారిద్దరికీ ప్రాణం.

చంద్రమౌళి సాలోచనగా చూస్తూ, ఇదంతా చెప్పి అన్నాడు "మా అక్క మాట నిజమేనన్పిస్తుంది. తను సెకండరీ గ్రేడ్ టీచర్‌గా ఉద్యోగం తెచ్చుకొంది. ఈరోజుకి యం.ఏ. ప్రైవేటుగా చదువుకొని, బి.యిడి టీచరుగా ప్రమోషన్ పొందింది. బావకి కూడా త్వరలో అసిస్టెంటుగా ప్రమోషన్ వస్తుందిట.

"ఇన్నాళ్ళూ భర్తవైపు బాధ్యతలు తీర్చారు. ఇప్పుడింక ఇల్లు కట్టుకొంటారుట. నాకేం డౌటు లేదు. అది అనుకొన్నవన్నీ సాధిస్తుంది"

తండ్రి మాటలలో అక్కగారి మీదగల అభిమానానికి పిల్లలు ముగ్ధులయ్యారు. అన్నపూర్ణకి అన్యోన్యమైన రేవతి కాపురం గుర్తు వచ్చింది.

★ ★ ★

కాలచక్రం ఎవరికోసం ఆగదు. పొద్దు పొడిచినా, పొద్దు కుంగినా ప్రవాహధర్మం ఎలా మారదో కాలం కూడా అంతే. ఆనం




దంగా గడిచే సమయంలో అయితే కాలం ఎంత వేగంగా కదులుతోందో ఎవరం గమనించం.

చంద్రమౌళి విషయంలో అలాగే ఉంది. అతడు ప్రమోషన్ పొందాడు. ప్రమోషన్ ఉన్న జిల్లాలోనే రావడం అతడికి ఎంతో ఆనందం కలిగించింది. దానికోసం అతడు చేసిన ఖర్చు విషయం అప్రస్తుతం. మొత్తానికి అటు నాయకుల రికమెండేషన్, ఇటు అధికారుల అనుగ్రహం అతడికి లాభించాయి.

ఉద్యోగంలో అభివృద్ధిలాగే పిల్లల చదువులూ బావున్నాయి. వేణుగోపాల్ ఆఖరి ఏడాది చదువులోకి వచ్చాడు. నందుకి మెడిసిన్‌లో డొనేషన్ కట్టి సీటు సంపాదించాడు. ఎంతో ఉత్సాహంతో నందు యం. బి. బి. యస్. చదువు ప్రారంభించాడు.

కృష్ణమోహన్ టెన్త్‌క్లాసు ఫస్టు క్లాసులో పాసయినా మార్కులు 65% మాత్రమే వచ్చాయి. చంద్రమౌళికి ఆ మార్కులు సంతృప్తి కలిగించలేదు. బాగా చదివితే ఏ ఇంజనీరో అవ్వచ్చునుకదా అని అతడి గొడవ.

ఒక కొడుకు ఎలాగో కంప్యూటర్ ఇంజనీర్ కనుక కృష్ణమోహన్ ఏ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరో అయితే బావుండుననుకొన్నాడు. అన్నల దగ్గర ఉంచి, రెసిడెన్షియల్ కాలేజీలో చేర్పిస్తానని, మరొకపక్క యం. సెట్‌కి కోచింగ్ తీసుకోవచ్చునని అతడు కొడుక్కి చెప్పాడు.

కృష్ణమోహన్ నిర్మొహమాటంగా చెప్పేశాడు. "నేను ఇక్కడే ఉండి చదువుకొంటాను. నాకు రెసిడెన్షియల్ కాలేజీ వద్దు"

కొడుకు మాటలకు చంద్రమౌళికి కోపం వచ్చేసింది. తను డబ్బు పెడుతుంటే చదవడానికి వాడికేం బాధ? వాడిని వెళ్ళకపోతే ఊరుకోనన్నానని చెప్పు అంటాడు. కృష్ణమోహన్ చూస్తే నాకు ఈ ఊర్లోనే బావుంటుందమ్మా! నాకోసం ఎందుకు అనవసరంగా ఏభైవేలు పాడుచేస్తారు? హాయిగా ఇక్కడుండి ప్రభుత్వ కాలేజీలో చదువుకొంటానమ్మా అంటాడు.

ఆమెకి వాళ్ళిద్దరి మధ్య ఏం చేయాలో తోచడంలేదు. డబ్బు ఖర్చు విషయం వాడికెందుకు? వాడిని చదివి బాగుపడితే చాలన్నానని చెప్పు అంటాడు భర్త. ఆయనకి నిన్ను అన్నయ్యకిలాగ ఇంజనీరుని చెయ్యాలని ఉందిరా! నాన్నగారి మాట వినవచ్చు కదా అని అమాయకంగా అంటున్న తల్లిని అతడు జాలిగా చూశాడు.

"అమ్మా! ఆయన చెప్పమన్నవన్నీ చెప్పేయడమేనా? అయినా ఇదేమైనా జంతికలు, చేగోడీలు చెయ్యడమా? ఎవరికి ఎలాంటి దారి ఇష్టమో ఆ దార్నే వెళ్ళాలి. ఆయన చెప్పే కాలేజీల్లో పీకిపాకం పట్టేస్తారమ్మా! అక్కడ నాకు ఫ్రీగా అన్పించదు. ఇక్కడ బాగా చదువుతానని చెప్పు"

అన్నపూర్ణ భర్తతో నచ్చచెపుతున్నట్లుగా ఆ మాటలే చెప్పింది. "పెద్దవాళ్ళిద్దరూ దూరంగా ఉండి చదువుతున్నారుకదా! పాపం వీడు ఇల్లు వదిలి ఉండలేడు. ఇక్కడే చదువుకోనీయండి"

చంద్రమౌళి ఎగతాళిగా చూస్తూ అన్నాడు. "ఇల్లు వదిలి ఉండలేడా? అడ్డమైన స్నేహితులను వదిలి ఉండలేడా? ఏ సెంటర్లలో చూసినా, ఏ హోటల్‌లో చూసినా వాళ్ళే"

కృష్ణ తల్లి దగ్గర వేళాకోళంగా అన్నాడు. "నాన్నగారు ఆఫీసు మానేసి మా వెనకాలే తిరుగుతున్నాడులా ఉందమ్మా. లేకపోతే మేం తిరిగేవన్నీ అంత ఖచ్చితంగా ఎలా తెలుస్తాయి"

అన్నపూర్ణకి వాళ్ళిద్దరి తంతుకి నవ్వాలో, ఏడ్వాలో అర్థమవదు. అన్నలిద్దరూ కూడా తండ్రి చెప్పినట్లు తామున్నచోటో, నెల్లూరు

లోనో చేరమన్నారు. చివరికి అన్నపూర్ణకి విసుగేసి "ఆయన డబ్బు పెడతానంటే ఎందుకు వెళ్ళనంటావురా?" అని నిలదీసింది.

"ఆయనకి అంత డబ్బు ఖర్చుపెట్టాలని సరదాగా ఉంటే నా పేర ఏ ఫిక్స్‌డ్ డిపాజిట్లో చెయ్యమను. ఎందుకు వృధాగా ఖర్చు పెట్టడం? నన్ను ఇలాగ వదిలేయమను"

కృష్ణ మొండితనం చూసి చంద్రమౌళి చాలా రోజులు చిరాకు పడ్డాడు. చివరికి అతడనుకొన్నట్లు ఊళ్ళో కాలేజీలోనే చేరాడు.

అన్నపూర్ణకీ భర్త పట్టుదల విసుగన్పిస్తోంది. వాడికి నచ్చినది వాడిని చదువుకోనీయవచ్చునుకదా అన్పిస్తుంది. నాన్నగారు చెప్పినట్లు ఏ ఇంజనీరో, డాక్టరో అవ్వాలా? ఏం ఏ కలెక్టరో అవకూడదా? అంటూ వాదించే కొడుకు ఆమెకి వింతగా అన్పిస్తాడు.

"ఏమైనా అన్నల బుద్ధి నీకు రాలేదురా?" అంటే "చాల్లే... ప్రతీదానికి గంగిరెద్దులాగ తల ఊపడమే బుద్ధా? అలాంటి బుద్ధి నాకొద్దు" అంటాడు.

"తను చెప్పినట్లు చదవకపోతే మానేశాడు. పోనీ ఆ వెధవలతో స్నేహమైనా తగ్గించుకోవచ్చుకదా" అంటాడు తండ్రి.

"నా ఫ్రెండ్స్‌ని వెధవలు, గిధవలని తిట్టవద్దని మీ పతిదేవులకి చెప్పమ్మా! ఆయన లాగా డబ్బు సంపాదించడం నా ఫ్రెండ్స్ తండ్రులకి తెలియదు"

కృష్ణమోహన్‌కి స్నేహం విషయంలో కూడా తండ్రి ఆంక్షలు చెప్పడం ఇష్టం ఉండదు. స్నేహం చేస్తే అంతస్థులు, జీతాలు, హోదాలు చూసి చెయ్యాలా? అలాగ చేసేది అసలు స్నేహమే కాదు. స్నేహం అన్నది మనసుకి సంబంధించింది. ఏయే మనసులని దేహం అనే గంగాధార కలుపుతుందో ఎవరికి తెలుస్తుంది?

అన్నపూర్ణకి భర్త తీరు చూస్తే ఆశ్చర్యం కలుగుతోంది. అడుగడుగునా స్టేటస్ అంటాడు. తనకి సంబంధించిన వాళ్ళ ఇళ్ళల్లో ఫంక్షన్స్ అంటే ఆమె రానన్నా వినడు. బలవంతంగా తీసికెళతాడు. వాళ్ళందరితో తనలాగా చనువుగా ఉండమంటాడు. ఇంక ఇన్నేళ్ళ వయసయ్యాక తనలో మార్పు వస్తుందా?

ఆమెకి అనారోగ్యం వచ్చినప్పటినుండే డబ్బు విషయాలు ఆమెకి తెలియనీయడం లేదు. అయినా భర్త తన పద్ధతులు మార్చుకోలేదని ఆమెకి అర్థమవుతూనే ఉంది. అతడి ఉద్యోగం మరింత విస్తృతమై మరింత ఆదాయానికి మార్గం ఏర్పడిందని ఆమెకి ఎవరివలనో ఒకరివలన తెలుస్తూనే ఉంది. వీటన్నింటి మధ్య పిల్లలిద్దరి అల్లరి, హడావుడి ఆమెను సేద తీరుస్తున్నాయి.



లలితకి టైఫాయిడ్ జ్వరం వచ్చింది. చంద్రమౌళి చిన్నపిల్లాడిలాగ కూతురి మంచం దగ్గరే ఉండిపోయాడు. కృష్ణ చెల్లెలికి కబుర్లు, కథలు చెప్పి నవ్వించేవాడు. అతడు డాక్టరుగారిని మార్చేద్దామని గొడవ. దానికి కారణం లేకపోలేదు.

కృష్ణమోహన్ డాక్టరుగారింటికి మందులకి వెళ్ళిన సమయంలో ఆయన "వైద్యుడు లేనిచోట" అనే పుస్తకం చదువుకొంటున్నారట. కృష్ణమోహన్‌కి ఆమధ్య సైన్సు ఫెయిర్‌లో అదే పుస్తకం ప్రైజు ఇచ్చారు.

ఇంక చూడండి అతడి గొడవ. ఆ పుస్తకం చూసి ఆయన వైద్యం చేస్తూ, మనల్ని ఇలాగ చేయండి, అలాగ చేయండి అంటున్నారు. మనం ఆ వైద్యం అది చదివి చేసుకోలేమా? అంటాడు. అన్నపూర్ణ అతడిని మందలించింది. ఆరోజు నుండి అతడు మాత్రం తన విషయంలో ఆ పుస్తకాన్నే అనుసరించసాగాడు.

మరొకసారి ఇతడు వెళ్ళేసరికి డాక్టరుగారు కుటుంబంతో చిన్న తిరుపతి వెళ్ళిపోయారు. నౌకరు వాళ్ళ పాపకి బావుండనప్పుడు కుటుంబం అంతా కలిసి వస్తామని డాక్టరుగారు మొక్కుకొన్నారని, అందుకే వెళ్ళారని చెప్పాడుట.

ఆరోజు లలితకి మరీ టెంపరేచర్ ఉంది. ఇంక అతడు పట్టుబట్టి మరొక డాక్టరుని పిలిపించాడు. పాపం మన డాక్టరుగారు వాళ్ళ అమ్మాయి జ్వరానికి, తనమీద, తను ఇచ్చేమందులు మీద నమ్మకం లేక చిన్న తిరుపతి వెళ్ళిపోతూంటే వారం అయినా మనం చెల్లిని అతడి చేతిలో ఉంచి ఎలా ఉండగలుగుతున్నాం అంటూ వాదన.

డాక్టరుగారు వాళ్ళకి ఫ్యామిలీ డాక్టరుగారే కనుక ఆయన వచ్చాక కృష్ణమోహన్ అన్న మాటలు చంద్రమౌళి చెప్పాడు. ఆయన ఒకటే నవ్వు. ఆయన కృష్ణమోహన్ భుజం మీద చెయ్యేసి, "పెరటి చెట్టు మందుకి పనికిరాదని సామెత తెలియదోయ్" అన్నారు. "అయితే నువ్వూ వైద్యం ప్రారంభించేవన్న మాట. నాకు పోటీ అయిపోతావా" అంటూ నవ్వేశారు.

కృష్ణమోహన్ తనకి ఏదైనా చిన్న చిన్న అనారోగ్యాలు వస్తే అందులో చూసే వైద్యం చేసేసుకొంటాడు. తల్లి డాక్టరు దగ్గరికి వెళ్ళమని గోల పెడుతుంది. వినడు.

అన్నపూర్ణకి ఒక్కొక్కసారి తనమీద తనకే కోపం వస్తోంది. ఇంటి గురించి, పిల్లల గురించి పట్టించుకొనే తనకి ఏమయింది? ఎందుకనవసరమైన భయాలు చోటు చేసుకొంటున్నాయి? దీనికి కారణం ఏమిటని ఆమె ఆలోచిస్తోనే ఉంది.

ఈ సందర్భంలోనే వాళ్ళకి బాగా తెలిసిన ఒక రైల్వే అధికారిని అవినీతి కేసుమీద సి. బి. ఐ. వాళ్ళు పట్టుకొన్నారు. ఆయన రైల్వేలో ఉద్యోగాలిప్పిస్తానని ఎందరి దగ్గరో లంచాలు పుచ్చుకొంటున్నాడుట. ఇప్పిస్తానంటే ఎవరికైనా ఆశేకదా? ఆయనకి ఎందరో పిల్లలు ఉద్యోగాలకోసం డబ్బు ఇవ్వడం మొదలుపెట్టారుట.

వాళ్ళ ఆఫీసులోనే ఎవరో సి. బి. ఐ. వాళ్ళకి ఇన్‌ఫర్మేషన్ అందించారుట. వాళ్ళు తీసుకెళ్ళి జైలులో పెట్టారు. ఆయన భార్యా, పిల్లలు గోల. ఆయనను బెయిల్‌మీద విడిపించేటప్పటికి వాళ్ళకి తల ప్రాణం తోకకి వచ్చింది. ఆ పరిస్థితులలోనే వాళ్ళ అబ్బాయి డబ్బు కొంత సర్దుబాటు చేయమని, తండ్రి వచ్చాక ఇచ్చేస్తామని చంద్రమౌళి దగ్గరికి వచ్చాడు.

ఇదంతా చూసిన దగ్గర్నుండీ అన్నపూర్ణకి నిద్రపట్టడం మానేసింది. భర్త విషయంలో భయం ఎక్కువైంది. అతడిని తన పద్ధతి మార్చుకోమని గొడవ చేయడం మొదలుపెట్టింది.

చంద్రమౌళికి ఆమె ప్రవర్తనకి ఒకవైపు జాలి కలుగుతోంది. మరొకవైపు కోపం వస్తోంది. తను ఏమీ తెలియనివాడా? తన విషయాలు తను చూసుకోలేడా? ఎక్కడో ఎవరికో ఏదో అయితే ఈవిడ భయంతో అన్నం, నీళ్ళు మానేసి బెంగపడటం ఏమిటి? ఆ పరిస్థితులలో అన్నపూర్ణకి మళ్ళీ ఫిట్స్ వచ్చాయి.

ఆమె శారీరకంగా బలహీనంగా ఉందని, తగిన విశ్రాంతి ఇచ్చి, సంతోషంగా ఉండేలాగ చూడమని డాక్టరుగారు హెచ్చరించారు. చంద్రమౌళికి ఏం చేస్తే అన్నపూర్ణ సంతోషంగా ఉంటుందనిపించింది. అయినా ఇదేం గొడవ? ఏ భార్య అయినా నగలు, డబ్బు, చీరలు తెచ్చే భర్తను నెత్తిమీద పెట్టుకొంటుంది. ఈమె ఈమధ్య అన్నీ అనుమానంగా చూడటం మొదలుపెడుతోంది. ఈ గొడవలు బయట చెప్పుకోలేడు.

ఒకసారి తెల్లవారుజామున లేచి, చంద్రమౌళిని పట్టుకొని ఏడవడం మొదలుపెట్టింది. అతడు ఆమెను బుజ్జగించి, మంచినీళ్ళు ఇచ్చి విషయం తెలుసుకొన్నాడు. అతడిపై పీడకల వచ్చిందని బెంగపడింది. తెల్లవారుజామున వచ్చిన కలలు నిజమవుతాయంటారని బాధపడింది.

కృష్ణ ఈ హడావుడికి లేచి వచ్చాడు. అతడు తల్లి చెబుతున్నది విని, "నాన్నగారిని కూడా రైల్వే అంకుల్‌లాగ తీసికెళ్ళినట్లు కల వచ్చిందామ్మా? రైల్వే అంకుల్ చూడు హీరోలాగ ఎలా వెళ్ళి ఎలా వచ్చేశారో? ఆయన ఎప్పుడో మరిచిపోయినా నువ్వు మరవవా? " అంటూండగా ఇంక అతడిని మాట్లాడనీయకుండా అతడి నోరు మూసేసింది అన్నపూర్ణ. వెధవ ఎలా మాట్లాడుతున్నాడో? వాడు అలాగే మాట్లాడుతున్నా ఆయన ఎలా చూస్తూ ఊరుకొన్నారోననుకొంది.

చంద్రమౌళి పనుందని హైదరాబాద్ వెళ్ళాడు. ఆ సమయంలో రేవతి వచ్చింది. వాళ్ళ ఇల్లు పూర్తయిపోయిందిట. త్వరలో గృహప్రవేశం చేస్తామని చెప్పింది. అన్నపూర్ణ తన బాధంతా రేవతితో చెప్పుకొంది. చంద్రమౌళికి ఏవిధంగా నచ్చచెప్పడమో తనకి తెలియడంలేదంది.

రేవతికి విషయం బాగానే అర్థమైంది. చంద్రమౌళి సంపాదన గురించి ఆమె వింటూనే ఉంది. ఆమధ్య సున్నితంగా మందలించింది కూడా. ఈ విషయంలో మరదలు పడుతున్న భయాలు, బాధ ఆమెకి బాగా తెలిశాయి.

ఆమె ఉన్న రెండు రోజులు సినిమాలంటూ, షికార్లు అంటూ పిల్లల్ని, అన్నపూర్ణని తిప్పింది. ఆరాత్రి ఇద్దరూ పడుకొనేటప్పుడు రేవతి స్థిరంగా అంది.

"అన్నపూర్ణా! వాడు దుర్మార్గుడుకాదు. ఏవో కారణాలవలన ఇలాగ తయారయ్యాడు. నువ్వంటే వాడికి ప్రాణం. నీ గురించి వాడు తప్పక మారతాడు. నేను గట్టిగా మందలిస్తాను"

వదినగారు ఇచ్చిన హామీతో పూర్ణ మనసు తేలికైంది.

తర్వాత రేవతి నెమ్మదిగా చెప్పింది. "నీ ఒంట్లో బావుండటం లేదని తమ్ముడు మాకు ఫోను చేశాడు. అందుకే వచ్చాను. లేకపోతే ఇంటిపని చివర్లో ఉన్న సమయంలో వస్తానా? "

రేవతి ప్రపంచ తీరుతెన్నులను గురించి, దేశ పరిస్థితులను గురించి మరదలికి చెప్పడం మొదలుపెట్టింది? "ఎక్కడ అవినీతి లేదు? అవినీతి, లంచగొండితనం లేని ఒక్క డిపార్టుమెంటు చూపించు. ఈ రోజుల్లో అది సామాన్యమైపోయింది. ప్రజలు దాన్ని పట్టించుకొనే సమయాల్లో పట్టించుకొంటున్నారు. విసుగు వేస్తే వదిలేస్తున్నారు. చిన్న ఉద్యోగులనుండి పెద్దవాళ్ళవరకూ ఇది ఒక జాడ్యమైపోయింది. నూటికి ఏ పదిమందో నీతిగా బతికేవారు ఉన్నారు. అలాంటివాళ్ళనే మనం ఆదర్శంగా తీసుకోవాలి.

"ఇంక దేశం విషయానికి వస్తే మరీ దరిద్రం. స్కాంలకి అంతులేదు. పశువుల గడ్డి నుండి సైనికుల తుపాకుల వరకూ అన్నీ కుంభకోణాలే. పేపర్లో చదివి అసహ్యించుకుంటాం. నాలుగురోజులు పత్రి





కలు, ప్రజలు గోలపెడతారు. తర్వాత మామూలే.

"ఇవన్నీ ఎందుకు చెపుతున్నానంటే అవి నీతిగా బతకమని కాదు. మన పరిసరాలు ఇలా ఏడుస్తున్నాయని చెపుతున్నాను. మౌళి వచ్చాక నేను మళ్ళీ వస్తాను. ఇవన్నీ మనసులో పెట్టుకొని ఆరోగ్యం పాడుచేసు కోకు"

వదినగారు చెప్పినమాటలన్నీ అన్నపూర్ణ జాగ్రత్తగా వింది. ఆమె మందలిస్తానంటే మందలించి తీరుతుంది. చంద్రమౌళి ఆమె మాట తప్పక వింటాడు.

అన్నపూర్ణ తన దగ్గరున్న చీరలలో ఒకటి తెచ్చి వదినగారికి బొట్టుపెట్టి ఇచ్చింది. ఇలాంటి అక్కరలేని మర్యాదలు వద్దని రేవతి దెబ్బలాడినా ఆమె వినలేదు. ఆమె వచ్చింది. తనకి ప్రాణం వచ్చినట్లు అన్పిం చింది. తన మనసు తేలికైంది. భర్తలేడని ఎలా వట్టి చేతులతో పంపగలదు?

చంద్రమౌళి తర్వాత వచ్చి భార్య చెప్పి నది విని ఆశ్చర్యం నటించాడు. "నువ్వే... నీ అంతట నువ్వే అక్కని మర్యాదలతో పంపించావా? బాప్‌రే! పూర్ణా! నువ్వు మారిపోతున్నావోయ్"

అన్నపూర్ణ కోపంతో మూతి బిగించింది. "ఏమిటి మీ ఉద్దేశ్యం. నాకసలు ఏ మర్యా దలూ తెలియవనా? "

అతడు చెంపలు వాయించుకున్నాడు "హతోస్మి. నా ఉద్దేశ్యం అదికాదు. మా పూర్ణ భర్తకి చెప్పకుండా ఒక్క అడుగైనా ముందుకు వేయదని"

అన్నపూర్ణ అతడి మాటలకు నవ్వుతూ, "అది ఈ భర్తగారికి ప్రియమైన అక్కగారు వచ్చినప్పుడు వేసిన అడుగు. అయినా నిజం చెప్పండి. నేను ఆవిడను ఏ జాకట్టు గుడ్డో ఇచ్చి పంపేస్తే మీరు బాధపడరూ? మీ గౌరవం నిలిపినందుకు నాకు పార్టీ ఇవ్వాలి" అంది.

అతడు భార్యమాటలు విని ఆనందిం చాడు. ఆ సాయంత్రమే భార్యాపిల్లలను తీసుకుని హోటల్‌కెళ్ళి, అక్కడనుండి సిని మాకి వెళ్ళాడు. సినిమాలో పక్కన కూర్చున్న పూర్ణని చూస్తే అతడికి ఎంతో తృప్తిగా అన్పించింది.

ఇంటికి వచ్చినా అదే భావం. తన తృప్తి, తన ఆనందం అన్నీ ఆమెలో ఉన్నాయన్పి స్తుంది. ఆమె ఒక మహారాణిలాగా ఈ ఇంట్లో తిరుగుతోంటే తన జీవితానికే వెలుగు అన్పిస్తుంది. సామాన్యంగా కన్పించే ఈమె తనలో ఇంత ఉత్తేజాన్ని ఎలా కల్గిం చగలిగింది? అతడు పరవశంగా ఆమెను దగ్గరికి తీసుకున్నాడు. ఈ సన్నిహిత త్వంలో కోరికల వడి కన్నా ఆత్మీయతే ఎక్కువని అతడికి తెలుసును.

అన్నపూర్ణ తండ్రికి బావుండలేదని ఫోన్ వచ్చింది. వెంటనే వీళ్ళను బయలుదేరి రమ్మన్నారు. డయేరియాతో బాధపడుతున్న ఆయనను హాస్పిటల్‌లో చేర్పించారు. వీళ్ళందరూ వెళ్ళిన సాయంత్రమే ఆయన పోయారు.

పెద్దాయన మరణం తట్టుకోలేని విష యమే అయింది. మూడురోజులుండి, అన్న పూర్ణని అక్కడ వదిలి, తను మళ్ళీ వస్తానని పిల్లలని తీసుకొని చంద్రమౌళి వచ్చేశాడు. ఆ ఏడుపుల మధ్య పెద్దవాళ్ళే భయపడ తారు. ఇంక పిల్లలు బెంబేలు పడతారని అతడు అన్నపూర్ణకి నచ్చచెప్పి, ఇంటికి తీసు కొచ్చాడు.

అతడికి ఇంటికి వచ్చినా అన్నపూర్ణ మొహమే వెంటాడుతోంది. ఆమెకి తండ్రి అంటే ఎంతో అభిమానం. ఏడ్చిఏడ్చి వాచిన కనుదోయితో, వడిలిన మొహంతో, నీర సంగా కన్పిస్తున్న భార్యను చూస్తే అతడికి గుండె పిండినట్లయింది. మరదలిని పిలిచి ఆమెను జాగ్రత్తగా చూడమని పదేపదే చెప్పాడు.



అతడు ఇంటికి వచ్చేటప్పటికి రేవతి నుండి వచ్చిన ఉత్తరం ఉంది. అతడు బట్టలైనా మార్చుకోకుండా దాన్ని అందుకున్నాడు. ఆ ఉత్తరం వెంట అతడి కళ్ళు ఆత్రంగా పరుగెత్తసాగాయి.

శాంతమ్మగారు వచ్చి అతడిని అన్ని విషయాలూ అడగసాగింది. అతడు అన్యమనస్కంగానే ఆవిడకి విషయాలు వివరించాడు. అసలే అన్నపూర్ణ నీరసంగా ఉందనుకుంటే, ఈ కష్టం కూడా ఇప్పుడేరావాలా? అని ఆవిడ బాధపడింది.

పిల్లలకి, అతడికి ఆవిడ భోజనం వడ్డించింది. అలసటవలన భోజనాలవగానే పిల్లలు నిద్రపోయారు. అతడికి పక్కమీద ఎంత దొర్లినా నిద్రరాలేదు. లేచివెళ్ళి రేవతి ఉత్తరం తెచ్చి, మళ్ళీ చదువుకున్నాడు. ఆ ఉత్తరంలోని కొన్నిమాటలు అతడి మనసుని వెంటాడసాగాయి.

ఉత్తరం దాచేసినా అవి అతడిని నిశ్చింతగా ఉండనీయడంలేదు.

"చిన్నప్పుడు తప్పుచేస్తే చెవులు మెలిపెట్టేదాన్ని, గుంజీలు తీయించేదాన్ని. ఎండలో నిలబడమని ఆజ్ఞ జారీ చేసేదాన్ని. ఇప్పుడు ఏం చేయనురా? నా తమ్ముడు, నా మౌళి పెడమార్గాలు పడుతున్నాడంటే, ధనానికి, అధికారానికి అమ్ముడుపోతున్నాడంటే నమ్మలేకపోతున్నానురా!

"ఎవరైనా భార్య ఒత్తిడికి తప్పుడు మార్గం పట్టిన వాళ్ళు ఉండవచ్చును. కానీ నీ భార్య ఉత్తమురాలురా! నిన్ను తప్ప ఏ సంపదలూ కోరదు. ఆ విషయం నీకు తెలియదా?

కోరి ఆమెను నీ జీవితంలోకి ఆహ్వానించావు. తన జీవితాన్నే నైవేద్యంగా నీకర్పించిన ఆమె మంచిచెడ్డలు నీకవసరంలేదా? ఆమె మనసు తెలుసుకొని ప్రవర్తించవద్దా?"

చంద్రమౌళి అసహనంగా కదిలి కిటికీ వద్దకి వచ్చాడు. పెరటిచుట్టూ ఉన్న మొక్కలన్నీ ఆ వెన్నెలలో అందాలొలకపోస్తున్నాయి. సన్నజాజిపూలతో తీగనిండుగా కన్పిస్తూ, పరిమళాలు వెదజల్లుతోంది. "మీ స్నేహితురాలుంటే మిమ్మల్నిలాగ వదిలేసేది కాదుకదా" అనుకున్నాడు.

'ఆకులో ఆకునై, పూవులో పూవునై. కొమ్మలో కొమ్మనై, నునులేత రెమ్మనై ఈ అడవి దాగిపోనా... ఎటులైనా ఇచటనే ఆగిపోనా? ...'

అతడికి హఠాత్తుగా అన్నపూర్ణ తరచుగా పాడే ఈ పాట గుర్తువచ్చింది. కృష్ణశాస్త్రి సాహిత్యమంటే అన్నపూర్ణకి ఎంత ఇష్టం? ప్రాణం పెట్టి పాడుతుంది. ఈ మొక్కల దగ్గర తిరిగేటప్పుడు ఆమె తనని తాను మరిచిపోతుంది. మధురంగా మృదుస్వరంతో పాడుతుంది. అతడికి ఆ నిశ్శబ్దంలో అన్నపూర్ణ, ఆమె పాటలు స్ఫురణకి వస్తున్నాయి.

అన్నపూర్ణ ఈ ప్రకృతిలాగే స్వచ్ఛమైంది. ఆమె జీవితంలో తను ఏ అలజడులను రానీయకూడదు. అవసరమైతే తను వాళ్ళ కోసం మారాలి.

అతడు మొదటిసారి ఉలిక్కిపడ్డాడు.

తనేనా అనుకుంటున్నది ఈ మాట. డబ్బుకి, అంతస్థుకి ఈ సంఘం వేసే పెద్ద పీటను తను గుర్తించే ఇంతవరకూ ధనసంపాదనే ధ్యేయంగా పెట్టుకున్నాడు.

"మౌళీ! రేపు నీ బిడ్డలు నిన్ను ఆదర్శంగా తీసుకుని, మానవత్వ విలువలకి చరమగీతం పాడితే నువ్వు ఎలా భరిస్తావురా? వాళ్ళని నిలదీసే ధైర్యం నీకు ఆనాడు ఉంటుందా? ఒక్కక్షణం ఆలోచించు"

రేవతి జాబులోని మాటలు పదేపదే అతడిని నిలదీస్తున్నాయి.

"అవినీతి తాత్కాలికంగా ఆనందాన్నిస్తుంది. విజయం మాత్రం నీతికేరా! ఏనాటికైనా "నీతే" జయం పొందుతుంది. అవినీతిది తాత్కాలిక వీరవిహారమేరా! ఏకాలం




లోనైనా అవినీతి ఓటమిని పొంది నీతివైపు అడుగువేయవలసిందే"

ఎంత సూటిగా, ఎంత వాడిగా చెప్పింది అక్క. ఒక ఆడపిల్ల ఇంతలోతుగా ఆలోచిం చగలిగింది. తను... తను ఎందుకాలోచిం చలేకపోయాడు?

అతడు ఆవేదనగా నుదురు రాసుకు న్నాడు. ఈ సమయంలో అన్నపూర్ణ ఉంటే ఎంత బావుండును? ఆమె చల్లని ఒడిలో పడుకుని సేద తీరేవాడు.

చిన్నక్క జీవితం యమబిజీ పాపం. తన గురించి ఆలోచిస్తూ ఎంత కాలాన్ని వృథా చేసిందో? అతడికి ఆ క్షణంలో రేవతిని చూసి, ఆమె దగ్గర గుంజీలు తీయాలన్పిం చింది.

"డాడీ! మీరు నిద్రపోవడంలేదు. తాత గారి గురించి ఆలోచనలా? ఈ పాలు తాగండి. నిద్రవస్తుంది"

అతడు ఉలిక్కిపడ్డట్టు చూశాడు. అక్కడ కృష్ణమోహన్ నిలబడ్డాడు. నైట్ బల్బ్ కాంతిలో అతడి రూపం చంద్రమౌళికి ఎంతో ఊరట కలిగించింది.

ఏమీ బదులివ్వకుండా అతడి చేతిలోని గ్లాసు అందుకున్నాడు. కృష్ణమోహన్ తండ్రినే తదేకంగా చూస్తున్నాడు. ఏనాడూ తండ్రిమొహం అంత వాడిపోవడం అతడు చూడలేదు. తల్లి లేకపోవడంవలన బాధప డుతున్నాడా? తాతగారిని పోగొట్టుకొని తల్లి ఎంత ఆవేదన చెందుతోందోనని భయ పడుతున్నాడు కాబోలు.

ఖాళీగ్లాసు తీసుకుని వెనుతిరగబోయిన అతడికి "అన్నయ్యా" అంటూ లలిత రావడం కన్పించింది. "నన్ను వదిలి ఎక్క డికి వెళ్ళావు? " అంది నిద్రకళ్ళతో!

"అన్నయ్యా! మనం డాడీ రూంలో పడు కొందామా? " లలిత మాటలకి చంద్రమౌళి ఈ లోకంలోకి వచ్చాడు. "ఏమ్మా! భయం వేస్తోందా? ఇటు వచ్చి పడుకో"

చెల్లిని వెళ్ళమన్నట్టుగా కృష్ణమోహన్ చూశాడు. "చంటీ! నువ్వూ ఇక్కడే పడుకో! ఒక్కడివీ అక్కడ ఏం పడుకొంటావు"

చంద్రమౌళి కొడుకుని చూస్తూ అన్నపూర్ణ రూపం, నా ప్రవర్తనా వీడిలో కలగలిసి ఉన్నాయనుకున్నాడు. అతడు తండ్రి పిలు పులో తల్లిని చూస్తున్నాడు. ఆమెకి కొడు కుపై ఎక్కువ ప్రేమ కలిగినప్పుడు "చంటీ" అంటుంది.

కృష్ణమోహన్ తన గదిలోకి వెళ్ళి మడత మంచం తీసుకొచ్చి తండ్రి గదిలో వేసుకు న్నాడు. లలిత తండ్రి మంచంమీద పడు కొంది. చిత్రంగా చంద్రమౌళి మనసు శాంతించింది. లలితని చూస్తూ అతడు నిద్రలోకి జారుకున్నాడు.

కృష్ణమోహన్‌కి తండ్రి ప్రవర్తన కొంత వింతగా ఉంది. ఆయన దేన్ని గురించి ఆలోచిస్తున్నాడు? అతడికి మెరుపులాగా శాంతమ్మగారిచ్చిన ఉత్తరం గుర్తువచ్చింది.

ఆ కవరు ఎవరు రాసి ఉంటారు? స్నేహితులెవరైనా రాశారా? లేక పెదతం డ్రులెవరైనా రాశారా? ఆ ఉత్తరంలోని విష యాలు ఆయననేమైనా బాధించాయా? అతడు నిద్రపోతున్న తండ్రివైపు ఒకసారి చూశాడు.

తండ్రి మంచి స్ఫురద్రూపి. చామన ఛాయ రంగైనా మంచి ఆకర్షణీయంగా ఉంటాడు. సూదంటురాయిలాగా ఆకర్షించే కళ్ళు కాస్త చిన్నవిగా కన్పించినా బావుం టాయి. విశాలమైన ఫాలభాగం. అతడికి తల్లిదండ్రుల జంటను చూసి అందరూ మెచ్చుకోవడం ఆ క్షణంలో ఎంతో గర్వం కలిగించింది. తల్లి చాలా అందంగా ఉంటుంది. తల్లి అంత అందం లేకపో యినా తన తండ్రి ఆమెకి సరిజోడుగానే అన్పిస్తాడు.

చంద్రమౌళికి ప్రమోషన్ వచ్చాక పనిబా

ధృత తగ్గింది. ఆదాయం బాగా పెరిగింది. వద్దన్నా డబ్బు దానంతట అదే వచ్చి పడు తోంది. ఇంటిపైన మరొక అంతస్థు కట్టాల నుకుంటున్నాడు. పెద్దకొడుక్కి ఉపనయనం చేశాక ఇంటిపని చేద్దామనుకున్నాడు. చెల్లి కొడుక్కి ఉపనయనం చేయడం చూశాక అతడికి తమింట్లో ఏదైనా ఫంక్షన్ చేస్తే బావుంటుందనిపించింది. ఈలోపు మావ గారు పోవడం, ఈ గొడవలు. అన్నపూర్ణ ఈ బాధనుంచి తేరుకొనేవరకూ ఏ పనీ తలపెట్టడం అవదు.

రాత్రి బాగా ఆలస్యంగా పడుకోవడంతో అతడు ఉదయమే నిద్రలేవలేకపోయాడు.



డైనింగ్ టేబుల్ దగ్గర వంటకాలు చూసేటప్పటికి కృష్ణకు ఒళ్ళు మండింది. బీరకాయ పప్పు, బీరకాయ ఉల్లికారం పెట్టి కూర, అది చాలదన్నట్లు బీరకాయ తొక్కు నూపప్పు వేసి చేసిన పచ్చడి. వీటన్నింటికి నీరసంగా కన్పిస్తున్న చారు.

అతడు సీరియస్‌గా పిలిచాడు "శాంతమ్మ గారూ! మీకు నేనంటే ఏదైనా ప్రత్యేకమైన కోపమా? "

ఆవిడ తెల్లబోయినట్లు చూసింది. "అదేమిటి నాయనా అలాగంటావు? "

"మరి ఎలా అనమన్నారో చెప్పండి. నామీద కత్తికట్టినట్లు ఈ వంటకాలేమిటి? నాకు, మా చెల్లికి ఈ కూర నచ్చదని తెలిసి వండటం ఎందుకు?

"బీరకాయతో ఎన్నిరకాలు వండవచ్చునో ప్రపంచానికి చూపించి, డాక్టరేట్ పొందాలని ప్లాను వేస్తున్నారా? "

ఆవిడ లబలబలాడింది. "ఏదో మరిచిపోయి వండేశాను, వండాక గుర్తువచ్చింది. ఆ పచ్చడి నాకోసం చేసుకున్నాను. చిన్నపిల్లలు కదా అని మీకు వేశాను"

"ఓహో" అతడు వెటకారంగా అన్నాడు. "ఈ పచ్చడి మాకు వేయకపోతే, మేం పేచీలు పెట్టేసి ఏడుస్తామని, ఏదో దయతలచి వేశారన్నమాట"

"ఈ పూటకి భోజనం చేసేయండి. మీకు మధ్యాహ్నంవేళకి బంగాళాదుంపలు వేయిస్తాను. నా మాట వినండి. సాయంత్రం పూరీ, కూర చేసి పెడతాను. పేచీలు మాని తినెయ్యండి"

"నా ఆకలి ఎప్పుడో ఈ ఘనమైన పదార్థాలు చూసి చచ్చిపోయిందండీ"

లలితమ్మ పప్పు, పెరుగు అన్నంతో తినేసి లేచిపోయింది. అన్నపూర్ణ వచ్చేవరకూ ఈ పిల్లాడితో తనకి యాతనే అనుకుంది.

"చెల్లి చూడుబాబూ! ఎలా తినేసిందో? నీకూ కాలేజీకి టైమైపోతోంది. తినండి" ఆవిడ దెబ్బలాడితే లాభం ఉండదని బతిమాలడం మొదలుపెట్టింది.

ఇంక తను కల్పించుకోకపోతే ఆ గొడవ తగ్గదని చంద్రమౌళి భోజనానికి వచ్చాడు. తండ్రిని చూసి కృష్ణ కొంచెం తగ్గాడు. ఏం ఇంకా భోజనం చేయలేదంటూ తనకీ వడ్డించమన్నాడు.

"ఈ ఐటమ్స్ చూడండి. ఎవరు తింటారు? " దూకుడుగా అంటున్న కృష్ణని




చూస్తూ, తను కాస్త పప్పు తీసుకొని నోట్లో వేసుకున్నాడు. "బావుందే... మరింకేం. ఈ పూటకి తిను" అంటూ "కూరలు లేవాండీ" అని ఆవిడని అడిగాడు.

"లేవు బాబూ. ఇదిగో మధ్యాహ్నం వెళ్ళి తీసుకొని వస్తాను. గౌరిని వాళ్ళ నాన్న పనుందని నిన్న తీసుకొని వెళ్ళాడు. దాన్ని పంపుదామన్నా లేదు" ఆవిడ విషయంచెపు తూంటే, కొడుకుని చూస్తూ "అన్ని పదా ర్థాలూ తినాలి. లేకపోతే ఎక్కడికైనా వెళితే ఇబ్బంది" అన్నాడు.

కృష్ణ గబగబా భోజనం అయిందన్పించి, కాలేజీకి బయలుదేరుతూంటే తండ్రి ఎందు కైనా ఉంచుకో అంటూ ఏభైరూపాయలి చ్చాడు. అతడు ప్రసన్నంగా కాలేజీకి వెళ్ళి పోయాడు.

అన్నపూర్ణ వీడి అల్లరిగురించి అప్పుడ ప్పుడూ చెపుతూ ఉంటుంది. వీడి పెంకి తనం తగ్గేలాగా చూడాలి అనుకున్నాడు.

సాయంత్రం కృష్ణ ఫోనులో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. "అరే బాబూ! వినరా... మా మదర్ లేరుకదా! ప్రస్తుతం ఈ ఇంటికి నేనే పెద్దదిక్కుని. డాడీని, చెల్లిని చూడాలి. ఇల్లు చూడాలి. వంటింటి వైపు ఒక కన్ను వేయకపోతే మా శాంతమ్మ గారు ఆవిడకి నచ్చినవన్నీ వండేసి మా నెత్తిన రుద్దేస్తారు..."

లోపలికి వస్తున్న చంద్రమౌళి కొడుకు ఫోనులో మాట్లాడుతున్న విషయాలకి నవ్వుకున్నాడు. వెధవ... వెధవ కోతలు వాడూను.

కృష్ణ అటుతిరిగి ఉండటంతో తండ్రిరా కని గమనించలేదు. అవతలివాడు ఏమ న్నాడో ఏమో అతడు పకపక నవ్వుతూ అంటున్నాడు. "ఏమిటీ... మరీ పొడిచేస్తు న్నాననంటున్నావా? నీ యిష్టం వెధవా! ఏదన్నా అనుకో! నువ్వు అనుకుంటే నాకు లెక్కేమిటి?

"అవునురా! అమ్మ ఇంటికి వచ్చేవరకూ బంతీలేదు. బాటూ లేదు. అసలు సినిమాకి వెళ్ళి ఎన్ని రోజులైందో నీకు తెలుసా?

"అమ్మ వచ్చాక మనం ఒక మేచ్ వేద్దాంలే" అంటూ ఏదో చెప్పబోయిన అతడు లలిత డాడీ వచ్చారనడంతో ఆగి పోయి చూశాడు. ఫోనులో ఏదోచెప్పి పెట్టే స్తున్నాను అంటూ ముగించాడు.

కాసేపు గడిచాక చంద్రమౌళి పిల్లలను చూస్తూ ఏదైనా సినిమాకి వెళదామా అన్నాడు. కృష్ణకి రాత్రి తాలూకా తండ్రి సన్నిహితత్వం గుర్తువచ్చింది. తాను ఫోనులో అనడం విన్నాడో ఏమో సర దాయో, నిజమో ఎవరికి తెలుసు?

నిజమనుకొని గెంతితే చదువూ, సంధ్యా లేదా వెధవా అంటారు. ఈయన ఏ దారిలో వస్తాడో ఎవరికి తెలుస్తుందనుకు న్నాడు. కొడుకు మాట్లాడకపోవడం చూసి బయలుదేరండి. ఏదో ఒక సినిమాకి వెళదాం అన్నాడు.

కృష్ణకి అప్పటికి నమ్మకం చిక్కింది. పదవే! త్వరగా తెములుదాం అంటూ పరు గెత్తాడు. ఇద్దరూ ముస్తాబై వస్తుంటే కృష్ణ సాలోచనగా శాంతమ్మగారివైపు చూస్తూ "వంటయిపోయిందాండీ" అన్నాడు.

ఆవిడ ఎందుకడుగుతున్నాడో తెలియక పోయినా "అయింది బాబూ! ఉదయం చెప్పినట్లు మీకు ఇష్టమైన కొబ్బరిపచ్చడి చేశాను. బెండకాయ వేపుడు చేశాను" అంది.

అతడు నవ్వుతూ, "అది కాదండీ! నాన్న గారు సినిమాకి వెళదాం అంటున్నారు. మీరు ఒక్కరూ ఎందుకు ఉండటం? వంట యిందికదా సినిమాకి వస్తారని అడుగుతు న్నాను"

ఆవిడకి కళ్ళనీళ్ళు తిరిగాయి. అక్కకొడు కులు, మేనల్లుళ్ళు ఉన్నా ఏనాడూ తనను

పిలవరు. తనతోరారు. అలాంటిది ఈ ఇంట్లో... ఈ పిల్లవాడు...

ఆవిడ సంతోషంగా చూస్తూ "మీరు వెళ్ళి రండి. బాబూ! నేను ఇల్లు చూసుకుంటా" నంది.

"పరవాలేదు రండి. అందరం కలిసి ఆటోలో వెళదాం" అని అతడు ఆటో తేవ డానికి వెళుతూ, ఆమెను తెమలమన్నాడు.

చంద్రమౌళికి కొడుకు గురించి ఏమనుకో వాలో అర్థమవలేదు.

ఆ రాత్రి చంద్రమౌళి పుస్తకం చదువు కొని పడుకునేందుకు వచ్చేటప్పటికి పిల్లలి ద్దరూ నిద్రపోతూ అతడి గదిలో కన్పిం చారు.

అతడు కృష్ణని నిశితంగా చూస్తూ పడు కున్నాడు. పిల్లలలో నందు అతడితో బాగా చనువుగా ఉంటాడు. పెద్దవాడు కావలసి నవి అడగడం, జరిగిన విషయాలు చెప్పడం. తనని చూస్తే వీడు వయసుకి మించి ఎదిగిపోతున్నాడన్పిస్తుంది.

నందు కావలసినవన్నీ పోట్లాడి కొనిపి స్తాడు. వాడు ఏ పట్టుపట్టినా అది జరగక పోతే అలుగుతాడు. తాము ఇంకా పట్టిం చుకోకపోతే ఏడుస్తాడు.

ఈ చిన్నవాడు వాళ్ళిద్దరిలాగా కాదు. తన దగ్గర చనువు లేదా అంటే కుండబ ద్దలు కొట్టినట్లు మనసులో ఉన్నది చెపు తాడు. అలాగని బాగా సన్నిహితంగా ఉండడు. అసలు వీడు ఇంట్లో ఉండి ఏడిస్తే కదా అనుకున్నాడు.

అన్నపూర్ణ ఎలాగ ఉందో అని అతడు పదవరోజుకి వెళదామనుకున్నవాడు మూడురోజులు ముందుగానే బయలుదే రాడు. వేణు, నందు అతడితో బయలుదే రారు.

శాంతమ్మగారు లలితను ఉంచుకొంటాన న్నారు. గౌరికూడా వచ్చెయ్యడం వలన లలిత ఉంటానంది. వాళ్ళకి సాయంగా కృష్ణ ఉండిపోతానన్నాడు.

తండ్రి అటువెళ్ళగానే కృష్ణ ఫ్రెండ్స్‌కి ఫోన్ చేశాడు. వాళ్ళందరూ వచ్చిపడ్డారు. ఈమధ్య కలవకపోవడంతో ఒకటే కబుర్లు, నవ్వులు.

కృష్ణ మధ్యలో శాంతమ్మగారి దగ్గరికి వెళ్ళి బజ్జీలు అందరికీ చేసి పెట్టమన్నాడు. సినిమాకి వెళ్ళివచ్చిన దగ్గర్నుండీ వాళ్ళిద్దరి మధ్యా స్నేహం పెరిగింది.

ఆవిడ ఏమీ అనకుండా బజ్జీలు వేడివే డిగా వేసి ప్లేట్లలో పెట్టి ఇచ్చింది. సలీం "కృష్ణా హాట్‌తోపాటు స్వీటు కూడా ఉంటే బావుంటుందిరా. కావమ్మ వేడి జిలేబిలు వేసే టైమయింది. వెళ్ళి తెచ్చుకుందామా" అన్నాడు.

దాంతో కృష్ణ డబ్బులిచ్చి ప్రసాద్‌ను పంపాడు. అందరూ కలిసి కబుర్లుచెప్పు కుంటూ వాటిని తినేశారు. సలీంకి లలి తంటే ముద్దు.

రాత్రి ఏడుగంటలప్పుడు మళ్ళీ వచ్చాడు. కృష్ణ ఆశ్చర్యంగా చూస్తూ "ఏంరా? మళ్ళీ వచ్చావేం? డబ్బేమైనా కావాలా? " అని అడిగాడు.

"అబ్బే... అదిగాదు కృష్ణభాయ్. లలిత మ్మకి గోరింట తెచ్చినాను" అన్నాడు. లలిత చేతికిచ్చి, "చెల్లీ! రాత్రంతా ఉంచుకో! బాగా పండుతుంది"అన్నాడు

గౌరి భోజనాలవగానే అందంగా లలి తకి గోరింట పెట్టింది. మిగిలినది తను పెట్టుకుంది. కృష్ణబాబూ! మీరు రండంటూ పిలిచి, చిటికెన వేలుకి పెట్టి, అరచేతిలో అందంగా చిన్న డిజైను పెట్టింది.

ఉదయమే సలీం సైకిలు వేసుకొని వచ్చే శాడు లలితమ్మా చేతులు చూపించమ్మా అని. లలిత నవ్వుతూ ఎర్రగా పండిన రెండుచేతులూ చూపించింది. అతడు తృప్తిగా చూసి "పాదాలకు ఎందుకు పెట్టు





కోలేదమ్మా" అని, గౌరి చేతులు చూసి, "పాపకి పెట్టకుండా నువ్వు పెట్టుకున్నావా అదీ సంగతి" అన్నాడు.

కృష్ణ ఫ్రెండ్సుందరికీ లలితంటే ముద్దే. కృష్ణతోపాటు లలిత ఎప్పుడైనా వస్తే వాళ్లు ఏదో ఒకటి కొని ఇవ్వందే ఆమెను పంపరు. కృష్ణ నవ్వుతూ తండ్రితో సినిమాకి వెళ్ళడం, సినిమా మధ్యలో జరిగిన విషయం చెప్పాడు సలీంతో.

కృష్ణ తండ్రితో ఉన్నానన్న విషయం మరిచిపోయి సినిమాలో పాట ఒకటి వచ్చినప్పుడు హుషారు పట్టలేక స్నేహితులతో వెళ్ళినప్పుడున్న అలవాటు ప్రకారం గట్టిగా ఈలవేశాడు. డాన్సు దగ్గర హీరో వేస్తున్న స్టెప్స్ చూసి అలాగ చేశాడు.

చంద్రమౌళికి ఒళ్ళు మండింది. కింది క్లాసులో కూర్చున్న అలగా వాళ్ళలాగ ఏమిటా న్యూసెన్స్ అంటూ కేకలేశాడు. తండ్రి మొహం గంటుపెట్టుకోవడం చూసి నాలిక కొరుక్కున్నాడు.

అప్పట్నించీ చంద్రమౌళి కాస్త ముభావంగా ఉన్నాడనే చెప్పాలి. తమవైపు బాల్కనీలో కూర్చున్నవాళ్ళు కొందరు చూసిన చూపులకి ఆయనకి తల కొట్టినట్లయింది.

"సార్. బాగా కోపం చేశారా?" అని సలీం అడిగినదానికి కృష్ణ నవ్వుతూ, "ఓ అరగంట క్లాసు వేశార్లే. మా డాడీ ఎపుడూ ఎలా మందలిద్దామా అని చూస్తారు కదా! అయినా మన చర్మం చాలా దళసరి"

అతడి అభినయానికి సలీం నవ్వాడు.

★ ★ ★

అన్నపూర్ణకి డాక్టరు ఇంజక్షన్లు చేస్తుండడం చూసి, వెళ్ళిన చంద్రమౌళి గాబరా పడ్డాడు. ఆమెపెద్దన్న, వదిన రాజ్యలక్ష్మి కంగారు పడవలసింది లేదని చెప్పారు. అయినా అతడికి విషయం వినేవరకూ మనసు కంగారు పడుతూనే ఉంది.

వచ్చినవాళ్ళ పరామర్శలు, తల్లి ఏడుపు చూసి ఆమె పట్టువదిలేసింది. నిలుచున్నపాటున కళ్ళు తిరిగి పడిపోయింది. ఎటొచ్చీ కాస్త త్వరగా తెలివి వచ్చిందట. అందుకే డాక్టరుని ఇంటికి వచ్చి రోజూ చూసి వెళ్ళమన్నారుట.

అతడు ఆమెవైపు జాలిగా చూశాడు. తనవెంట ఉన్నపళంగా తీసుకెళ్ళి పోతే బావుండదు. మరో నాలుగు రోజులు తప్పదనుకున్నాడు. వేళకి భోజనం, నిద్ర లేకపోవడంతో మనిషి చూడటానికే ఎలాగో అన్పించింది.

రాజ్యలక్ష్మి అతడితో "మీరు చెప్పినంత తీవ్రంగా ఫిట్స్ రాలేదు కానీ వచ్చాయి. అందుకే అక్కని ఏ పనివైపూ వెళ్ళనీయడంలేదు" అంది.

భర్త, పిల్లలు తన దగ్గర దిగాలుగా కూర్చుని చూడటం ఆమెకీ బాధగానే ఉంది. ఏం చేస్తుంది? ఈ బలహీనత ఎలా వస్తోందో ఆమెకీ అర్థమవడంలేదు.

చంద్రమౌళి ఆమెను డాబాపై కూర్చోపెట్టుకొని అనునయించాడు. "మరణం ఎవరికైనా సహజమే. మనవాళ్లు అన్నవాళ్లు పోతే బాధ ఎటువంటి వారికైనా తప్పదు. అలాగని నిరంతరం ఏడ్చి, బెంగపడితే వాళ్లు వస్తారా? మన ఆరోగ్యం ఏమవుతుంది?

"అయినా ఎవరు చనిపోకుండా భూమి మీద ఉంటారు చెప్పు? ఈ రోజున ఆయన, రేపు నేను, తర్వాత..."

అన్నపూర్ణ భరించలేని దానిలాగ అతడి నోరు మూసేసింది. ఆమె భయంగా అతడివైపు చూస్తూ "వద్దు మీరు అలాంటి మాటలు మాట్లాడవద్దు" అంది.

అతడు ఆమె చేతిని పట్టుకొని "అది

కాదు అన్నపూర్ణా! మాట వరసకంటే నేను నిజంగా చచ్చిపోతానా" అన్నాడు. ఆమె తీవ్రంగా చూస్తూ "నేను భరించలేను. ఏదో పసుపు కుంకుమలతో మీ చేతులలో నా జీవనయాత్ర అయిపోతే చాలు. మీరందరూ సుఖంగా ఉండటమే నాకు కావాలి" అంది.

అతడు మరి సంభాషణ పెంచలేదు. భార్య అందరిలాగ ఆలోచించి ఎప్పటికి ధైర్యవంతురాలవుతుందో అతడికి అర్థమవలేదు. ఏ చిన్న సంఘటన జరిగినా విపరీతంగా చలించిపోతుంది. మామూలుగా స్పందించి, ధైర్యం తెచ్చుకోదు. ఇంత సుకుమారమైన మనసు, ప్రవర్తన ఉండటం ఒక విధంగా చూస్తే దురదృష్టమేనేమో?

తండ్రి కర్మ ఒక పక్క జరుగుతుంటే తమ్ముడి అధీనంలోనున్న పొలం కాస్తా పంచుకొందామని అన్నలు విషయం కదిపారు. తమ్ముడు ఈమధ్య కాస్తకాస్త కూడబెట్టి మరి రెండెకరాలు కొన్నాడు. ఆ రెండెకరాలు మా దగ్గరున్న డబ్బుతో కొనుక్కొన్నాం. అది ఎందుకు పంచాలని మరదలు వాదన.

అన్నపూర్ణకి వాళ్లు అలాగ ఆస్తి కోసం దెబ్బలాడుకోవడం ఎలాగో ఉంది. పెద్దవాళ్లిద్దరికీ ఉద్యోగాలున్నాయికదా! ఆ కాస్త పొలం తమ్ముడికి వదిలితే పోయేదేముంది? తండ్రి తర్వాత తల్లి ఇంకా ఉందన్న ఆలోచన అయినా వారిలోలేదు. మొదటిసారిగా మనుష్యులలోనున్న స్వార్థ ప్రవర్తనకి ఆమె విస్మయంగా చూస్తోంది.

వీళ్లు తనకి తెలిసిన అన్నలు కారు. వాళ్ల గొడవ ఒకపక్క, తమ్ముడి భార్య దెబ్బలాట మరొకపక్క. వాళ్లలాగ ఏదో ఒక ఉద్యోగం తన భర్త చూసికొని ఉంటే ఈ గొడవ ఉండేది కాదు. తమ్ముడేమో మా అన్నలు, ఈ వ్యవసాయం నాకే వదిలేస్తారనుకుంటుంటే ఇప్పుడు ఇలాగ గొడవ చేస్తున్నారు వాళ్లు. అన్నపూర్ణకి ఈ పరిస్థితి ప్రాణాంతకంగా అన్పించింది. నిన్నటి వరకూ కలిసి ఉన్న అన్నదమ్ములు ఈనాడు ఇలాగ కాట్లాడుకోవాలా? వెంటనే భాగాలు పంచుకోవాలా?

ఒకరితో నొకరు పంచుకోవలసినవి ప్రేమాభిమానాలు. అవి చెక్కుచెదరనివి.

అన్నపూర్ణ తమ్ముడు సూర్యనారాయణ చిన్నపోయిన మొహంతో అన్నాడు, "మీరు పెద్దవాళ్లు. మీరందరూ ఏం నిర్ణయిస్తే అది ఒప్పుకొంటాను. ఈమాత్రం దానికి ఊళ్లో పెద్దలెందుకు? ఒక సర్పంచినై ఉండి నా ఇంటి సమస్య నేను తీర్చుకోలేకపోయానని ఎగతాళి చేస్తారు నలుగురూ"

అన్నపూర్ణకి తమ్ముడు అలాగ బాధపడుతుంటే కడుపులో దేవినట్లయింది. తల్లి తాను బతికి ఉన్నన్నాళ్లూ అందరినీ కలిసి ఉండమన్నా కోడళ్లు వినలేదు.

వాళ్లది ఒకటే మాట. "ఇన్నాళ్లూ వాళ్లు ఏమీ అడగలేదు. ఈనాడైనా ఉన్నదేదో పంచిస్తే పిల్లలున్నవాళ్లు కనుక దాచుకొంటారు"

చంద్రమౌళే కల్పించుకొని ఆ వివాదానికి తెరదించాడు. "అతడు సంపాదించుకొన్న పొలం అతడి స్వంతం. తండ్రి భాగంగా ఉన్న పొలం కూడా అతడు తీసుకోవడానికి అన్నదమ్ములిద్దరికీ చెరొక పదివేలు అతడు ఇవ్వాలి. ఇల్లు మాత్రం ఆ ఊర్లో ఉండి తల్లి దండ్రులను చూస్తున్నాడు కనుక అతడిదే. విడిగా కళ్లం దగ్గర ఉన్న భాగాల్లో పెద్దవాళ్లిద్దరూ కావాలనుకొంటే ఇళ్లు కట్టుకోవచ్చును. లేదా ఆ స్థలాలు ఉంచుకోవచ్చును"

★ ★ ★

తండ్రి సంవత్సరీకాలకి కలిసినపుడు చిన్నవాడు డబ్బు ఇస్తానన్నా, వాళ్లు సమ్మతింపలేదు. తల్లి విషయం అడిగితే ఆవిడ ఎవరి దగ్గరుంటే వద్దంటాము. తనే ఉండదుకదా అనేశారు.

చంద్రమౌళి, అన్నపూర్ణ పిల్లలతో ఇంటికి వచ్చేశారు. కానీ వాళ్ల మనసులు వ్యధాభరితంగానే ఉన్నాయి. చంద్రమౌళి తాలూకా వాళ్లంతా పదవరోజుకి వచ్చారు. అన్నపూర్ణకి గల బలగం చూసి ఊళ్లో అందరూ పొగడటమే. అన్నపూర్ణ మాత్రం తండ్రి మరణంతో, ఈ పరిస్థితులతో సగం క్రుంగి పోయింది.

ఇంటికి వచ్చినా తల్లి మొహంలో కళాకాంతులు లేకపోవడంతో కృష్ణమోహన్ విషయం ఏమిటని నిలదీయడం మొదలు పెట్టాడు. వేణుగోపాల్ మంచం మీద వాలుతూ తాతగారు పోయారు. కనుక అమ్మ బాధపడుతోందన్నాడు.

కృష్ణమోహన్ తల్లి మొహం చేతులలోకి తీసికొన్నాడు. "అమ్మా పిచ్చితల్లీ! బుద్ధుడి కథ నీకు తెలుసుకదా! శోకం, మరణం బాధలు లేని ఇల్లు లేదని ఆయన తెలియ చేశాడా? లేదా? ఎన్ని తెలిస్తే ఏం లాభం? తమ వరకూ వస్తే ఇంతే కాబోలు. కాస్త మనసు దిటవు చేసుకో అమ్మా!"

అన్నపూర్ణ ఎప్పటిలాగ కొడుకు మాటలకి నవ్వుకోలేదు. "చంటీ! నన్ను విసిగించకురా" అంది.

"ఎంతమాట అన్నావు అమ్మా! నీ కొడుకు మాట్లాడితే చాలని ఫ్రెండ్సుందరూ ఉవ్విళ్లూరుతారే! అలాంటిది నీకు ఆ మాటలు విసుగన్పిస్తున్నాయా?"

నందు తల్లిని చూస్తూ "అమ్మది మరీ చాదస్తంరా కృష్ణా! అక్కడ జరిగిన ప్రతి చిన్న విషయం పట్టించుకొంటే ఎలాగ?" అన్నాడు.

పక్కగదిలో నున్న చంద్రమౌళి ఉలిక్కిపడ్డాడు. జరిగినవి చిన్న విషయాలా? కృష్ణకి పరిస్థితి సరిగా తెలీదని గ్రహించాడు. "నువ్వయినా చెప్పరా బాబూ" అంటూ వేణుని అడిగాడు.

వేణు టూకీగా జరిగిన విషయాలు చెప్పాడు. నందు తల్లివైపు విసుగ్గా చూస్తూ "పెద్ద మావయ్య వాళ్లు అలాగ అడిగారని, డబ్బు ఇమ్మన్నారని అమ్మకి కోపం. వాళ్ల తమ్ముడు ఒప్పుకొన్నా ఈవిడ, పిన్ని ఒప్పుకోలేకపోయారు"

అన్నపూర్ణ తీవ్రంగా చూస్తూ అంది. "ఏమిటిరా! తాతగారు పోగానే వాళ్లు అలాగ కాట్లకుక్కల్లాగ ఆస్తికోసం పోట్లాడుకోవాలా? తల్లి ఏం బాధపడుతుందో అని ఆలోచించవద్దా? వాడేమైనా బయటివాడా? తమకి తమ్ముడేకదా! ఇంత స్వార్థం ఉంటే ఎలాగ?"

నందుకి తల్లి అలా మాట్లాడటం నచ్చలేదు. "వాళ్ల పరిస్థితులు వాళ్లు చూసుకొంటే తప్పేమిటమ్మా! స్వార్థం అంటావేమిటి? వాళ్ల వాటా వాళ్లు అడిగారు. అది సహజమైన విషయమేకదా"

ఆవిడ ఏనాడూ లేనిది గయ్యిమని లేచింది. "ఏమిటిరా ఆ మాటలు? సహజమట... సహజం. తండ్రి పోయి పదిరోజులు కాలేదు. వంతులుగా ఆస్తి పంచుకొంటారుట. కలికాలం అంటే ఇదే కాబోలు. నీ సమర్థన ఏమిటిరా?"

నందు అంతకంటే గట్టిగా అన్నాడు. "వాళ్ల సాధకబాధకాలు ఏమిటో నువ్వు ఆలోచించావా? ప్రాక్టికల్‌గా ఆలోచించడం నేర్చుకోవాలమ్మా!"

వేణుగోపాల్ "ఎక్కడి విషయాలు అక్కడ మరిచిపోదాం. మనమెందుకు వాళ్ల గురించి దెబ్బలాడుకోవడం. ఆకలి వేస్తోంది టిఫిన్ విషయం చూడమ్మా" అని టాపిక్ మార్చాలని చూశాడు.

కృష్ణమోహన్ తల్లిని అనునయించాడు. "వాళ్లు ఎవరో అయితే అమ్మకి ఈ బాధ ఉండదుకదరా! మనవాళ్లు అనుకొన్నవాళ్లు అంచనాలు తప్పి ప్రవర్తిస్తేనే బాధ" అన్నాడు.

"అందుకే ముందు జాగ్రత్తగా విల్లు




రాయడం బెస్ట్. అప్పుడింక ఏ గొడవలూ ఉండవు" అన్నాడు వేణు.

అన్నపూర్ణ ఉలిక్కిపడింది. కృష్ణ చిరాకుగా అన్నాడు. "విల్లంటావేమిటిరా? చస్తామని ముందుగానే రాసేస్తే ఈ పెద్దల దారేమిటి? అయినా అమ్మమ్మ ఉన్నంత వరకూ ఆగవచ్చుకదా! చిన్నమావయ్య మంచితనం మనకి మాత్రం తెలియదా? "

ద్వారం దగ్గర కూర్చున్న శాంతమ్మగారు నిట్టూరుస్తూ అంది. "ఇలాగే అత్తింటివాళ్లు, పుట్టింటివాళ్లు కలిసి నన్ను అనాధని చేశారమ్మా! ఈ కాలం ఎవరికీ బాధ్యతలు పట్టవుతల్లీ! నేనే ఒక ఉదాహరణని"

పిల్లలు ఆకలంటూ గొడవ పెట్టడంతో శాంతమ్మ వంటింటివైపు వెళ్లిపోయింది. జరిగిన సంఘటన మామూలుదే కావచ్చును కానీ చంద్రమౌళి మనసు మీద కొడుకులిద్దరి అభిప్రాయాలూ ప్రభావాన్ని చూపిస్తున్నాయి. ఇదేమిటి? వీళ్లు వాళ్లు ఆస్తి అడగడం సబబేనంటారు. ఒక్క ఏడాది ఆగితే పోయేది లేదుకదా! పైవాళ్ల విషయాలనుకోకపోతే వీళ్ల ఆలోచన అతడికి తృప్తినీయడంలేదు.

అన్నపూర్ణ మనసు, అభిప్రాయాలూ చాదస్తమని వారనడం అతడు భరించలేకపోయాడు. అతడికి మొదటిసారిగా ఎందుకో పెద్దవాడు తన కుటుంబ బాధ్యతలు సక్రమంగా నెరవేరుస్తాడా అన్పించింది. ఈ కృష్ణగాడు కాస్త సెంటిమెంట్లు ఉన్నవాడనుకొంటే వెధవలందరితో కలసి పనికి రాకుండా పోతున్నాడు. ఆడపిల్ల చిన్నదైపోయిందే అనుకొన్నాడు.

తల్లి గురించే అన్నపూర్ణ ఆలోచనలు. పాపం, నాన్నగారు పోగానే ఆవిడ కళాకాంతులు లేనట్లు అయిపోయిందేనని బాధపడుతోంది. కృష్ణ ఈమధ్య మరీ బిజీ అవడంతో ఆమెకి ఇల్లు మరీ నిశ్శబ్దమైపోయింది.

అనుకొన్నట్లుగానే సూర్యనారాయణ అక్కగారింటికి వచ్చాడు. చంద్రమౌళి అతడికి పాతికవేలు ఇచ్చాడు. "ఈ డబ్బు మీరు మీ అన్నలకి ఇచ్చుకొని మిగిలినదానితో వ్యవసాయం పనులు చేయండి. ఇది మీకు నేను అప్పుగా ఇవ్వడంలేదు" అన్నాడు. చంద్రమౌళి మాటలకు అతడు రెండు చేతులూ పట్టుకొని ఏడ్చాడు.

"ఆ రోజుల్లో చదువుకోకపోవడం తప్పని ఇప్పుడు ఆలస్యంగా తెలిసింది బావగారూ! కాలేజీ చదువు ఎందుకనుకొన్నాను. పొలిటిక్స్ ఆకర్షించాయి. నాన్నగారి దగ్గర ఉండి మా పొలం చూసుకొంటే చాలదా అన్పించింది. నాకున్న తృప్తి నా కుటుంబానికీ ఉంటుందనుకోవడం తప్పేనేమో? "

తమ్ముడు వెళ్లిపోతానన్నా అన్నపూర్ణ బలవంతంగా ఉంచేసింది. ఎప్పుడూ ఉన్న ఊరుని వదలడానికి ఇష్టపడవని దెబ్బలాడింది. తండ్రిమీద బెంగతో నీరసపడ్డ అక్కగారిని కాదనలేక అతడుండిపోయాడు.

ఆ రాత్రి పొద్దుపోయాక వచ్చిన చిన్న మేనల్లుడిని చూస్తూ "ఉదయమనగా వస్తే ఇప్పుడురా నీ దర్శనం అవడం" అని నిలదీశాడు.

కృష్ణ నవ్వుతూ "ఏమిటో మావయ్యా! మరీ రోజుకి 24 గంటలే ఉండటంవలన సరిపోవడం లేదు. నిద్రలో కొంత సమయం గడిచిపోతోంది. అందుకే ఇలాగ బిజీగా తిరగవలసి వస్తోంది"

మేనల్లుడి మాటలకి నవ్వుకొని "ఏమిటిరా! అంత బిజీ" అన్నాడు. "ఏం చెప్పను మావయ్యా" అని నిట్టూరుస్తూ, "పీత కష్టాలు పీతవి అన్నారే అలాగ నా బాధలు నావి"

కృష్ణ స్నేహితుడు నారాయణ కుటుంబం బాగా పేదది. అతడి తండ్రి లారీ డ్రైవరు. ప్రమాదంలో చనిపోవడంతో కుటుంబానికి తిండి కష్టంగా ఉంది. నారాయణ అన్న

చదువు మాని రిక్షా తొక్కడం చేసినా ఇల్లు గడవడం కష్టంగా ఉంది. నారాయణ కూడా చదువు మానేసి ఏదైనా పని చేయా లనుకొంటున్నాడు.

"వీడికీ ఒక రిక్షా ఇప్పిస్తే పోయేదికదా!" వింటున్న సూర్యనారాయణ ఆలోచనగా అన్నాడు.

కృష్ణ మావయ్య మాటలకి నవ్వుతూ "వీడు మరీ అర్భకంగా ఉంటాడు మావయ్యా! రిక్షా లాగడానికి కాదుకదా కనీసం ఆపడానికి కూడాపనికి రాడు. అందుకే మేమంతా ఒక నిర్ణయానికి వచ్చాం"

సూర్యనారాయణ మేనల్లుడు చెప్పేది ఆసక్తిగా వినసాగాడు. కృష్ణమోహన్ ఫ్రెండ్స్ అందరూ కలసి తమకి వీలైంది పోగుచేశారు. అదొక మూడు వేలయ్యాయి. మిగిలిన దానికోసం ఇప్పుడు మళ్లీ క్రికెట్ మేచ్‌లు పెట్టారు. పొరుగూళ్ల వాళ్లందరూ వచ్చి డబ్బుకట్టి ఆడతారు. స్వల్పంలో ప్రైజు లిచ్చి మిగిలినది వాడికిచ్చేద్దామనుకొన్నారు.

"ఆ డబ్బుతో ఏం చేస్తారు? " మేనమామ కుతూహలంతో అడగడం అతడికి ఉత్సాహా న్నిచ్చింది. "ఇక్కడ వంతెన దగ్గర కొట్టు ఒకటి అద్దెకి తీసికొంటాం. డిపాజిట్‌గా వాళ్లు పదివేలు కట్టమన్నారు. మేము ఆరువేలు అంటున్నాం. ఎలాగో ఒకలాగ ఎనిమిది వేలకి ఒప్పిస్తాంలే! మిగిలిన సొమ్ముతో వ్యాపారం చేయిస్తాం. కొంచెం కొంచెంగా మొదలుపెట్టి డెవలప్ చేయిస్తాం"

అతడు మేనల్లుడిని ఆశ్చర్యంగా చూశాడు "ఈ ఆలోచన ఎవరిదిరా? "

కృష్ణమోహన్ తల్లివైపు చూస్తూ కాలరెగ రేశాడు "ఇంకెవరిది? ఈ దొరగారిదే"

"నువ్వు ఏం ఇచ్చావు? " ఆయన కుతూ హలంగా అడిగాడు.

"ఇదిగో! మా మాతృశ్రీ అప్పుడప్పుడిచ్చిన డబ్బు ఉందిలే. అదీ మా నందుగాడు బీరు వాలో దాచుకొన్న అయిదు వందలూ కలి పితే రెండు వేలయ్యాయి. నా సహాయంగా అదిచ్చాను"

"రెండు నెలల పాకెట్‌మనీ దాచి వాడిది బీరువాలో పెట్టెయ్యాలి. లేదా ఇల్లు పీకి పందిరేస్తాడు" కృష్ణ తనలో తాను అనుకొ న్నట్లు అన్నాడు.

సూర్యనారాయణ నవ్వుతూ "బావగారిని అడగకపోయావా? " అన్నాడు. కృష్ణమో హన్ రెండు చేతులూ ఎత్తి దండం పెట్టాడు. "ఆయనకి నేను బయట తిరగ డమే ఒళ్లుమంట. ఇక ఇలాంటి కార్యక్రమా లున్నాయంటే మరీ ఒంటికాలిపై లేస్తారు. పేదవాళ్లంటే ఆయనకి పడదు మావయ్యా"

ఆయన పకపకా నవ్వాడు. "బావుందిరా! బావ మా అందరికీ సాయంచేయడం లేదా? "

కృష్ణ ఆయనని అమాయకుడిని చూసి నట్లు చూశాడు. "అక్కడే ఉంది పాయింటు. తనవైపు వాళ్లకి, భార్యవైపు వాళ్లకి మాత్రమే ఆయన సహాయం చేస్తారు. బంధువులవైపు కొంచెం మొగ్గు చూపుతారు అంతే"

అన్నపూర్ణ దెబ్బలాడుతూ "నాన్నగారిని అలాగ అనవచ్చునురా? ఆమధ్య ఆయన ఆఫీసు అటెండర్‌కి ఒంట్లో బావుండకపోతే సాయం చేయలేదా? " అంది.

"బావుంది... అటెండర్లు, డ్రైవర్ రాక పోతే ఆయనకి పనులు ఆగిపోతాయి. అందుకని వాళ్ల బాగోగులు చూస్తారు. నీకు తెలియదుకానీ ఆయనని కాచి వడపోసేశా నమ్మా!"

"వెధవ మాటలు నువ్వూను. పెద్దవాళ్లను అలాగ అనవచ్చునా? అదిగో నాన్నగారు వచ్చారుకదా చెపుతానుండు" అంటూ సున్ని తంగా మందలించింది.




కృష్ణ భయం నటిస్తూ "అమ్మో! ఇంకే మైనా ఉందా? బాస్‌కి కోపం వస్తుంది. అయినా కన్నతల్లివి నువ్వే కడుపులో పెట్టు కోకపోతే ఎవరు పెట్టుకొంటారు?" అన్నాడు.

ఆ రాత్రి భోజనాలయ్యాక మావయ్య నా దగ్గర పడుకొంటాడు అని మేనమామను తన గదిలోకి తీసుకొనిపోయాడు. ఆయన రాత్రి బావగారు తనకి చేసిన సహాయం గురించి, తన ఊరి గురించి ఎన్నో కబుర్లు పడుకొనేవరకూ చెప్పాడు.

మర్నాడు వెళ్లే ముందు అయిదు వందలు తీసి "నా వంతుగా మీ ఫ్రెండుకి వ్వరా" అన్నారాయన. కృష్ణ నవ్వుతూ "ఇప్పుడు నువ్వు ఇవ్వవద్దులే మావయ్యా! అసలే చికాకుల్లో ఉన్నావు" అంటూ తీసికో లేదు.

భోజనానికి కూడా రాకుండా కొడుకు కష్ట పడటం చూస్తే అన్నపూర్ణకి జాలివేసింది. "ఈ రిక్షా వాళ్లతో కింది వాళ్లతో ఎందుకురా స్నేహం? నాన్నగారు దెబ్బలాడినా వినవు" అంటూ మందలించింది.

"బావుందమ్మా! ధనవంతులు కాలక్షేపం కోసం స్నేహం చేస్తారు. నిజమైన స్నేహం, ప్రేమ వాళ్ల దగ్గరే ఉంటుందమ్మా! అయినా వాళ్లు నాకు బయటెక్కడా పరిచయం అవ లేదమ్మా! నాతోపాటు మా స్కూల్లో చదు వుకొన్నవాళ్లే"

అన్నపూర్ణ దగ్గర అతడు నిర్మొహమా టంగా తన అభిప్రాయాలు చెపుతాడు. అతడి ఖర్చు వింతగా ఉంటుందని ఆవిడకి తెలుసును. పెద్ద వాళ్ళిద్దరిలాగ బట్టలని ఎగబడడు. డబ్బులు మాత్రం తనకంటూ వేరే పెట్టుకోడు. స్నేహితులతో సినిమాలు, టిఫిన్లు, టీలు ఒంటరిగా ఎప్పుడూ ఏవీ తినడు. నలుగురూ ఒక తల్లి బిడ్డలే. ఒక్కొ క్కరిదీ ఒక్కొక్క దారి అనుకొంది.

చంద్రమౌళిని ఈమధ్య ఏదో తెలియని భయం నీడలాగ వెంటాడుతోంది. ఏదో తెలియని ఆందోళన ప్రశాంతంగా ఉండా మన్నా వుండనీయడంలేదు.

ఇల్లు విడిచి బైటకి వెళితే మళ్లీ వచ్చేవ రకూ కంగారు. ఎప్పుడు వెళ్లి పూర్ణని, పిల్ల లని చూద్దామా అన్న ఆందోళన.



ప్రభుత్వం విద్యారంగానికి ఈసారి చాలా డబ్బు కేటాయించింది.

హైస్కూళ్లకి భవనాలు, అదనపు గదులు, ప్రహరీగోడలు ఇలాగ ఏవి అవసరమైతే వాటిని కట్టి విద్యాభివృద్ధికి కేటాయించమని నిధులు మంజూరు చేసింది. జూనియర్ కాలేజీలు ఒకపక్క నిర్వహిస్తున్నారు. మరొక పక్క ఆ హైస్కూళ్లలో కనీస సౌక ర్యాలు ఉండటంలేదు. అందువలననే ఈసారి ప్రణాళికలో విద్యారంగానికి పెద్ద పీటవేశారు.

చంద్రమౌళీ వాళ్లకి చేతినిండా పని తగి లింది. అతడు ఎ.ఇ.ఇ.లతో ఖచ్చితంగా చెప్పాడు పసి పిల్లలు చదువుకొనే భవనాల నిర్మాణం పటిష్టంగా ఉండాలి. కక్కుర్తిగా పనులు చేయకూడదని హెచ్చరించాడు. వాళ్లు మొహం గంటు పెట్టుకొన్నా లెక్కచే

యలేదు. సరైన కాంట్రాక్టరులకే పనులు మంజూరు చేయమన్నాడు.

అతడికి రేవతి రాసిన ఉత్తరం తరచు గుర్తొస్తోంది. "మౌళీ! ఈ దేశ ప్రగతి మీలాంటి వారి చేతులలో ఉందిరా! భరత మాత గర్వించే విధంగా మీరు ప్రవర్తిం చాలి" అంటూ చివర ఒక గేయం రాసింది.

"దేశమిది మనదన్న భావన
దేశమిది మనసైన భావన
కలుగవలె ప్రతి చిన్నవానికి
వెలుగవలె సౌహార్దదీపం"

అక్క రాసిన ఆ గేయం అతడిని పదేపదే హెచ్చరిస్తోంది. ఏదో చెయ్యాలని ఉంది. ఏమీ చేయలేని అసహాయత. ఇంతదూరం ఎందుకు ఇలాగ నడిచానా అన్న మథన. వేరే డిపార్టుమెంటుకి ట్రాన్స్‌ఫరైతే ఎలా గుంటుందీ అన్న ఆలోచన. అతడికి తన మీద తనకే కోపం వచ్చింది. ఏదైనా చేయ గలననే ధీమా ఎందుకు సడలుతోందో అర్థ మవలేదు.

అన్నపూర్ణ భర్త పరాకుగా ఉండటం గమ నించింది. తన గొడవలో తానుండి పరీ క్షగా చూడలేదుకానీ అతడు కొద్దిగా నీరస పడ్డాడు. ఆమె తననితాను తిట్టుకొంది. తనని అతడు అన్ని రకాలుగా కనిపెట్టి సాకుతాడు. తాను ఏం చేసింది? తండ్రి పోయిన బాధలో ఇంటియందు శ్రద్ధ తగ్గిం చింది.

ఆమె వెంటనే శాంతమ్మగారిని పిలిచి, భర్తకి ఇష్టమైన సన్నటి జంతికలు చేయ మంది. తను మినపసున్ని కలిపింది. అతడి దగ్గర కూర్చుని నవ్వుతూ వాటిని పెట్టింది. చంద్రమౌళి ఆశ్చర్యంగా అవన్నీ ఎందుకు చేశావని అడిగాడు.

"మీకు ఇష్టంకదా అని చేశాను" అంది. అతడు అడగకుండానే వీణ తీసి అతడికి ఇష్టమైన పాటలన్నీ వాయించింది. అతడు అపర సరస్వతిలాగ కన్పిస్తున్న భార్యను చూసి నాకేం తక్కువ? అనుకొన్నాడు. పూర్ణ ఉండగా నా జీవితానికేం లోటు? నేను అదృష్టవంతుడినే. ఆ భగవంతుడు దయతో అన్నీ ఇచ్చాడు అని మనస్ఫూర్తిగా అనుకొన్నాడు.

మీకు తోచకపోతే ఏదైనా సినిమాకు వెళ దామా? అంటున్న భార్యను చూసి "వద్దు పూర్ణా! ఇద్దరం డాబాపైన కూర్చుని కబుర్లు చెప్పుకొందాం"అన్నాడు. మరి అన్నపూర్ణ తర్కించలేదు.

భార్య స్నానం చేసి వచ్చేవరకూ కూతు రితో కేరమ్స్ ఆడాడు. తర్వాత డాబాపైన వెన్నెలలో కూర్చున్నారు. తన చిన్ననాటి సంగతులు కాసేపు చెప్పాడు. భవిష్యత్తులో రిటైరయినాక తామిద్దరూ ఎలా గడపబో యేది, తన ప్లాను లేమిటో ఒక్కొక్కటీ చెప్ప సాగాడు. అన్నపూర్ణ మౌనంగా వినసా గింది. అలాగ ఎంతసేపు కబుర్లు చెప్పు కొంటూ కూర్చున్నారో వాళ్లకే తెలియదు. కృష్ణ వచ్చి పిలవడంతో క్రిందికి వచ్చేశారు.

రాత్రి అన్నపూర్ణ అతడి పక్క దులుపు తోంటే ఆమెను పరీక్షగా చూస్తూ అన్నాడు "పూర్ణా! నేను రోజురోజుకీ పెద్దవాడినై పోతూంటే నువ్వేమిటి మరీ రోజురోజుకి చిన్నపిల్లవవుతున్నావు"

అన్నపూర్ణ మనస్ఫూర్తిగా నవ్వుతూ "మీ చేతిలో ఏదో మంత్రదండం ఉంది. అందుకే ఇలాగ తయారవుతున్నా"నంది.

అతడు నవ్వేసి "అమ్మో! ఈ పల్లెటూరి పిల్లకి మాటలు బాగా వచ్చేశాయే" అని ఆశ్చర్యం అభినయించాడు. ఆమె నవ్వుతూ "ఔనా? అది కూడా మీ సహవాస ఫలి తమే. ఆరు నెలలు సహవాసం చేస్తే వాళ్లు వీళ్లవుతారన్న సామెత ఉందికదా" అంది.

అతడు నవ్వుతూ ఆమె ముక్కు ఊపాడు. ఔనా.. అంటూ పెదవిపై వేలు పెట్టి ఆశ్చర్యం అభినయించాడు. "నన్ను




వెక్కిరిస్తున్నారు" అంటూ అన్నపూర్ణ మూతి బిగించింది.

అతడు నవ్వుతూ ఆమెను దగ్గరికి తీసికొన్నాడు. "అన్నపూర్ణా! ఈ జీవితం నాకు ఎంత బావుందో? మనం ముసలివాళ్లమైనా నువ్వు ఇలాగే ఉండాలిసుమా!" అతడు పరవశంగా అన్నాడు. అన్నపూర్ణ అతడి గుండెపై తలవాల్చి పడుకొంది. ఆమెకి ఆ క్షణాలు చాలా అపురూపంగా అన్పిస్తాయి. భర్త, పిల్లలు, ఆ ఇల్లు ప్రాణప్రదమైపోతాయి.

ఉదయం మెలకువ వచ్చినా ఆమెకి వెంటనే లేవాలన్పించలేదు. భర్త తన చుట్టూ వేసిన చేతిని నెమ్మదిగా తీసింది. అయినా అతడు లేచి, కదిలాడు. అప్పుడే లేస్తున్నావా? అంటూ నవ్వి, మళ్లీ దగ్గరకు తీసికొన్నాడు.

"నీ దేవుడు పక్కనుండగా ఆ దేవుడి స్తోత్రాలు ఎందుకు చేస్తావు? " అతడు హాస్యంగా ప్రార్థన చేస్తున్న భార్యను చూస్తూ అన్నాడు. ప్రార్థనలు ముగించిన అన్నపూర్ణ భర్తను చూస్తూ "ఈ నా దేవుడిని అనుక్షణం కాపాడమని ఆ దేవుడిని వేడుకొంటూ ఉంటాను" అంది.

అతడు నవ్వుతూ ' ఔనా...' అన్నాడు. ఆమె నవ్వుతూ తల ఊపింది. అతడు అందమైన ఆమె నవ్వును చూస్తూ, పరవశంగా నుదుటిపై ముద్దుపెట్టుకొన్నాడు.

శాంతమ్మ ఈ రోజు పెసరట్లు, ఉప్మా చేసింది. చంద్రమౌళికి ఆ కాంబినేషన్ అంటే ఇష్టం. అతడు ఎంతో ప్రీతిగా తిన్నాడు.

ఆఫీసుకి భర్త వెళ్లిన దగ్గరనుండీ అన్నపూర్ణకి ఏ పనీ చేయబుద్ధి పుట్టలేదు. శాంతమ్మగారు వంటిల్లు, దేవుడి గది బూజులు దులపడంలో మునిగిపోయారు. ఆ పూట ఆవిడకి సాయం చేయాలని కూడా ఆమెకి అన్పించలేదు.

ఏదో అశాంతి. ఎందుకో మనసు ఆందోళనగా ఉంది. కాసేపు టేప్‌రికార్డర్ పెట్టుకొని పడుకొంటే బావుంటుంది అనుకొంది. కానీ నిద్రరాలేదు. కృష్ణ వచ్చినా బావుండుననుకొంది. ఇల్లు ఏమిటో నిశ్శబ్దమైపోయినట్లు అన్పించింది.

చివరికి వీధి గుమ్మంలో నిలబడి కృష్ణ, లలితల కోసం ఎదురు చూడసాగింది.

భోజనం చేయకుండా అంతవరకూ ఉండిపోయిన తల్లితో కృష్ణ దెబ్బలాడాడు వచ్చీరాగానే.

"మరికొంచెం సేపట్లో నాన్నగారు వచ్చేస్తారు కదురా!" అంది. శాంతమ్మగారు తన పనులు ముగించుకొని స్నానం చేసి వచ్చింది.

"అమ్మ టిఫిన్ కూడా తినలేదు కృష్ణబాబూ! మీతో అన్నానికి వచ్చెయ్యమనండి" అందావిడ.

ఇంతలో ఫోను వచ్చింది. అన్నపూర్ణ గబగబా వెళ్లింది. అవతలనుండి భర్త మాట్లాడుతున్నాడు. "చెప్పండి" అంది. "నేను పని మీద భీమడోలు వెళుతున్నాను. రావడానికి ఆలస్యం అవుతుంది. నాకోసం చూడకుండా భోజనం చేసెయ్యి"

అన్నపూర్ణ వెంటనే అంది "మరి మీ భోజనం? పోనీ కారేజీ పంపనా? కృష్ణ ఉన్నాడుకదా! వాడితో పంపుతాను"

అతడు నవ్వాడు "ఇంటికి వచ్చే టైముంటే నేనే వచ్చేవాడినికదా! నేను వెంటనే వెళ్లాలి. నువ్వు కంగారు పడతావని ఫోను చేశాను"

అన్నపూర్ణకి భోజనం సమయంలో అతడు అలాగ వెళ్లవలసి రావడం కష్టంగా అన్పించింది. నిజమే! కేరేజీ తినే టైము ఉంటే ఇంటికే వచ్చేవారుకదా! అందుకే భర్త నవ్వాడు.

"మరి పెట్టెయ్యనా? " అతడు అడుగుతున్నాడు. "ఒక్కక్షణం, ఏ కాఫీయో, కూల్

డ్రింకో తాగి వెళ్లండి. మీరు టిఫిన్ తిని చాలా సేపయింది"

ఆమె అభ్యర్థన అయ్యాక అతడు అన్నాడు. "ఒంట్లో నలతగా ఉందన్నావు. కృష్ణని ఈ పూట ఇంట్లో ఉండమను. నువ్వు కాసేపు నిద్రపో! నేను త్వరగానే వచ్చేస్తానులే!"

లలిత పరుగెత్తుకొంటూ వచ్చింది. లలితకి తండ్రితో ఫోనులో మాట్లాడటం సరదా! "డాడీ! ఏ ఊరు వెళుతున్నారు? "

అతడు చెప్పాడు. "అర్జెంటు పనుందమ్మా! వచ్చాక నీకు బోలెడు కబుర్లు చెప్తాను. అమ్మకియ్యి" అన్నాడు. "నీకు నీరసం ఎక్కువగా ఉంటే నేను రమ్మన్నానని డాక్టరుగారిని రమ్మని ఇంజక్షన్ తీసుకో! బద్ధకించకు. వస్తాను" అంటూ ఫోను పెట్టేశాడు.

తను కాస్త నీరసంగా ఉన్నా, నలతగా ఉన్నా అతడికి కంగారు. ఎన్ని పనులలోవున్నా తన మందులు, ఇంజక్షన్ల గురించి హెచ్చరిస్తాడు. అన్నపూర్ణ కూతురిని ఏం పనిమీద వెళుతున్నారుట అని అడిగింది. లలిత తెలియదంది. తనూ అడగలేదు. అయినా బయటికి వెళుతోంటే ఎలాగ అడుగుతుంది?

పిల్లలు, శాంతమ్మగారు బలవంతం చేయడంతో అన్నం ముందు కూర్చుంది కానీ కడుపులో ఏదో గాబరా! ఏమీ ఆకలి వేయడం లేదు. గుప్పెడు మెతుకులు తిన్నానన్పించి లేచి పోయింది.



మూడుగంటల సమయంలో జీపు శబ్దం విన్పిస్తే వెంటనే అన్నపూర్ణ తలుపు తీసింది. గోపాలరావుగారు, ఎ.ఇ.ఇ. వసంతకుమార్, ఇంకా ఎవరెవరో గుంపుగా నిలబడి ఉన్నారు. వారి పక్క భర్త కనబడతాడేమోనని చూసింది. అతడి జాడే లేదు.

"లోపలకు రండి. ఆయన..." అనబోతున్న ఆమె మాటలు పూర్తవకుండానే వెనకనున్నవాళ్ళు చంద్రమౌళిని చేతుల్లో తీసుకొని వస్తుండటం కనుపించింది.

అదేమిటి? ఆయనకి... ఆయనకి ఏమైంది? ఆమె వెంటనే ఒక్కంగలో ముందుకి పరుగెత్తింది. ఆమెను పట్టుకోవడానికన్నట్లు విఠల్‌రావుగారు త్వరగా వచ్చారు. ఆయన చేతులు విడిపించుకొని "ముందు ఆయన్ని చూడండి. ఆయనకి ఏమన్నా అయితే నేను బతకలేను."

అన్నపూర్ణ గొంతుక గట్టిగా వినబడటంతో శాంతమ్మగారు, మరొక పక్కనుండి కృష్ణ కంగారుగా వచ్చేశారు.

వాళ్ళని చూస్తూ గోపాలరావుగారు "చంద్రమౌళిగారికి హార్టు ఎటాక్ వచ్చిందమ్మా. ఆయనని కాపాడుకోలేకపోయాం" అన్నారు.

అన్నపూర్ణకి కాళ్ళకింద భూమి కదిలిపోతున్నట్లన్పించింది. "అబద్ధం... నేను నమ్మను. ఆయన ఇందాకే కదా నాతో మాట్లాడారు. త్వరగా వచ్చేస్తానన్నారు. డాక్టరుగారూ! ఆయన్ని చూడండి. మీరు చూస్తే ఆయన బతుకుతారు"

అన్నపూర్ణ భర్త శరీరంమీద వాలిపోయింది. "ఇదేమిటి? ఇంత ఘోరం ఎక్కడైనా ఉందా? నన్ను చూడకుండా నాతో మాట్లాడకుండా ఆయన ఉండలేరు. మీరు నన్ను మోసం చేస్తున్నారు. ఆయనకి ఏమీ కాలేదు, కాదు"

ఆమె భర్త శరీరాన్ని చూసినా గ్రహించలేకపోతోంది. అతడి మొహం తనవైపు తిప్పుకొని, "మాట్లాడండీ, నాతో మాట్లాడండి. అదిగో మన కృష్ణ. వాడు చూడండి. ఎలా తెల్లబోయి నిలబడ్డాడో? భోజనానికి వచ్చేస్తానన్నారుకదా! ఇదేనా రావడం? ఇందుకే కాబోలు నేను ఉదయం నుండీ ఎంతో క్షోభ అనుభవిస్తున్నాను.




వీల్లేదు. నన్ను విడిచి మీరు ఎక్కడికీ వెళ్ళ లేరు నావైపు చూడండి"

ఆమె దుఃఖం అక్కడున్నవారిని మూగ వారిని చేస్తోంది. ఏవేవో మాట్లాడుతోంది. లతడిని ఇటూ అటూ చంటిపిల్లాడిని తిప్పి నట్లు తిప్పుతోంది. ఆమె ఏడుపు అంతకం తకీ ఉధృతమవడం గమనించి, డాక్టరుగారు ఇంజక్షన్ తీయబోయేలోపే అన్నపూర్ణ భర్త మీద విరుచుకొని పడిపోయింది.

కృష్ణమోహన్‌కి శవంగానున్న తండ్రి రూపం మసక మసకగా కన్పిస్తోంది. తల్లి ఏడుపు అతడిని భయభ్రాంతుడిని చేస్తోంది. అతనికి షాక్ తగిలినట్లయింది. డాక్టరుగారు కృష్ణ వద్దకి వచ్చారు. అతడిని పిలుస్తూ గట్టిగా కుదపడం మొదలుపె ట్టారు. "చూడు. మీ అమ్మగారికి ఫిట్స్ వచ్చాయి. కాస్త నీళ్ళు తెచ్చి ఇస్తావా?" ఆయన అలా రెండు మూడుసార్లు చెప్పగా, అప్పుడు ఈ లోకంలోకి వచ్చాడు కృష్ణ. తల్లివైపు చూశాడు. తండ్రివైపు చూశాడు.

"డాడీ... మా డాడీ చనిపోయారా? అంకుల్... నిజం చెప్పండి మీరు... మీరు డాడీని బతికించలేరా?" అతడు చిన్నపిల్లా డిలాగా ఏడుస్తూ తండ్రి కాళ్ళ దగ్గర కూల బడ్డాడు.

"ఈ ఇంటికి ఏ అరిష్టం పట్టుకొందిరా భగవంతుడా" అంటూ ఏడుస్తున్న శాంత మ్మగారే లేచి, అన్నపూర్ణను ఒళ్లోకి తీసుకొ న్నారు. డాక్టరుగారు వరుసగా రెండు ఇంజ క్షన్లు చేశారు.

ఒంటిమీద తెలివి లేకపోయినా మరిం తగా ఏడుస్తున్న ఆమెను చూస్తే అక్కడున్న వారందరికీ ఏడుపు ఆగడంలేదు. ఎంత మంచి కుటుంబం! భగవంతుడు కన్ను కుట్టి అతడిని తీసుకొనిపోయాడు.

డాక్టరుగారు చెప్పారు "ఆవిడకి మత్తు ఇంజక్షన్ ఇచ్చాను. ఇప్పుడిప్పుడే తెలివి రాదు. దగ్గర్లో ఉన్న మీ వాళ్ళను వెంటనే పిలిపిద్దాం"

శాంతమ్మగారు ఎవరెవరికి ఫోనులు చెయ్యాలో చెప్పారు. గోపాలరావుగారు, డాక్ట రుగారు వెంటవెంటనే బంధువులకి ఫోన్లు చేశారు. "చంద్రమౌళిగారికి సీరియస్‌గా ఉంది. అర్జెంటుగా బయలుదేరి రండి" అనే చెప్పారు.

తండ్రి చనిపోయాడని తెలిస్తే పిల్లలు బెంబేలు పడతారని ఆయనకి సీరియస్‌గా ఉంటే హాస్పిటల్‌లో చేర్చామని తల్లి, తమ్ముడు బెంగపడుతున్నారు. కనుక వెంటనే వచ్చెయ్యమని వేణుకి, నందుకి ఫోనులో చెప్పారు.

పెద్ద పిల్లలిద్దరూ ఆందోళనతో వేస్తున్న ప్రశ్నలకి ఆయనకి కళ్ళనీళ్లు తిరిగాయి. వచ్చినవాళ్ళలో ముఖ్యమైనవాళ్ళు ఉండిపో యారు. అతడి ఉత్సాహం గురించి, ప్రవ ర్తన గురించి వాళ్ళు మాట్లాడుకోసాగారు. కృష్ణకి ప్రకాశరావుగారు విషయాన్ని వివరిం చారు.

భీమడోలులో కొత్తగా కట్టిన హైస్కూల్ గదులు కూలిపోయాయంటే, ఫోను రాగానే చంద్రమౌళి, ప్రకాశరావుగారు వాళ్ళు బయ లుదేరారుట.

అంత కంగారులో కూడా భార్య తన రాక కోసం చూస్తుందని చంద్రమౌళి ఇంటికి ఫోను చేస్తోంటే, ఆయన తొందరపెట్టా రుట. "నాకేం తెలుసును? అదే వాళ్ళిద్దరూ మాట్లాడుకొనే చివరి మాటలవుతాయని" ఆయన గొంతు దుఃఖంతో పూడుకొనిపో యింది.

వీళ్ళు వెళ్లేటప్పటికే అక్కడ ఎ.ఇ.ఇ., ప్రెస్‌రిపోర్టర్లు, ఊళ్ళో జనం మూగిపోయి ఉన్నారట. ఒక్కసారిగా గదులు కూలిపోవ డంతో చాలామంది పిల్లలు అక్కడికక్కడే చనిపోయారుట. ఒక టీచర్ ప్రాణాపాయ స్థితిలో నుంటే, ఒకాయన అక్కడికక్కడే మరణించారుట. సర్క్యులర్ తీసికెళ్ళిన

ఎటెండర్ కూడా మరణించినవారిలో ఉన్నారుట.

పిల్లల తాలూకు తల్లిదండ్రులతో, మిగిలిన విద్యార్థులతో ఆ ప్రదేశమంతా గోలగోలగా ఉంది. సంగతి తెలిసి పొరుగు ఊళ్ల వాళ్లు వచ్చెయ్యడంతో ఒకటే జనం.

చంద్రమౌళి ఎప్పటినుండో జాగ్రత్తగా కట్టమని హెచ్చరిస్తోనే ఉన్నాడుట. ఏం లాభం? ఆ పిల్లల మృతదేహాలు, తల్లిదండ్రుల ఏడ్పులు చూస్తున్న అతడికి గుండెల్లో నొప్పి బయలుదేరిందిట. ఇదేమిటి? ఇంత దారుణం జరిగిందా అంటూంటేనే అతడికి మరి బయటికి మాట రాలేదుట. పక్కనున్న గోపాలరావుగారి భుజంమీద వాలిపోయాడుట.

స్థానికంగా ఉన్న డాక్టరుని పిలిపించినా ఏమీ లాభం లేకపోయిందిట. హార్ట్ఎటాక్ చాలా సీరియస్‌గా వచ్చిందని చెప్పి, మిగిలిన ప్రయత్నాలు చేసినా లాభం లేకపోయిందిట. వెంటనే ఫోనుచేసి విఠల్ రావుగారిని పిలిపించారుట.

పదినిమిషాల క్రితం వరకూ తమతో నవ్వుతూ మాట్లాడుతూ ప్రయాణం చేసిన అతడు అలాగ నిర్జీవంగా మారడం వాళ్ళకి అనుకోని దెబ్బ. అతడిని చూసి విఠల్ రావు గారు ఏడుపు. నిన్ను బతికించుకోలేని నా చదువు ఎందుకు అంటూ ఆయన బాధపడ్డారుట. ఎలాగో తెప్పరిల్లినా, ఇంట్లోవాళ్ళకి ఎలా చెప్పడమో, అతడిని ఇంటివరకూ ఎలా తీసికెళ్ళడమో వారికి అంతుపట్టని సమస్యలుగానే అన్పించాయిట.

ఈమధ్య అన్నపూర్ణ ఆరోగ్యం బావుండటంలేదు. ఆమెగానీ దెబ్బతింటే పిల్లలు అనాథలవుతారు. బంధువులు వచ్చేవరకూ హాస్పిటల్‌లో ఉంచుదామా అని డాక్టరుగారనుకొన్నారుట. గోపాలరావుగారు ఒప్పుకోలేదుట.




అతడు అతడింట్లో ఉండేది ఇంక కొద్దిగంటలే. ఇంటికే తీసుకెళ్ళిపోదాం. లేకపోతే అతడి ఆత్మకి శాంతి ఉండదు అన్నారుట.

ఆ రాత్రికే చంద్రమౌళి అన్నలు, వదినలు వచ్చేశారు. రేవతి మళ్ళీ ఫోను చేసినప్పుడు అనుమానించింది. అందుకే ఆమె శాంతమ్మ గారిని ఫోను దగ్గరికి పిలిచింది. జరిగిన విషయం ఆవిడ ఏడుస్తూ చెప్పేటప్పటికి రేవతికి నోటమాట రాలేదు. భర్తని తీసుకొని ఉన్నది ఉన్నట్లు బయలుదేరిపోయింది.

అన్నపూర్ణ తల్లికి చిన్నవాడైన మనుమడు చెప్పేశాడుట. సూర్యనారాయణ, భార్య 'పెద్దావిడ అసలే బాధలో ఉంది. కూతురికి ఇటువంటి కష్టం వచ్చిందంటే తట్టుకోగలదో లేదో'నని భయపడ్డారుట. ఆవిడను తీసుకొని వెళ్ళడమా, వదిలేడయమా అన్న మీమాంస పడుతోనే బట్టలు నాలుగు పెట్టెలో కుక్కుకుంటున్నారుట. ఈలోపే మనవడు "అమ్మా, నాన్నా ఏడుస్తున్నారు. పెద్దమావయ్య పోయారుట" అని చెప్పేశాడుట.

"అమ్మో! పూర్ణమ్మ తల్లీ నీకు ఎంత కష్టం వచ్చిందే" అంటూ ఆవిడ పెద్ద పెట్టున ఏడుస్తూంటే ఊళ్ళోవాళ్ళు వచ్చేశారుట. భర్త పోయిన దుఃఖంలోనుండే ఆవిడ ఇంకా కోలుకోలేదు. ఇంతలో ఈ దెబ్బ. అల్లుడు పోయాడంటే ఆవిడ కదిలి కదిలి ఏడుస్తోంది.

కూతురిని చూడకుండా ఆవిడ ఎలాగో ఉండలేదు. తల్లి వచ్చిందంటే అన్నపూర్ణకి కూడా కొంత ఓదార్పుగా ఉంటుందేమోనని తర్జన భర్జనలు పడి, అతడు చివరికి టాక్సీ తెప్పించి బయలుదేరదీశాడు.

దారి పొడవునా ఆవిడ ఏడుస్తూనే ఉంది. "భగవంతుడు నీకు అన్నీ ఇచ్చాడని, నిన్ను చూసి మేం సంతోషపడుతోంటే, అయిదవతనాన్నే లాగేసుకొన్నాడా? పూర్ణా, పూర్ణా అంటూ నీ కొంగుపట్టుకొని తిరిగే

వాడే. ఎలా నిన్ను వదిలి వెళ్ళిపోయాడే. పూర్ణా! నా తల్లీ! నువ్వు ఎలా బతుకుతావే? "

కొడుకు ఎంత ఓదార్చినా ఆవిడ సంభాళించుకోలేకపోతోంది. "భర్త ఎంత అదృష్టవంతుడు. ఇవన్నీ చూడకుండా ముందు వెళ్ళిపోయాడు. తను మాత్రం ఇవి చూడటం కోసమే ఉంది కాబోలు. దేవుడా! నన్ను దాని మొహం ఎలా చూడమన్నావు? ముక్కుపచ్చలారని ఆ పసివెధవలను తండ్రి లేనివారిని చేశావే! ఇది న్యాయమా? "

ఆవిడ పొంతనలేకుండా ఏవేవో మాట్లాడుతోనే ఉంది. అతడికి తల్లి, అక్క ఒకరినొకరు చూసుకొంటే అసలు బతుకుతారా అన్పించింది. "అమ్మా! నువ్వు ఊరుకోవే. పాపం... అక్కకి ఎంత కష్టం వచ్చిందే? దాన్ని చూడాలి మనం. దానికి ధైర్యం చెప్పాలి. ఇలాగ నువ్వే ఏడుస్తే అది తట్టుకోగలదా? " అతడు తన ఏడుపునాపుకొంటూ తల్లికి ధైర్యం చెపుతూనే ఉన్నాడు.

ఇంకో అరగంటకి ఊరు వస్తుందనగా, తల్లినుండి చిన్నగా గొణుగుడు తప్ప విన్పించకపోవడంతో అతడు టాక్సీ ఆపించి, లైటు వేయమన్నాడు. తల్లి చూపు పక్కకి తిరిగిపోయి ఉంది. నోట్లోంచి అస్పష్టంగా ఏవేవో మాటలు వస్తున్నాయి. అవి సరిగ్గా లేవు. అతడు తల్లిని తట్టిలేపుతూ ఎన్నోసార్లు పిలిచాడు.

ఒక్కసారిగా ఆ రాత్రివేళ అతడికి భయం వేసింది. ఏం జరగబోతోంది? అటు అక్క, ఇటు తల్లి. టాక్సీ అతడు వచ్చి ఆవిడని ముట్టుకొని చూశాడు. "ఈవిడ కోమాలోకి వెళ్ళిపోయినట్లు ఉన్నారు సార్" అన్నాడు. అతడి గుండె గుభేలుమంది.

ఊరిలో ప్రవేశించగానే అతడు మొదట తల్లిని హాస్పిటల్‌లో చేర్చాడు. భార్యను తల్లి దగ్గర ఉంచాడు. డాక్టరుగారు మొదటే చెప్పారు. "ఆవిడ పరిస్థితి బావుండలేదు. ఎన్నిగంటలో... ఎన్ని రోజులో చెప్పడం కష్టం. ఈ కోమాలో ఉన్నవాళ్ళ పరిస్థితి అలాంటిది"

డాక్టరుగారికి తన బాధ చెప్పి, తల్లిని జాగ్రత్తగా చూడమని బావగారింటికి బయలుదేరాడు. అతడికి ఇలాంటి వాటిల్లో అనుభవంలేదు. ఏంచేయాలో తెలియడంలేదు. ఆ టాక్సీలోనే అతడు వచ్చేశాడు. ఎలాగో అక్కడ తన స్వజనం ఉన్నారు. పెద్దన్నగారికి చెప్పి ఆయన ఏం చేయమంటే అది చేయవచ్చును.

అతడు రావడమైతే రాగలిగాడుకానీ అక్కడి దృశ్యాలు చూశాక విషయం ఎలా చెప్పడమో అర్థమవలేదు. పెద్దన్నగారు ఇంకా రాలేదు. చిన్నన్న, వదిన, పిల్లలు మాత్రమే వచ్చారు. ఆ పరిస్థితులలో అతడు కొట్టుమిట్టాడుకొంటూంటే రాజ్యలక్ష్మి, భర్త వచ్చారు.

పిల్లల ఏడ్పులతో, అక్కగారి అనారోగ్యంతో అతడికి ఆమాట చెప్పడానికి నోరు రాలేదు. తెలివిరాకుండా చేద్దామని డాక్టరుగారు ప్రయత్నిస్తున్నప్పటికీ కుదరడంలేదు. ఆయన డోస్ పెంచి, మరొక ఇంజక్షన్ చేశాడు.

తెల్లవారుజాముకి అందరూ చేరారు. అప్పుడు అతడు రాజ్యలక్ష్మిని, పెద్దన్నను బయటికి తీసుకెళ్ళి విషయం చెప్పాడు. వాళ్ళు తెల్లబోయారు. కూతురి దుఃఖాన్ని పంచుకొని, ధైర్యం చెప్పవలసిన స్థితిలో తల్లి అలాగ అయిపోవడం వాళ్ళకి మరీ బాధగా ఉంది. అందరూ కలిసి అక్కకి ఈ విషయం చెప్పకూడదనే నిర్ణయానికి వచ్చారు.

మరో అరగంటకే సూర్యనారాయణకి పద్మనుండి ఫోను. అత్తగారు పోయారు. వెంటనే రమ్మనమని. అతడికి ఒక్కసారి ఏడుపు ముంచుకొని వచ్చింది. ఒకేసారి

కుటుంబంలో ఇద్దరు కనుమరుగవ్వాలా? ఎలా.. ఎలా ఈ విషాద సంఘటనలను భరించడం?

ఏడుస్తున్న అతడిని రాజ్యలక్ష్మి పెరట్లోకి తీసుకెళ్ళింది. వాళ్ళు నెమ్మదిగా అందరూ చేరి విషయం మాట్లాడుకొన్నారు. రాజ్యలక్ష్మి ఖచ్చితంగా చెప్పింది. అమ్మ పెద్దది. నాన్నగారు పోవడంతోనే మనసు వదిలేసింది. ఇప్పుడు అసలే దుఃఖంలోనున్న అక్కకి ఈ విషయం చెప్పామా ఆమె మనకి దక్కదు.

బావగారు పోయిన వార్తనే ఆవిడ భరించలేకపోతోంది. ఇది కూడా తెలిస్తే ఏమవుతుందో? మనమే అటుకొందరం, ఇటు కొందరం తిరుగుదాం. అక్కకి ఏ పదవరోజునో చెపుదాం.

పెద్దన్నగారు తల్లి శవాన్ని తమ ఊరు పట్టుకెళ్ళిపోదామన్నారు. సూర్యనారాయణ ఒప్పుకోలేదు. ఇక్కడి పరిస్థితులు ఎలా ఉంటాయో? తాము ఇక్కడే ఆవిడ అంత్యక్రియలు కూడా చేయడం మంచిది. రెండవ అన్న ఇంటి దగ్గరనుండి తెచ్చిన డబ్బు కొంతే. తన దగ్గర తక్కువగా ఉంది. ఊరు వెళ్ళి త్వరగా డబ్బు తెస్తానన్నాడు. పెద్దన్నను తల్లిని చూసివచ్చి, చెల్లి దగ్గర సాయం ఉండమని, అన్నపూర్ణ విషయం చూడమని చెప్పాడు. వాళ్ళకి ఆ పరిస్థితులలో బతుకంటేనే విరక్తి వచ్చింది.

★ ★ ★

ప్రియంవద మరదలిని ఒళ్ళోకి తీసుకొని ఏడ్చింది. ఇంకా తమ్ముడు "అక్కా..." అంటూ ఆ ఇంట్లో తిరుగుతున్నట్లే ఉంది. అన్నపూర్ణ అత్తవారి కుటుంబం చూస్తే రాజ్యలక్ష్మికి విషయం చెప్పడానికి భయంవేసింది. రాత్రినుండే శవం దగ్గర ఉన్న మగవాళ్ళకి, పిల్లలకి ఆఫీసువాళ్ళు తెచ్చి ఇచ్చిన కాఫీలు రేవతి ఇస్తోంది.

ఆ సమయంలో రాజ్యలక్ష్మికి రేవతే పెద్ద ఆధారంగా అన్పించింది. ఆమె నెమ్మదిగా రేవతిని దూరంగా తీసుకెళ్ళి జరిగిన విషయం చెప్పింది. రేవతి మెదడు అది వినగానే కొన్ని క్షణాలు పనిచేయలేదు. "మా మరదలంత దురదృష్టవంతులు ఉండరు. ఒకేసారి అటు తల్లిని, ఇటు భర్తను కోల్పోయింది. ఏం చేస్తాం? పెద్దామె కూతురి కష్టాన్ని చూడలేక కుమిలిపోయి ఉంటారు. భగవంతుడి నిర్ణయం ఇలాగ చేయాలని ఉంటే మనం ఏం చేయగలం? "

కన్నీళ్లతో అంటున్న రేవతి మాటలు అక్షరసత్యాలుగా ఆమెకి అన్పించాయి. "మీ అన్నలను ఒకరిని ఇక్కడ కాసేపు ఉండమనండి. నెమ్మదిగా మా వాళ్ళకి విషయం చెపుతాను. అన్నపూర్ణ దగ్గర మీరుండటం అవసరమేమో? " అంది.

"మనం చెప్పినామా అన్నపూర్ణ పరిస్థితి ప్రమాదమవుతుంది. పెద్దామె ఎలాగో పోయారు" అంటూ రేవతి ఆలోచనలో పడింది. "అవును. అలాగే చేద్దాం. అన్నపూర్ణ కోలుకొన్నాక మనం చెపుదాం. పాపం తల్లిని కడసారి చూడటం కూడా తనకి అవలేదు" రేవతికి అన్నపూర్ణపై ఎంతో జాలి కలిగింది.

అసలే అమాయకురాలు. ఇన్నాళ్లూ ఏ ఆటుపోట్లూ భరించలేదు. తల్లిదండ్రులు, భర్త అందరూ లేని జాతకం అయింది. రేవతి మనసు ఆమెపట్ల ప్రేమతో ఆర్ద్రమైపోయింది.

డాక్టరుగారు అన్నపూర్ణని కనిపెట్టుకొనే ఉన్నారు. ఆయన కొద్దిసేపు ఏదో కేసు వస్తే వెళ్ళి వచ్చేశారు. రేవతి చెప్పిన విషయం విన్నాక, ఆమె నిర్ణయాన్ని అభినందించకుండా ఉండలేకపోయారు.

తెలివి వచ్చిన అన్నపూర్ణకి మొహం కడిగించి, రేవతి కాఫీ పట్టింది. "అన్నపూర్ణా!




నాకు ఇప్పుడు ఏం చెప్పవద్దు. తమ్ముడు చివరి ప్రయాణం చేస్తున్నాడు. వాడికి ఎంతో ప్రియమైనదానివి నువ్వు. ఈ సమయంలో గుండె దిటవు చేసుకొని నువ్వు పక్కనుండాలి. వాడిని ఒంటరిగా వదిలేస్తావా? "

అన్నపూర్ణ ఏడుస్తూనే లేదన్నట్లు తల ఊపింది. "వాడి దగ్గరే కూర్చుందాం పద. తర్వాత చూద్దామన్నా వాడిని చూడలేం" అంటూ రేవతి ఆమెను పొదివి పట్టుకొని తమ్ముడి దగ్గరకు నడిపించింది.

ఏడుస్తూ ఏదో చెపుతున్న అన్నపూర్ణని వారించింది. "ఏడవకు, ఏడవకుండా ఏం చెప్పినా వింటాను. నిన్న ఈపాటికి సజీవంగా నీ వెనకాల తిరిగినవాడు. ఇప్పుడు... ఇలాగ పడిఉండటం భరించలేని విషయమే. ఏం చేస్తాం? ఈ నిజాన్ని మనం భరించాలి. మనం గుండె దిటవు చేసుకోవాలి. లేకపోతే పిల్లలు ఏమవుతారు? చూడు, వాళ్ళు నీ కోసం ఎలా బెంగపడుతున్నారో? "

అన్నపూర్ణ తన బిడ్డలవైపు చూసింది. ఏడ్చి, ఏడ్చి వాళ్ళ రూపం వాడిపోయింది. కృష్ణమోహన్ తల్లి పక్కన వచ్చి కూర్చున్నాడు. "డాడీ! మాట్లాడు. లేకపోతే నాకు భయం వేస్తుంది" అంటూ ఏడుస్తున్న లలితను నందు ఒడిలోకి తీసుకొన్నాడు. ఆ పిల్లలను, ఆ తల్లిని చూస్తే రాళ్ళు కూడా ఏడుస్తాయేమో!

చంద్రమౌళి బాగా పేరు కలవాడు. ఎక్కడెక్కడివాళ్ళో వచ్చి వెళుతున్నారు. ఊళ్లోని ప్రముఖులందరూ అతడి దగ్గరే ఉన్నారేమో. బంధువులు నడుంకట్టి జరగవలసిన పనులు చూడటం మొదలుపెట్టారు.

అన్నపూర్ణకి నిన్నటికి, ఈ రోజుకి ఇంత తేడాయా అన్పించింది. అతడులేని ఈరోజు రాకుండా ఉంటే ఎంత బావుండేది. అతడి పెదవులవైపు చూసింది. ఎప్పుడూ "పూర్ణా! పూర్ణా" అంటూ పిలిచినవి పిలిచినట్లే ఉండేవి.

"నిన్న సాయంత్రంనుండే ఏమైంది? ఒక్కసారైనా మీరు పిలిచారా? ఆ దేవుడు నన్ను ముందుగా తీసుకెళ్ళి ఉంటే ఎంత బావుండేది? నేను బతకలేను. నాకేం తెలియదని మీరు ఎప్పుడూ అంటారుకదా! ఎలాగ నన్ను వదిలేసి వెళ్ళిపోయారు? " అంటున్న ఆమె ఏడుస్తూ అతడి చేతులు పట్టుకొంది.

"ఏనాడైనా ఈ చెయ్యి నా చేతిని వదిలిందా? లేదే. ఇప్పుడు ఎందుకండీ ఇలాగ వదిలేశారు? ఏం తప్పు చేశాను? నాకెందుకింత శిక్ష? నన్నూ తీసుకెళ్ళండి మీతో" అంటూ తల బాదుకొంది. ఆమె ఏడుపును, బాధను ఆపడం రేవతి తరమా? ఎవరి తరం కాదు. లోపలనున్న బాధంతా కరిగి నీరవవలసిందే. అప్పుడే ఆమెకి ప్రాణం కుదుటపడుతుందేమో?

అన్నపూర్ణ బావగార్లు ఆమెను ఎంతో ఓదార్చసాగారు. ఆ ఏడుపుతోనే ఆమె చచ్చిపోతుందేమోనన్పించింది వాళ్ళకు. అందరికీ తలలో నాలుకలాగ ఉండే తమ్ముడు పోయిన దుఃఖాన్ని కూడా పిల్లలకోసం, మరదలికోసం దిగమింగుకోక తప్పలేదు వాళ్ళకి.

ప్రియంవద ఒక్క శుభకార్యమైనా పిల్లలకి చేసుకోకుండా తమ్ముడికి నూరేళ్ళూ నిండాయే అని ఏడ్చింది. పెద్దన్నగారే జరగవలసిన తంతుకి పూనుకొన్నాడు. అన్నపూర్ణవైపు వాళ్ళకోసం చూడకుండా ముఖ్యమైన వాళ్ళకి, ఆమె తల్లి పోయిన విషయం చెప్పారు.

కృష్ణమోహన్, వేణుని, నందుని పిలిచి మాట్లాడాడు. తర్వాత లేచి, వెళ్ళి బీరువా తీసి తండ్రి ఉంచిన డబ్బు తీశాడు. ఆ డబ్బు తీస్తోంటే అతడి చేతులు వణికాయి. ఎప్పుడూ అయిదువేలైనా ఇంట్లో ఉంచకపోతే చంద్రమౌళికి భయం. పిల్లలకి

ఎప్పుడు ఏ అవసరం ఏర్పడుతుందో? ఏ అన్నలు అర్జెంటుగా అవసరం పడివస్తారో?

పెద్ద కుటుంబంలో మనిషవడంవలన అతడి ఆలోచనలు అందరి చుట్టూ తిరుగుతూనే ఉంటాయి. స్నేహితులు వెయ్యో, రెండువేలో వెంటనే కావాలనుకొంటే అతడినే అడుగుతారు. అతడు నవ్వుతూ, "బేంకులు కొన్ని వేళలప్పుడే డబ్బు ఇవ్వగలవు? ఈ బేంక్ మాత్రం అర్ధరాత్రయినా ఇవ్వగలదు"అనేవాడు.

అతడిని చూసి ఆఫీసులో కొందరు డబ్బు కొంచెం అయినా ఇంట్లో ఉంచుకోవడం ఎంత అవసరమో తెలుసుకొన్నారు. ఒక్కొక్కసారి పదివేలు అయినా ఇంట్లో ఉంచేస్తాడు. అన్నపూర్ణ ఏనాడూ తనంతట తానుగా డబ్బు తీయదు. ఖర్చు పెట్టదు. ఖర్చు అంతా అతడి చేతులమీదే జరుగుతుంది. పిల్లలకీ అతడే ఇస్తాడు.

కృష్ణ ఇంటి దగ్గరే ఉండటంవలన తండ్రి అప్పుడప్పుడూ బీరువా తెరిచి డబ్బు తెమ్మంటారు. ఒక్కొక్కసారి ఆఫీసునుండి ఏ కరెంటుబిల్లో, ఫోనుబిల్లో మరిచిపోతే ఫోనుచేసి ఎటెండర్‌ను పంపుతున్నానని, బీరువా తీసి జాగ్రత్తగా డబ్బు ఇమ్మంటాడు. అతడు ఉంటే అన్నపూర్ణ తీయదు. కొడుకు లేకపోతే భర్త ఏ ప్రదేశంలో ఉంచినదీ చెప్పి తీయమంటే అదితీసి ఇస్తుంది.

భార్య అమాయకురాలు, పట్టించుకోకపోవడంవలన అతడికి మరింత జాగ్రత్త అలవడింది. ఆడవాళ్ళలాగ రకరకాల చోట్లలో బీరువాలో ఉంచుతాడు. ఏ ప్రదేశం వెదికినా ఎంతో కొంత ఉంటుంది.

ఈ డబ్బు ఇలాగ ఖర్చవుతుందని ఎవరికి తెలుసుననుకొన్నాడతడు. తండ్రి ఇంత సంపాదించాడు. ఇప్పుడు ఆయన కోసం ఇతరులు ఖర్చు పెట్టడం ఎందుకు?




అందుకే ఆ డబ్బు పట్టుకెళ్ళి రేవతి చేతిలో పెట్టాడు. పెదతండ్రికిచ్చి, ఖర్చు చేయించమన్నాడు.

తండ్రి పోయిన కొద్ది గంటలకే పెద్దరికం తెచ్చుకొన్న మేనల్లుడిని చూసి రేవతి కళ్ళ నీళ్లు కుక్కుకొంది. అతడి భావం అర్థమవడంవలన రేవతి అన్నగారిని పిలిచి ఆ డబ్బు చేతిలో ఉంచింది. ఆయన వద్దని గొడవ. తమ్ముడు ఎన్నిసార్లో తనని ఆదుకొన్నాడు. అలాంటిది వాడికి ఖర్చు చేయవలసిన ఈ సమయంలో డబ్బు అడగడమా?

కృష్ణమోహన్ ఆయనకి నచ్చచెప్పాడు. "ఇంక మాకు మీరు తప్ప ఎవరున్నారు పెదనాన్నా?" ఆమాటలంటుంటే అతడి గొంతు వణికింది. ఆయన ఏడుస్తూ అతడిని గుండెలకి హత్తుకొన్నాడు.

అన్నపూర్ణకి ఏదో మరిచిపోయినట్లు అన్పిస్తోంది. మెదడు మొద్దుబారి అదేదో గుర్తు రావడంలేదు. ఏదో దుఃఖమనే మహా సముద్రం పొంగి, మనిషిని నిలువెల్లా ముంచేస్తే, ఆ ప్రవాహ ఉధృతి తగ్గినా కాళ్ళకిందనున్న భూమిని ఎలా తనతో లాగి పారేస్తుందో ఆమె విషయంలో అలాగ ఉంది. నవనాడులూ తెగిపోయినట్లన్పిస్తోంది. ఈ దుఃఖానికి దారీ, తెన్నూ కనిపించడంలేదు.

ఎవరి ఒడిలో విశ్రమిస్తే మండే ఈ గుండెకు స్వాంతన కలుగుతుంది? ఆమెకు మెరుపులాగ తల్లి గుర్తువచ్చింది. ఔను, అమ్మేదీ? తన అల్లుడు కానరాని లోకాలకు ప్రయాణమవుతోంటే, అలమటిస్తున్న ఈ మనసుకి, తల్లడిల్లుతున్న ఈ అసహాయ ప్రాణానికి ఓదార్పునివ్వగల అమ్మ ఎక్కడా కనపడదేమి?

ఆమె వాచిపోయి, ఏడుపుతో ఎర్రబడిన కళ్ళను మెల్లిగా ఎత్తి కాస్త దూరంలోనున్న తమ్ముడివైపు చూసింది. అతడు ఆపాదమస్తకం వణికిపోయాడు. ఏ పరిస్థితి తల ఎత్తకూడదని వేయి దేవుళ్ళకు నమస్కరిస్తు

న్నాడో, నిర్దయగా ఆ పరిస్థితే వచ్చింది.

ఆమె మందమైై బొంగురుపోయిన స్వరంతో "అమ్మ ఏదిరా? అమ్మను పద్మ తీసుకొని వస్తోందా? ఆయనను... ఆయనను చూడలేకపోతే అమ్మ చాలా బాధపడుతుందిరా! ఈ సమయంలో మిగిలినవాటి గురించి ఆలోచన వద్దు"

వింటున్న రాజ్యలక్ష్మికి గుండె పట్టినట్లయింది. "అక్కా! అమ్మ.. రాలేని స్థితిలో ఉంది. మన క్షేమం గురించి తన ప్రాణాలైనా ఇస్తుంది. కానీ ఒకటే మోషన్స్ అవుతున్నాయట. పద్మ కూడా అక్కడే ఉంది"

అన్నపూర్ణ గట్టిగా నిట్టూర్పు విడిచింది. 'ఔను, అమ్మకి ఆయనంటే ప్రాణం. ఎంత రాలేకపోతే ఉండిపోయిందో?' రేవతి అమ్మయ్య అనుకొంది.

అన్నపూర్ణకి ఎంత ఆపుకొందామన్నా ఏడుపు ఆగడంలేదు. భర్త మొహం అస్పష్టమైపోతోంది. ఈ కన్నీళ్ళకి ఇంత బుద్ధి లేదేమిటి? పంచభూతాలలో కలిసే ఆ రూపం మళ్ళా తను చూడగలుగుతుందా?

తల్లడిల్లుతున్న బిడ్డల ఏడుపూ ఆమెను వివశురాలనుచేస్తోంది. డాక్టరుగారు ముందుకి వచ్చారు. అన్నపూర్ణ చేతులు జోడించి ఆయనకి నమస్కారం చేసింది. "వద్దు... వద్దు. నాకు ఏమీ ఇవ్వవద్దు. నా భర్తను కనులారా చూడలేకపోతున్నానే అని నేను పరితపిస్తున్నాను. ఇంకా నన్ను బాధిస్తారా? "

ఆయన ఏంచేయగలడు? ఆమె మాటలు ఆయన గుండెను పిండుతున్నాయి. "వద్దు... వద్దు ఆయనని తీసికెళ్ళవద్దు. ఆయన మమ్మల్ని వదిలివెళ్ళలేరు" అంటూ ఆమె ఏడుస్తూ, ఎంత మొత్తుకొంటున్నా చంద్రమౌళి పయనం తప్పలేదు. ఆమెను పట్టుకోవడం ఎవరి వలనా కాలేదు. రేవతి మౌళీ! నా తండ్రీ! వెళ్ళిపోతున్నావా అంటూ తమ్ముడిని దూరంగా తీసుకెళ్ళిపోతూంటే ఏడుస్తూ, స్పృహ కోల్పోయింది. అంతవరకూ బిగపట్టుకొన్న దుఃఖం వరద గోదావరిలాగా ఆమెను కమ్మేసింది.

పిల్లలకి అన్నపూర్ణ పరిస్థితి భయం కలిగిస్తోంది. ఒకపక్క సెలైన్లు, మరొకపక్క ఇంజక్షన్లు. తెలివివస్తే విపరీతంగా ఏడుస్తుంది. తెలివి లేకపోతే పడుంటుంది. రాజ్యలక్ష్మి అక్కను కంటికిరెప్పలాగా చూస్తోంది. రేవతి, వదినలు పిల్లల్ని ఓదారుస్తూ బంధువులకి కావలసినవి అందిస్తున్నారు.

మర్నాడుదయం బాగా పొద్దెక్కాక అన్నపూర్ణకి మెలకువ వచ్చింది. సన్నటి గొంతుకతో, "రాజ్యం" అంటూ పిలిచింది. ఆ పిలుపుకోసమే ఎదురుచూస్తున్నదానిలాగా రాజ్యలక్ష్మి అక్కవైపు తిరిగింది.

"బావ నాకు కలలో కన్పించారు. ఎన్ని కబుర్లు చెప్పారో తెలుసా? ఆయన ఎక్కడికీ వెళ్ళరుట. మా దగ్గరే, ఈ ఇంట్లో ఉంటారుట. అసలు ఆయనకి ఊపిరాడని ఆ సమయంలో నేనే గుర్తు వచ్చానుట. పూర్ణా నన్ను నమ్ము, అంటూ ఏదో విషయాలు చెప్పారే. నాకు కొన్ని గుర్తులేవు" అన్నపూర్ణ గుర్తు చేసుకొంటూ ఆగింది.

"నేను ఆయనని పట్టుకొని, మీరు చనిపోయారని అంటున్నారు. నిజమా అని ఏడుస్తున్నాను. నాకు అది కలో, ఇది కలో అర్థమవడంలేదు. నాకు అంతా అయోమయంగా అన్పిస్తోందే? "

రాజ్యలక్ష్మి కళ్ళనీళ్లు తుడుచుకొంటూ అక్క తల నిమిరింది. ఆత్మకి చావు లేదంటారు. ఈ శరీరాన్ని విడిచినా ఆత్మ తన వాళ్ళనుకొన్నవాళ్ళ చుట్టూ పరిభ్రమిస్తుందని చెపుతారు. అదే నిజమైతే బావ అక్కని, పిల్లల్ని వదలలేక పరితపిస్తున్నాడన్న మాట. రాజ్యం అక్క పిలుపుకి ఆమె కళ్ళెత్తి చూసింది. "అమ్మ కూడా నాకు ఆయనతోపాటు కన్పించిందే. ఒక్కక్షణం

ఆగి అంది. "అమ్మకి నేను ఎలా ఉన్నానో అని బాధగా ఉండిఉంటుంది. అందుకే కన్పించింది"

రాజ్యలక్ష్మికి ఎంత నిగ్రహంగా ఉందా మన్నా అవలేదు. "అమ్మ బదులు నేనున్నా నుకదాక్కా! నిన్ను వదిలి నేను వెళ్ళను. నువ్వు కాసేపు నిద్రపో"



మూడవరోజున ప్రియంవద అత్తవారి వైపు వారు ఎవరో వచ్చారు. ఆమె వాళ్ళతో మాట్లాడుతోంది. వాళ్ళు ఏమన్నారో కానీ "మా దురదృష్టం సంగతి చెప్పకండి. మా అన్నపూర్ణ తల్లి కూడా ఇప్పుడే పోవాలా? పెద్దలు అంటారుకదా సుఖాలు కలిసి రాక పోయినా కష్టాలు మాత్రం కలిసి వస్తా యని. మాపట్ల అది నిజమైంది"

రాజ్యలక్ష్మికి అక్కకి ఈ మాటలు విన్పి స్తాయేమోనని భయం వేసింది. ఆమె గదిలో కూర్చుని కావలసిన సామాన్ల లిస్టు రాస్తున్న రేవతి, శాంతమ్మగార్లు ఉలిక్కిప డ్డారు. రేవతి అక్కగారిని తిట్టుకొంది. కాస్త యినా ఇంగితజ్ఞానం ప్రదర్శించదు. తనకి ఏది తోస్తే అంతే. అసలు ఒంటిమీద తెలి





విలేనట్లే ఉంటుంది.

అన్నపూర్ణ రేవతివైపు చూసింది. ఆమె ఆ మాటలు విననిదానిలాగా ప్రవర్తించింది. రాజ్యలక్ష్మి బయట ఉండలేక అక్కగారి గది లోకి వచ్చింది. ఆమె గుండె గబగబా కొట్టు కొంటోంది. అక్క ఈ మాటలు వింటే ఊరుకొంటుందా? అన్నగార్లు ఏరని నిలదీ యదా?

అన్నపూర్ణ కాసేపు తెల్లబోయింది. ఆమెకి ఏదో అర్థమయ్యీ, అవనట్లు అన్పించింది. ప్రియంవద ఎందుకు అబద్ధం చెపుతుంది? రేవతి తన దగ్గర దాచిందా?

ఎదురుగా వస్తున్న చెల్లిని చూస్తే, ఆమెకి ఆ మాట అడగాలన్పించింది. అదే నిజమైతే చెల్లి ఎంత దుఃఖం దిగమింగుతోంది? ఆమె రెండుచేతులూ చాచింది. రాజ్యలక్ష్మి ఆ చేతులలో ఏడుస్తూ ఒదిగిపోయింది.

అన్నపూర్ణ నెమ్మదిగా తననితాను సంభా ళించుకొంటూ అడిగింది, "ఔనా? రాజ్యం... అమ్మకూడా మనకి లేదా? నాకు నిజం చెప్పవే?"

నిజం తెలుసుకోకపోతే తన ప్రాణం నిల బడదేమోనన్పించింది.

రాజ్యలక్ష్మి వెక్కివెక్కి ఏడ్చింది. రేవతి ఆ అక్కాచెల్లెళ్ళ దగ్గరికి వచ్చింది "ఔను అన్న పూర్ణా! మీ అమ్మగారు మన మాళిపోయిన రోజునే ఇక్కడికి వస్తోంటే పోయారు. ఈ విషయం ఆవిడ జీర్ణించుకోలేకపోయారు. నీకు ఈ విషయం తెలిస్తే మాకు దక్కవే మోనని భయపడి చెప్పలేదు. మీ అన్న య్యలు అక్కడ కర్మ నిర్వహిస్తున్నారు"

అన్నపూర్ణ స్థాణువులాగా వింది. ఎంత దురదృష్టం? కొన్ని గంటల వ్యవధిలో ఇటు భర్తను, అటు తల్లిని తను ఒక్కసారిగా కోల్పోయింది. తనబాధ భరించలేక అమ్మ అసువులు బాసింది. తనది ఎంత మొండి ప్రాణమో! ఇద్దరి విషయాలు ఒకేసారి భరించి, ఊపిరి తీసుకొంది.

ఇంత ఘోరం ఎక్కడైనా ఉందా? సదా

భగవంతుడినే నమ్మిందే! మౌళి అన్నట్లు ఆయన పూజలే బతుకనుకొందే? తను అసలు ఆ దేవుడిని ఏం కోరింది? భర్తను చల్లగా చూడమంది. పసుపుకుంకుమలతో తన జీవితం కడతేర్చమంది. ఎంత నిర్ద యుడైనాడు భగవంతుడు?

రాయిలాగా కూర్చున్న అక్కను రాజ్య లక్ష్మి కుదుపుతూ, "అక్కా మాట్లాడు అక్కా! లేకపోతే నేను భరించలేను" అంటోంది. ఆమె చెల్లెలువైపు చూసింది.

కళాకాంతి లేని చెల్లిమొహం చూడలేక కళ్ళు మూసుకుంది. మూసిన ఆ కళ్ళనుండి తెగిపడిన ముత్యాల్లాగ కన్నీళ్ళు జలజలరా లాయి. ఆమెను గుండెకి అదుముకొంది.

"ఎంత త్యాగం చేశావమ్మా! ఈ అక్క కోసం ఇంత దుఃఖం దిగమింగుకున్నావు కదూ? కడసారి కన్నతల్లి శవం దగ్గరైనా ఉండలేకపోయావు కదూ! ఏం చేస్తే నీ రుణం ఈ అక్క తీర్చుకోగలదు? "

అన్నపూర్ణ మాటలకి చెల్లెలు మరింత ఏడ్చింది. అక్క తనని దగ్గరగా తీయడంతో ఆమెలోని ఏడుపు బయటికి వచ్చేసింది. ఇంతవరకూ అన్నపూర్ణకోసం ప్రాణం ఉగ్గపె ట్టుకుని తిరుగుతోంది.

అన్నపూర్ణను ఓదారుస్తూ రేవతి అంది, "అన్నపూర్ణా! తమ్ముడు మమ్మల్ని వదిలే శాడు. నువ్వు కూడా మాకు దూరమవు తావా? వాడిని నీలో చూసుకుందామను కుంటున్నాను. తల్లి, భర్త... ఈ బంధాలేవీ శాశ్వతంకాదు. మనం మాత్రం ఏదో ఒకరో జున వెళ్ళిపోమా? కాకపోతే ముందూ, వెనుకా అంతే"

అన్నపూర్ణ రేవతి పాదాలకి నమస్కరిం చింది. "వదినా! మీరు ఇలాంటి క్లిష్ట పరిస్థి తులు ఎలా సంభాళించుకున్నారో? నా బంధుత్వం మీకు ఇన్ని ఇబ్బందులు తెచ్చింది"

అన్నపూర్ణకి తల్లి జ్ఞాపకాలు వెల్లువలాగా గుర్తు వస్తున్నాయి. తల్లికి తామంటే ప్రాణం. పిల్లలే లోకంగా ఆవిడ బతికింది. తండ్రి మాట వేదవాక్కులాగా వినేది. బహుశా తనకి తల్లిపోలికే వచ్చిందేమో? అన్నపూర్ణ విరక్తిగా నవ్వుకుంది.

తండ్రిపోవడంతోనే తల్లి సగం మనసు వదిలేసింది. తనకు సంప్రాప్తించిన వైధవ్యా నికి ఎంత కుమిలిపోయిందో? ఇప్పుడు మళ్ళీ ఆవిడ బలహీనపు గుండెకి తనవలన బాధ ఏర్పడింది.

కృష్ణమోహన్ స్నేహితులు ఈ పన్నెండు రోజులూ ఆ ఇల్లు వదలలేదు. అనుక్షణం కనిపెట్టుకుని, ఏ పనులు బయటివి చేయ వలసి వచ్చినా చేసేవారు. మిత్రుడికి వచ్చిన ఆ కష్టం తమదేననుకున్నారు.

వేణుగోపాల్ తల్లితో పెట్టుకోవలసిన ఖర్చు గురించి మాట్లాడాడు. తండ్రికి ఏ లోటూ జరగకుండా చూడాలని కృష్ణమో హన్ చెప్పాడు. ఆమె తల ఊపింది. నిజమే, లోటు అన్నది ఆయనకి ఏనాడూ లేదు. ఈరోజు ఎందుకు చేయాలి?

మొదటిసారి తల్లిని సంతకం పెట్టమన్న ప్పుడు కృష్ణమోహన్ గొంతు వణికింది. ఆవిడ పేరున తండ్రి ఎప్పుడు ఎంత డబ్బు వేశాడో కూడా ఆమెకి తెలియదు. ఆ డబ్బు తీసే అవసరం కూడా ఆవిడకి కలగలేదు.

తల్లి కోరిక మేరకు సంతృప్తిగా ఆయన కర్మకాండ పిల్లలు పూర్తిచేశారు. పెదతండ్రి కర్మకి వాళ్ళబదులుగా నిలబడినా, పను లన్నీ పిల్లలే నిర్వహించారు. ఎక్కడలేని బంధువులు, స్నేహితులు వచ్చి వాళ్ళ కష్టంలో పాలు పంచుకొని వెళ్ళారు.

రేవతి తాను వెళ్ళిపోయేముందు గట్టిగా చెప్పింది. "అన్నపూర్ణా! నేను వెళ్ళినా, మళ్ళీ త్వరలో వస్తాను. వాడు లేడని నువ్వు మనసు పాడుచేసుకోకు. వాడెంతో మాకు నువ్వూ అంతే. వాడు లేనిలోటు కన్పించ కుండా ఈ పిల్లలను పెద్దచేయాలి.




అన్నపూర్ణ బేలగా ఆవిడవైపు చూసింది. "నేను... నేను ఏం చూడగలను? వాళ్ళని ఎలా పెంచగలను? నాకేం తెలుసు? "

ఆమె మాటలకు వేదాంతిలాగా నవ్వింది రేవతి.

"భగవంతుడే నీకు అండగా ఉంటాడు. తప్పదు అన్నపూర్ణా! ఈ సంసారజీవితంలో ఎవరుముందు వెళ్ళినా మిగిలినవారు ఈ బాధ్యతల బరువు మోయక తప్పదు. ధైర్యం తెచ్చుకో"

"నాకా ధైర్యమా... అసలు బతకాలనే కోరికే పోయింది" అంది అన్నపూర్ణ. కృష్ణ మోహన్ తల్లి మాటలకు బాధగా చూశాడు.

రేవతి ఆమెను అనునయించింది. "అదే తప్పు అన్నపూర్ణా! ఈ బిడ్డలు ఏమైపో వాలి? ఆ చిన్నప్రాణాలు ఎంత తల్లడిల్లు తాయో చెప్పు. ఒక్కొక్కసారి అనుకోని కష్టాలు మన జీవితాల్లో చోటు చేసుకుం టాయి. వాటికి భయపడకూడదు. ధైర్యంగా నిలబడాలి. ఎవరికైనా కష్టాలు తప్పవు. ఈ జీవితం ఒక సమరభూమి. చివరివరకూ పోరాడటమే మన విధి. జీవితం ఒక మహాక్రీడ. గెలుపు ఓటములు పట్టించుకో కుండా ఆడటమే మన కర్తవ్యం. జీవితం ఒక మహాద్భుతం. దాన్ని ఆస్వాదించడమే మన పని. ఈ జీవితం ఒక మహాక్రతువు. దాన్ని పవిత్రంగా నిర్వహించడమే మన ధర్మం.

"ఫలితం కన్నా ఎప్పుడూ ప్రయత్నం గొప్పది. అర్థమైందనుకుంటాను. నీ వంతు ప్రయత్నం తల్లిగా నువ్వు చెయ్యి. మేమం దరం నీకున్నామని మరిచిపోకు"

వదినగారు చెపుతున్న విషయాలను అన్నపూర్ణ సజలనయనాలతో వింది. కృష్ణ మోహన్ అత్తవైపు సంభ్రమంగా చూశాడు. ఎంత అద్భుతంగా చెప్పింది? ఇంత అవగా హన ఈమెకి ఎలా కలిగింది?

రేవతిని దింపడానికి వెళ్ళాడు. బస్సు కదిలే సమయంలో "అత్తా! మీరు చెప్పినవి నా జీవితం అంతా గుర్తు ఉంచుకుంటాను. ఈనాటినుండీ మీరంటే నాలో ఆరాధనా భావం పెరిగింది" అన్నాడు. రేవతి కళ్ళు చెమ్మగిల్లగా అతడి చేతులను పెదవులకా నించుకుని వదిలేసింది. "కృష్ణా అమ్మ జాగ్రత్త. నేను ఉన్నానని మరిచిపోకు. ఏ అవసరమేర్పడినా రా!"

బస్సు వెళ్ళిపోయినా అతడు చాలాసేపు చూస్తూ నిలబడిపోయాడు. అతడికి వెంటనే ఇంటికి వెళ్ళాలన్పించలేదు. తండ్రి లేని ఇల్లు అతడిని భయపెడుతోంది. తనకే ఇలాగ ఉంటే అమ్మో? తల్లి గుర్తుకు రాగానే అతడు కదిలాడు.

అతడు ఇంటికి వచ్చేసరికి అందరూ హాల్లోనే దిగాలుగా కూర్చుని కన్పించారు. ఆ నిశ్శబ్దం అతడిని భయపెట్టింది. ఇన్నాళ్ళూ బంధువులంతా ఉన్నారు కనుక ఎలాగో గడిపేశారు. ఇన్నాళ్ళూ గడవడం ఒక ఎత్తు. ఇకముందు గడపడం ఒక ఎత్తు. అతడు నిట్టూర్పు వదిలాడు.

అతడు కాళ్లు కడుక్కుని వచ్చి తల్లిఒళ్లో తల పెట్టి పడుకొన్నాడు. ఆమె నీరసంగా నున్న కొడుకు తల నిమిరింది. ఈలోపు కృష్ణమోహన్ స్నేహితులు వచ్చారు. వాళ్లు ఏవో కబుర్లు చెప్పసాగారు. అతడు తేలికగా ఊపిరి పీల్చుకొన్నాడు. ఆ రాత్రి అతడే ఆకలి వేస్తోందని ముందుగా లేచాడు.

శాంతమ్మగారు అమ్మయ్యా అనుకుని అందరికీ వడ్డించారు. అందరూ హాలులోనే పడుకున్నారు. ఎవరూ విడిగా ఉండటానికి ఇష్టపడటం లేదు. ఆ తల్లీ పిల్లలను చూస్తుంటే శాంతమ్మగారి కడుపు తరుక్కు పోతోంది. కష్టకాలంలో అందరూ ఉండా లని ఎందుకంటారో ఆవిడకి అర్థమైంది.

నందు పైకి డాంబికంగా కబుర్లు ఆడ తాడు కానీ అసలు విషయానికి వస్తే

మహాపిరికి. మధ్యలో మెలుకువ వస్తే తమ్ముడిని బాత్‌రూమ్‌కి వెళ్లడానికి సాయం పిలిచే రకం.

కృష్ణమోహన్ ఉదయం అందరూ కూర్చునే సమయంలో ఆ విషయం చెప్పి నవ్వసాగాడు. "అమ్మా! వాడు కాబోయే డాక్టరు. ఒంటరిగా బాత్‌రూమ్ లోకి వెళ్ల లేని ఉత్తర కుమారుడు" అన్నాడు.

నందగోపాల్ అతడి మాటలకు ఉడుక్కున్నాడు. పెద్ద ధైర్యశాలి. నువ్వైనా ఒక్కడివీ రాత్రి వెళ్ల చూస్తానన్నాడు. కృష్ణమోహన్ మా ఖడ్గతిక్కనకి కోపం వస్తోందన్నాడు.

పిల్లలిద్దరూ వారం రోజులుండి పోయారు. రేవతి రెండు రోజులకోసారి ఫోను చేస్తోంది. వాళ్లకి ఎంతో ధైర్యం చెబుతోంది. కృష్ణమోహన్‌కి తల్లి విషయమే బెంగగా వుంది. మౌనవీణలాగ ఉంటోంది. తనంత తాను ఏ విషయమూ పట్టించుకోదు. ఎప్పుడూ శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తూ ఉంటుంది. కళ్లు తుడుచుకునే తల్లిని చూసి అతడు బాధపడతాడు.



రోజులు గడవడం ఆగవుకదా! నెమ్మదిగా వాళ్ళు ఇంట్లో మసలడం అలవాటు చేసుకుంటున్నారు. అన్నట్లుగానే పదిరోజులయ్యేసరికి రేవతి వచ్చింది. అప్పటి కన్నా చిక్కిపోయి, నీరసపడిన అన్నపూర్ణని చూసి దెబ్బలాడింది. రేవతి వచ్చాక తమ్ముడి గదివైపు నడిచింది.

ఆ గదిలో అడుగుపెట్టిన ఆమెకి ఆశ్చర్యం వేసింది. శాంతమ్మగారు అందరూ హాలులో పడుకుంటున్నారని చెప్పారు. మరి ఈ ఆలోచన ఎవరు చేశారు?

ఎవరు చేసినా ఆ పనిలో కన్పిస్తున్న అంకితభావానికి ఆమె ముచ్చటపడింది. ఆ గదిలో తమ్ముడి నిలువెత్తు ఫొటో తగిలించబడి ఉంది. లామినేషన్ చేయించిన ఆ ఫొటో అకస్మాత్తుగా చూస్తే తమ్ముడు ఆ గదిలో నిలబడినట్లు అన్పిస్తుంది.

డ్రాయర్ మీద అతడి ఫొటో ఉంచబడింది. దాని దగ్గర దీపం వెలిగించి ఉంది. అగరువత్తులు సువాసనలు వెదజల్లుతున్నాయి. అతడు నవ్వుతూ సజీవంగా ఉన్నట్లే ఉన్నాడు.

తమ్ముడి మంచం, పరుపు, దుప్పట్లు, దిండ్లు అన్నీ పరిశుభ్రంగా ఉన్నాయి. అతడి కళ్లజోడు, పెన్నులు, అతడి బాగ్, రుమాళ్ళు అన్నీ అద్దాల్లో నుండి ఒక అరలో కన్పిస్తున్నాయి. మరొకపక్క చిన్నస్టూలు మీద అతడు వాడిన చెప్పులు పెట్టబడి ఉన్నాయి. ఆ గది తమ్మునికి దర్పణంగా ఉంది.

గదిలో బీరువానిండా అతడి పుస్తకాలు చక్కగా సర్ది ఉన్నాయి. మరొక బీరువా నిండా బట్టలు గదికి మరొకవైపు భార్యాభర్తలు వివిధ సందర్భాలలో తీయించుకున్న ఫొటోలు!

రేవతి సంభ్రమంగా చూసింది. చంద్రమౌళి పటందగ్గర ఒక బల్బు వెలుగుతోంది. మరో ఫొటో చంద్రమౌళిది బస్టు సైజుది ఉంది. దానిదగ్గర "డాడీ! మీరు మాకు భౌతికంగా దూరమైనా మా గుండె సవ్వడుల్లో నిండే ఉన్నారు" అన్న అక్షరాలు వెలుగుతున్నాయి.

రేవతికి అది కలా నిజమా అన్పించింది. అన్నపూర్ణా! వేణూ, నందూ అంటూ అందరినీ పిలిచింది. వారందరూ ఏవిటోనని త్వరగా వచ్చేశారు.

ఆమె ఆ గదివైపు చూస్తూ, "ఎవరు ఈ పనిచేశారు? ఎవరికి ఇంత అద్భుతమైన ఆలోచన వచ్చింది" అంది.

ఆ గదిలో ఏం జరిగిందో అని కంగారు పడినవారు ఆత్రుతగా అటువైపు చూశారు. వాళ్ళందరూ రేవతిలాగే ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు. వాళ్ల మొహాలు,

ఆ భావాలు చూసిన రేవతికి వారికీ ఆ విషయం ఇప్పుడే తెలిసిందని అర్థమైంది.

అన్నపూర్ణా, అంటూ భర్త నిలబడి పిలుస్తున్నట్లే ఆమెకి అన్పించింది. అన్నపూర్ణ ఆ గదిలోకి నడిచి, అతడి నిలువెత్తు ఫొటో ముందు కూలబడిపోయి ఫొటో చేతితో తడమసాగింది.

రేవతి కొద్దిక్షణాలు గడిచాక ఆమెను లేవదీసి, అన్నీ చూపించింది. "చంటీ" అంటూ అన్నపూర్ణ నోటినుండి అస్పష్టంగా పిలుపు బయటికి వచ్చింది.

బయటినుండి అప్పుడే వచ్చిన కృష్ణమోహన్ అందరూ పైన ఉన్నారని శాంతమ్మ గారు చెప్పగానే త్వరగా పైకి వచ్చాడు. తండ్రి గదిలో వాళ్ళను చూసిన అతడు వెనుదిరిగిపోయాడు.

నందు "అదుగో తమ్ముడు వచ్చాడు" అనడంతో రేవతి అతడివైపు చూసి, లోపలకి రమ్మన్నట్లుగా తల ఊపింది.

"ఇది ఇది నీపనే కదూ? ఇంత మంచి ఆలోచన వచ్చిన నీకు ఎలా అభినందనలు చెప్పను? " అంది.

అతడి చూపులు తల్లి చూపులతో కలుసుకున్నాయి. "అమ్మ నాన్నగారి గురించి తల్లడిల్లిపోతోంది. శూన్యంలో ఆయన జ్ఞాపకాలు వెదుక్కొంటోంది. ఈ గది నాన్నగారికి ఎంతో ప్రియమైనది. ఆయన మమ్మల్ని విడిచి ఎక్కడికీ వెళ్ళలేదని, మా మధ్యే ఉన్నారని అమ్మకి చెప్పాలన్పించింది. అమ్మకి బహుమతిగా ఈ గది ఇస్తే మన శ్శాంతి పొందుతుందన్పించింది. అందుకే చేశాను" అతడు తండ్రి ఫొటో చూస్తూ అన్నాడు. "ఇప్పుడు... ఇప్పుడు నాకే ఈ గదిలో ఒక తృప్తి లభిస్తోంది"

మందంగా అతడి గొంతునుంచి వస్తున్న మాటలకి అన్నపూర్ణ కదిలిపోయింది. కొడుకు దగ్గరికి కదిలి, అతడి తలను ముద్దుపెట్టుకొంది. ఆమెకి హఠాత్తుగా భర్త చర్య గుర్తు వచ్చింది.

ఆయన ఇలాగే అలివిమాలిన ప్రేమతో తన తలపై, నుదిటిపై ముద్దు పెట్టుకునేవాడు. "చంటీ! మీ నాన్నగారు నాకు ఎంత మంచి కొడుకును ఇచ్చారురా? " అంది. ఆ మాట అంటోంటే ఆవిడ గొంతు వణికింది.

ఆమె భావావేశంతో కాసేపు మాట్లాడలేకపోయింది. "కృష్ణా! నా వీణ కూడా తీసుకునిరా! అది ఆయనకి ఎంతో ప్రియమైనది. దాన్ని కూడా ఈ గదిలో భద్రపరుచు" అంది.

అతడు తల్లిమాటలకు అలాగేనంటూ తల ఊపాడు. ఆమె చూపుడువేలుతో ఆ గది చూపిస్తూ "కృష్ణా! నాకు ఈ శేషజీవితం గడపడానికి ఈ గది చాలురా. ఈ ఆధారంతో నా చీకటి బతుకు ఎలాగో భరిస్తాను"

తల్లిమాటలకు అతడు బాధపడ్డాడు.

రేవతి అన్నపూర్ణని ఆవేశపడవద్దని, ముత్యాల్లాంటి బిడ్డలున్న ఆమె అదృష్టవంతురాలని చెప్పింది. వేణు తమ్ముడి దగ్గరికి వచ్చి భుజంమీద చెయ్యేసి "మాలో నువ్వు చిన్నవాడివి. కానీ ఆలోచనలలో మాకన్నా నువ్వే ముందున్నావురా" అన్నాడు.

తండ్రి నెల మాసికానికి ప్రియంవద, అతడి అన్నలు, వదినలు వచ్చారు. వచ్చిన వాళ్ళు ఎన్నో సమస్యలు లేవనెత్తారు. తండ్రి పోయాక ప్రభుత్వం ఇచ్చే ఉద్యోగం ఎవరు తీసుకోవాలి? డబ్బు వచ్చింది ఎలా తీసుకుంటారు? ఏం చేస్తారు? అన్నీ ప్రశ్నలే. వాళ్ళ ప్రశ్నలు భవిష్యత్‌ని మరింత భయంగా చూపించాయి అన్నపూర్ణకి. అవనీ! ఏదైనా ఇంతకన్నా నష్టం కలగదు కదా అని ఆమె విరక్తిగా నవ్వుకొంది.

ప్రియంవద కొత్త ప్రతిపాదన లేవదీసింది. "తాము ఇంటి ఆడపిల్లలు కనుక తమ్ముడి చివరి సంపాదనలో తమకి పసుపుకుంకాలకింద ఏమాత్రం ఇచ్చినా సంతోష

మే"నంది.

రేవతికి అక్క స్వార్ధానికి అసహ్యం వేసింది. చెట్టంత తమ్ముడు పోయాడనీ లేదు. బిడ్డలు, భార్య అనాధలైనారనీ లేదు. డబ్బు అడగడానికి సిగ్గయినా పడటంలేదు.

రేవతి నిర్మొహమాటంగా తనకి అలాంటివి అవసరం లేదని, తాను అక్క తరఫున వాళ్ళను క్షమార్పణ కోరుతున్నానని చెప్పింది. అది చాలదన్నట్లు ఇప్పుడు శాంతమ్మగారి అవసరం ఏం ఉంది? తమ్ముడున్నప్పటిలాగా దర్జాలు నడిపితే నలుగురూ అన్నం తినక్కరలేదు. ఇన్నాళ్ళూ తమ్ముడింట్లో ఉన్నామె, ఇంక తన ఇంటికి వస్తే తను ఆదరిస్తానని, అది ఆవిడపైగల ప్రేమతో చెపుతున్నానని అంది.

ప్రియంవదకి నందు మనస్తత్వం తెలుసును. నందు తనకి సాయంగా ఒకమాట అంటే పనవుతుంది.

ప్రియంవద దృష్టి శాంతమ్మగారిపై పడటంలో ఆశ్చర్యంలేదు. ఆవిడ చక్కగా పని చేస్తారు. పరిశుభ్రత ఎక్కువ. మహా పొదుపరి. భర్త నడివయసు రాకుండా కన్నుమూస్తే తన దురదృష్టానికి నిందించుకున్నారు తప్ప దైవాన్ని నిందించలేదు.

ఒక్క నలుసైనా ఆవిడ కడుపున పుట్టి ఉంటే బాగుండేది. పిల్లలకోసం ఎంత తపించినా దైవం అనుగ్రహించలేదు. భర్త పోయాక పుట్టింటికి వెడితే అన్నావదినలు ఉపేక్షాభావమే చూపించారు. ఈవిడ పోషణంతా ఇంక తమపైనే పడుతుందని వాళ్ళ బెంగ. భర్త ఏ ఉద్యోగీకాడు. పౌరోహిత్యం చేసేవాడు. ఆయన ఉన్నన్నాళ్ళూ జరుగుబాటు బాగానే జరిగింది. ఆ తర్వాతే ఆవిడ కష్టాలు ప్రారంభమయ్యాయి.

అత్తవారి కుటుంబం వచ్చెయ్యమని గొడవ. ఆ ఉమ్మడి కుటుంబంలో ఎంత చాకిరీ చేసినా ఆటు వచ్చేదికాదు. చెల్లి కొడుకునో, బావగారి అబ్బాయినో తనకు దత్తత ఇమ్మని భర్త బతికున్న రోజుల్లో అడిగేవారావిడ. వాళ్ళు ఇవ్వమని చెప్పలేదు. అలాగని ఇచ్చే ప్రయత్నాలు చేయలేదు. వాళ్ళు ఏదైనా సంపాదించుకున్నాక అప్పుడు చూడవచ్చనుకున్నాడు.

శాంతమ్మగారికి పనికి ఎప్పుడూ బద్ధకం లేదు. తనవాళ్ళే కదా అని తన ఇంటికి చేసేటట్లు చేసేవారు. అయినా ఎప్పుడూ దెప్పిపొడవడాలే. ఏదోరకంగా సాధింపులే! బావగారి కొడుకు ఎంత మాట పడితే అంతమాట అనేవాడు.

ఆ పరిస్థితులలో చంద్రమౌళి హైదరాబాద్ ఆఫీసు పనిమీద వెళ్ళాడు. అతడి స్నేహితుడు శాంతమ్మగారి గురించి చెప్పాడు. అన్నపూర్ణ లలితను కడుపుతో ఉంది. ముగ్గురు పిల్లలతో, భార్య శ్రమపడవలసి వస్తోందని అతడి బాధ.

అన్నపూర్ణ అంతలాగా కష్టపడటం, అతడికి భరించలేనంత చిరాకుగా ఉంది. పోనీ పుట్టింటికి పంపుదామంటే అతడు వదిలి ఉండలేడు. పిల్లలు, పూర్ణ లేకపోతే అసలు తోచదు.

స్నేహితుడు చంద్రమౌళికి చెప్పాడు "అన్నం, బట్ట ఇచ్చి మీకు తోచిందే ఆవిడ పేర పోష్టలో వేయండి. మీ ఇల్లు కనిపెట్టుకుని ఉంటారు. ఆవిడ వచ్చాక మీకే ఆవిడ ఎలాంటిదో తెలుస్తుంది" ఆ విధంగా చంద్రమౌళి శాంతమ్మగారిని చూడగానే ఇష్టపడి ఇంటికి తీసుకుని వచ్చాడు.

అన్నపూర్ణ కూడా ఆమెను స్వంతమనిషి లాగే చూసింది. లలిత పుట్టడం ఆవిడ చేతులమీదే జరిగింది. ఆవిడకి లలితంటే ప్రత్యేకప్రేమ. వచ్చినప్పటినుండీ తన ఇల్లు లాగే మసలింది.

ప్రియంవదకి హోదాగా బతకడం కావాలి. ఎవరైనా అయితే ఇంత నమ్మకంగా ఉండరు. ఆవిడను రప్పించుకోవాలంటే నందు సహాయం కావాలి. నందుకి




ఆలోచన తక్కువ. అందుకే "నందూ, నువ్వూ ఆలోచించరా. ఇంక వీళ్ళందరి బాధ్యతలూ మీరు ఎలా పడగలరు? మనలో మనమే కనుక సర్దుకోవడం మంచి దికదా" అంది.

శాంతమ్మగారు తన ప్రస్తావన వచ్చేటప్ప టికి కంగారుపడిపోయారు.

ప్రియంవద ఆవిడవైపు తిరిగి "ఇప్పుడే వచ్చెయ్యమనడంలేదు. మా మరదలు కాస్త కోలుకొన్నాక రండి. మా వేణు, నందు పసి వాళ్ళు. వాళ్ళు మీ అందరినీ పోషించగ లరా? "అంది.

వేణు మౌనంగా ఉన్నా నందు ఉండలేక పోయాడు. తనకీ ఇంటి బాధ్యత ఉంద న్నట్లు, "పెద్దత్త చెప్పిన విషయం మనం ఆలోచించవలసిందే. అంతగా అయితే మనకి అవసరమయ్యేటప్పుడు వస్తూం టారు" అన్నాడు.

వాళ్ళు వెళ్ళిపోయాక శాంతమ్మగారు అన్నపూర్ణ, కృష్ణమోహన్‌ల దగ్గర తన బాధ వెళ్ళగక్కారు. "అన్నపూర్ణ తల్లీ! మీరు నా బిడ్డ అనుకున్నాను. లలితమ్మ చిన్నప్పుడు వచ్చాను. మీలో ఒకదాన్నిగా, మీకష్టసు ఖాలు పంచుకున్నాను. ఈనాడు నేను మీకు బరువైపోయానా? బాబుగారి చేతు లతో నా దినం తీరుతుందనుకున్నాను. అంత అదృష్టమా నా మొహానికి? నన్ను ఎక్కడికీ వెళ్ళమనకండి. ప్రియంవదమ్మ గారి స్వభావం మీకు తెలియనిదా? కలో, గంజో తాగి మీ కాళ్ళదగ్గర పడుంటాను. మీ తల్లిననే అనుకోండి" అంటూ ఆమె చేతులు పట్టుకున్నారు. కృష్ణమోహన్‌కి ఆవిడ బాధ అర్థమైంది. పెద్దత్తమీద కోపం వచ్చింది.

నందు "మనమే ఎలా బతకడమా అని ఆలోచిస్తోంటే ఈ బాధ్యతలన్నీ పడగ లమా? నేను అందుకే కొన్నాళ్ళుండమ న్నాను" అన్నాడు.

కృష్ణ చిరాకుగా అన్నయ్యవైపు చూశాడు. "శాంతమ్మగారు కనుక ఇలాగ అంటు న్నావు. అదే మన నాయనమ్మ, అమ్మమ్మో అయితే ఏం చేస్తాం? చెప్పరా? అదీగాక ఈ సమయంలో అమ్మకి ఒకరు సాయం ఉండాలికదరా" అన్నాడు.

వేణు కూడా "అవునురా, అమ్మ మానసి కంగా కోలుకోవాలి. తన ఒంట్లో బావుండ టంలేదు. శాంతమ్మగారైతే అమ్మని బాగా చూసుకుంటారు. మనం దూరంలో ఉన్నా నిశ్చింతంగా ఉండగలం" అన్నాడు.

ప్రియంవద అంటే కృష్ణమోహన్‌కి మొద టిసారిగా చెప్పలేని అసహ్యం వేసింది.

అన్నపూర్ణ ఏ విషయాలూ తనకి పట్ట నట్లే ఉంది. శాంతమ్మగారు బాధపడిన ప్పుడు మాత్రం "ఇప్పుడు మిమ్మల్ని వెళ్ళ మని ఎవరన్నారు? నాతోపాటే నాకు కలి గింది తిందురుగాని, ఎవరిమాటలూ పట్టిం చుకోకండి" అంది.

భర్త పోయిన పచ్చి ఆరలేదు. తమ ఇంటి విషయాలు అప్పుడే చర్చనీయాంశమై పోయాయి అనుకొంది. రాజ్యలక్ష్మి వచ్చిన ప్పుడు అన్నీ విని "మీరు మెత్తగా ఉంటే ఎవరికి తోచినవి వాళ్ళు చెపుతారు. మీదంటూ మీరు ఒక నిర్ణయం తీసుకోండి. అంతేగానీ ప్రతీవాళ్ళూ చెప్పినదానికి డూడూ బసవన్నాయని తల ఊపకండి" అంది.

ఆమెకి కూడా ప్రియంవద ప్రవర్తన కష్టం కలిగించింది. అక్కమీద ప్రేమా? కాదు తన సుఖంకోసం ప్రాకులాట. శాంతమ్మగా రిలాంటి పెద్దావిడ ఉంటే, అక్క గురించి తమకి బెంగ ఉండదు.

★ ★ ★

మధ్యాహ్నం క్లాసులు లేవనడంతో కృష్ణ మోహన్ ఇంటికి వచ్చేశాడు. లలిత స్కూలికి వెళ్ళింది. తల్లి కొత్తగా ఉద్యోగంలో చేరడంతో సాయంత్రం ఆరుగంటలకిగానీ

రాదు. శాంతమ్మగారు అతడు వచ్చాక తలుపుతీసి మళ్ళీ వెళ్ళిపడుకున్నారు.

కృష్ణమోహన్ తన మంచంపై నడుం వాల్చాడు. అతడికి అలసటగా ఉంది. అయినా నిద్రరావడంలేదు. భవిష్యత్ ప్రశ్నార్ధకం లాగా ఉంది. గతం బాధాకరం. అయినా ఒక ఇంటి పెద్ద పోతే ఇన్ని మార్పులా? ఇన్ని సమస్యలు ఎవరికీ ఉండవు కాబోలు.

అతడు సాలోచనగా చూస్తున్నాడు. తల్లికి ఎప్పుడూ ఎక్కువగా మాట్లాడడంరాదు. పోట్లాడడం అంతకన్నారాదు. అది తన అన్నలు అలుసుగా తీసుకున్నారా?

అతడికి తాతగారు పోయిననాటి సంఘటనలు గుర్తువచ్చాయి. ఆనాడు అన్నలు స్వార్ధంగా ప్రవర్తించారని అమ్మ ఎంత బాధపడింది? మరి ఈనాడు బిడ్డల ప్రవర్తనకి ఎంత కుమిలిపోయిందో? పెదవి విప్పి చెపితే కదా తెలిసేది.

తండ్రి డబ్బు రాగానే వేణు తను కంపెనీకి 70 వేలు కట్టాలన్నాడు. కడితే ఉద్యోగం ఢిల్లీలో గ్యారంటీట. డిపాజిట్ కడితే ఉద్యోగంతోపాటు ఫారిన్ ఛాన్స్.

"ఎక్కువ డబ్బు సంపాదించాలంటే మన ఇంటికి పూర్వవైభవం కలిగించాలంటే తనకి ఇప్పుడు పెట్టుబడి పెట్టడం అవసరం. నాన్న మనల్ని బాగా చదివించాలని, పెద్దపెద్ద ఉద్యోగాలలో చూడాలని కలలు గన్నాడు కదా! అందువలన నాకు ఈ అవకాశం వచ్చినప్పుడు వద్దనకండి" అంటాడు.

అన్నపూర్ణ బేలగా చూస్తూ, "వేణూ, నువ్వు ఫారిన్ వెళితే మేం ఉండలేంరా. నాన్న ఎలాగూలేరు. ఉన్న మీరు దూరమైతే ఎలా భరించనురా" అంది.

ఆవిడ మాటలలో బెంగ, దైన్యం కన్పిస్తున్నాయి. చూసేవారి గుండెలు కరిగిపోక తప్పదు. వేణు అయిదు నిముషాలు మాట్లాడలేకపోయాడు. అతడికీ బాధగానే ఉంది. కానీ ఇంత చదువు చదివింది ఇక్కడే ఉద్యోగం చేయడానికా?

"అమ్మా! ఈ రోజుల్లో అన్ని వసతులూ వచ్చేశాయి. రెండురోజులకి ఒకసారి ఫోన్ చేస్తాను. నేను బాగా డబ్బు సంపాదిస్తే మనం లలితకి మంచి సంబంధం చూసి పెళ్ళి చేయవచ్చు. లలిత పెళ్ళి జరిగాక నిన్ను నా దగ్గరకి తీసుకెళ్ళిపోతాను. సరేనా? కృష్ణకి కూడా నా దగ్గర ఉద్యోగం చూస్తాను. వాడినీ బాగా చదివిద్దాం".
అతడు భవిష్యత్‌ను బంగారుమయంగా చేసి చూపిస్తూ మాట్లాడుతోంటే ఆమె ఏం మాట్లాడుతుంది?

నందు తండ్రివలన వచ్చిన డబ్బులో తన చదువుకి కొంత కేటాయించమన్నాడు. అన్నపూర్ణ తెల్లబోయి "నువ్వు నాన్నగారి వలన వచ్చే ఉద్యోగం చేయవా? " అని అడిగింది.

అతడు ఆవిడకన్నా తెల్లబోయాడు. "నేను ప్రభుత్వం ఇచ్చే గుమాస్తా ఉద్యోగం చేయాలా? " అన్నాడు నీరసంగా.

"గుమస్తా ఉద్యోగమని తేలికగా అనవద్దురా? ఏ వృత్తి అయినా నిజాయితీగా చేస్తే గొప్పదే! పరుగెత్తి పాలు తాగే కన్నా నిలబడి నీళ్ళు తాగడం గొప్పరా. నా మాట విను. మన కుటుంబానికి సహాయంగా ఆ ఉద్యోగం నువ్వు చేస్తే తమ్ముడు, చెల్లి తెములుతారు. నువ్వయినా నాకు దగ్గరగా ఉంటావు"

నందు దెబ్బతిన్నట్లు చూశాడు. "డాక్టర వ్వాలనే నా కోరిక నీకు తెలియదామ్మా? ఎలా నన్ను అది మాని, ఇందులోకి రమ్మంటున్నావు? "

"మనమున్న పరిస్థితులలో అంత చదువు ఎలా పూర్తవుతుంది? స్వంతంగా ఏ హాస్పిటల్ అయినా ఎలా పెట్టుకొంటావు? అన్నీ సవ్యంగా జరిగే యోగం మనకి ఉంటే




మీనాన్నగారే ఉండేవారు" ఆవిడ కళ్ళు తుడుచుకుంటూ అంది.

తండ్రి పోయిన దగ్గర్నుండీ ఆవిడ మరీ బేలగా తయారయింది. చీటికీ మాటికీ కళ్ళ నీళ్ళు పెట్టుకొంటోంది. లలిత చిన్న పిల్ల వడం, ఆఖరిదవడం ఆవిడకి బెంగగా ఉంది. ఎన్ని చేస్తే ఈ పిల్లలు తెములు తారు?

నందు కొద్దిక్షణాలు ఆవేశంతో మాట్లాడ లేకపోయాడు. "బావుందమ్మా. అన్నయ్యను బాగా చదివించారు. వాడికి ఒక హోదా కల్పించారు. రెండు సంవత్సరాలు చదువు కున్న నాకు మొండిచెయ్యి చూపిస్తున్నారు. నేను డాక్టరైతే మీకు గొప్పకాదా?

"చంద్రమౌళి గారబ్బాయిలు ఒకరు కంప్యూటర్ ఇంజనీరు, మరొకరు గుమాస్తా గాడు అని అందరూ నవ్వరా? నాన్నగారి కోసమైనా మనం ఆలోచించాలి. ఆయన ఎన్ని కలలు కన్నారు? "

ఆవిడ భర్త ప్రసక్తి రాగానే ఏడ్చింది. "ఏం చేస్తాం? ఆయన ఉంటే అన్నీ జరిపే వారురా? మీ ఇష్టం. తమ్ముడు మైనార్టీ తీరనివాడు. ఎలా వాడికి ఉద్యోగం వస్తుంది? కొద్దికాలం ఊరుకుందామంటే ఇల్లు గడవాలి కదా. అయినా వెనుక పుట్టిన వాళ్ళిద్దరికీ పెద్దవాళ్ళయిన మీరు ఏమైనా చేయాలి కదురా? "

"ఏది ఏమైనా నేను డాక్టరునవ్వాల్సిందే నమ్మా! మామూలుగా ఉద్యోగం చేయడం నా వలన కాదు. తర్వాత నేను వాళ్ళని చూడనా? "

నందు మాటలకి ఏం సమాధానం చెప్ప గలదు? కృష్ణమోహన్‌కి ఆవిడ ఆమాత్రం చెప్పడమే గగనమన్పించింది. ఏనాడూ ఆవిడ తమని శాసించలేదు. ప్రేమానురా గాలు పంచి పెంచింది. ఈరోజు భవిష్యత్ ఎలాగని తడబడుతోంది. ఏ చేతులు రెప రెపలాడే ఈ దీపానికి బాసటగా నిలు స్తాయో అని ఆశగా చూస్తోంది.

వేణు చెప్పినా అతడు వినలేదు. రాజ్య లక్ష్మి, రేవతి వచ్చిననాడూ ఈ సమస్యే చర్చనీయాంశం అయింది. నందు పైగా తల్లిని చూస్తూ "ఈ ఉద్యోగం నువ్వు చేయ వచ్చు కదమ్మా! నీకూ కాలక్షేపమవుతుంది. బయటి ప్రపంచం తెలుస్తుంది" అన్నాడు.

కృష్ణ అతడిని కోపంగా చూస్తూ అన్నాడు, "నీకు ఇష్టమైతే నువ్వు చెయ్యి. లేదా మానెయ్యి బలవంతంలేదని చెప్పారు కదా. అంతేగానీ ఏనాడూ బయటికి వెళ్లని అమ్మని వెళ్ళమనడానికి నీకు నోరు ఎలా వచ్చిందిరా?

"నాన్నగారు ఆమెను ఒక మహాలక్ష్మిగా చూశారనైనా నీకు గుర్తురాలేదా? అమ్మ ఎప్పుడైనా ఈమాత్రం మనతో మాట్లా డిందా? ఎందుకు ఆవిడ చెప్పిందో అర్థం చేసుకోకుండా మాట్లాడతావేంరా? " ఆపైన ఎవరూ మాట్లాడలేకపోయారు.

ఎవరు ఎలా చేయాలనుకొన్నారో అలాగే చేశారు. తాను ఏం చేయగలడు? వయసు ఇంత గుదిబండవుతుందనుకొన్నాడా? నందు చదువుకి కావలసినది వేరే అతడికి ఇచ్చేశారు. మిగిలిన కొంచెం లలిత పేరు మీద ఫిక్స్‌డ్ చేశారు. తండ్రి పేరు మీదున్న డబ్బు ఇంటి ఖర్చులకీ, వచ్చి పడు తున్న అవసరాలకీ అయిపోతోంది.

కృష్ణమోహన్ నిట్టూర్చాడు. కొండలైనా కూర్చుని తింటే కరిగిపోతాయని ఇందుకే అన్నారు కాబోలు. తల్లి తను చదువు మాన తానని అంటే ఏడ్చింది. చదువు మానుకొని ఎలా బతుకుతావురా అంది.

ఒక ఇంటిపెద్ద అకస్మాత్తుగా పోతే ఆ కుటుంబం ఎన్ని ఇక్కట్లు పడుతుందో, నిల దొక్కుకోవడానికి ఎంత అవస్థ పడుతుందో తమను చూస్తే అర్థం చేసికోవచ్చు

తల్లి తమ కోసం కేవలం చెల్లినీ, తనను పెంచడం కోసం ఉద్యోగం చేస్తానంది.

పెద్దన్నగారు వచ్చినపుడు ఆవిడ ఆ విష యాలు చూడమని అడిగింది. ఆరోజు తాను ఆమెను ఎంతో బతిమలాడాడు. ఏడ్చాడు.

ఒకనాడు ఒక ఇంజనీరు భార్యగా హోదాతో బతికి ఈనాడు మామూలు స్త్రీగా ఆ జీవితంలో ఇమడగలదా? అనారోగ్యం, పరిస్థితులు ఆమెను బాధించవా?

"కృష్ణా! నేను ఇప్పుడు మామూలు తల్లి నిరా! ఇంజనీరు భార్యను మీ నాన్నగారున్న పుడు. అదంతా అయిపోయింది. అది గత వైభవం. నన్ను వెళ్లనీయరా!" అంది రుద్ధ కంఠంతో.

ఎంతో ప్రయత్నం మీద ఆవిడకి దగ్గరగా నున్న హైస్కూల్‌లో క్లర్క్‌గా పోస్టింగ్ ఇచ్చారు. అసలు ఆఫీసులలో ఇద్దామను కొంటే ఆవిడ ఒప్పుకోలేదు. భర్త బతికిన ఆ పరిసరాలలో వద్దంది. ఎక్కడో అక్కడ కాల క్షేపం చేస్తే బిడ్డలు ఎదుగుతారు.

కృష్ణమోహన్‌కి ఆవిడ నిర్ణయం వెనుక నున్న నిశ్చయం అర్థమైంది. తమకోసం తల్లి బయటి ప్రపంచంలోకి అడుగుపె ట్టింది. ఆ సున్నితమూర్తిని కాలం ఎంత నిర్దయగా శిక్షించిందో?

చిన్న మేనమావ ఏడ్చాడు. తన దగ్గరికి వస్తే ఉన్నదే అందరూ తినవచ్చునన్నాడు. తల్లి ఒప్పుకోలేదు. "నాకు ఈ ఇల్లే దేవాల యంరా! దీన్ని వదిలి రాలేను. నా కోసమే మీ బావ దీన్ని కట్టారు కాబోలు" అంటూంటే ఆ మాటలు విని ఎంత బాధ పడ్డాడో ఆయన.

బావగారి దగ్గర తీసికొన్న డబ్బు పొలం అమ్మి ఇస్తానన్నా వద్దంది. "నీకు ఆ ఆధారం ఉండాలనే కదురా! ఆయన తాప త్రయపడ్డారు. ఆయన ఒక మంచి పనిచేస్తే నేను అడ్డుపడనా? నా వలన కాదురా" అంది.





తల్లి ఉన్నత స్వభావానికి తను ఎంత ఆనందించాడో? చిన్నమావయ్య, రేవతి అత్త, పిన్ని వచ్చి పోతూ ఉంటారు. తల్లి మాటలు విని 'పోనీలేరా! ఇలాగైనా ఆవిడ కొంత బాధ మరిచిపోయి, నలుగురిలో కలుస్తుంద'ని పిన్ని అంది.

కృష్ణమోహన్ గంటలు మ్రోగటంలో ఉలి క్కిపడి అటు చూశాడు. అయిదు గంటలు దాటుతోంది. శాంతమ్మగారు పని హడావి డిలో ఉన్నారు. ఈమె ఉండటం వలన అమ్మకి శాంతీ, విశ్రాంతీ అనుకొన్నాడు.

ఆవిడని పంపనందుకు పెద్దత్త రుసరుస లాడటం గుర్తుకొచ్చింది. "ఇలాగే పరిస్థి తుల్ని గమనించకపోవడం వలననే ముందు జాగ్రత్తలు తీసుకోనందుకే ఈ స్థితి వచ్చిందని గ్రహిస్తే మంచిది" అని హెచ్చ రించిందామె.

తల్లి అడ్డుపడకపోతే తాను గట్టిగానే జవాబు ఇచ్చేవాడు. ఎవరితోనూ వైరం వద్దంటుందామె. అసలు శాంతమ్మగారు తమలో ఒకరుగా కలిసిపోవడం ఆవిడకి గిట్టలేదు. అంత బాగా పనిచేసే ఆవిడను ఎలాగైనా తన ఇంటికి తరలించుకెళదామ నుకొంది. కానీ అన్నపూర్ణ " ఉండనీ వదినా! మేం తినేదే తింటారు. ఇదే నా తల్లి అయితే ఈ పెద్ద వయసులో వెళ్ళిపొ మ్మనగలనా? " అంది.

ప్రియంవద మొహం గంటు పెట్టుకొంది. సంపాదించే భర్త పోయినా మరదలికి హోదా తగ్గలేదంది. ఇలాగైతే ముష్టెత్తుకొం టారంది. అతడికి ఎంత ఆవేశం వచ్చిందో? తల్లి ఆమె వెళ్లేముందు కొంత డబ్బు ఇచ్చి, మీ తమ్ముడి చివరి సంపాదన మీరు దాచుకోండి అన్నప్పుడు ఏమీ మాట్లా డకుండా పుచ్చుకొంది.

అన్ని మాటలు మాట్లాడిన ఆవిడ తిర స్కరిస్తుందనుకొన్నాడతడు. డబ్బు దగ్గర ఆవిడకి ఏ పట్టింపులూ ఉండవు. అలాంటి వాళ్ళే బ్రతకగలరేమోననుకొన్నాడు.

శాంతమ్మగారువచ్చి "బాబూ! బస్సు దగ్గరికి వెళతావా? " అని అడిగారు. కృష్ణమోహన్ లేచి, మొహం కడుక్కొని బయలుదేరాడు. రోజూ ఉదయం తల్లిని దింపుతాడు. సాయంత్రం ఇంటికి తీసుకొని వస్తాడు.

బస్సులోనుండి అలసటతో దిగే తల్లిని చూస్తే అతడి గుండె పిండినట్లవుతుంది. అడగలేక అడుగుతాడు, " అమ్మా! జాగ్రత్తగా రాగలిగావా? "

ఆవిడ మెల్లిగా నవ్వుతుంది. వాడు ప్రతీ రోజూ వేసే ప్రశ్నే యిది. కొడుకు బండి మీద కూర్చుని ఇంటికి వస్తుంది. అందరూ కలిసి శాంతమ్మ పెట్టింది తిని, కాఫీ తాగుతారు. ఇదే జరిగేతంతు. బయట జరిగే ఏ విషయాలూ చెప్పదు. ఆవిడ ఒక మౌన వీణ.

స్నానంచేసి భర్త గదిలోకి వెళ్ళి కూర్చుంటుంది. అక్కడ ఆమెకి ఎంతో ప్రశాంతత లభిస్తుంది. వాళ్ళు గడిపిన రోజులు గుర్తువస్తాయి. కన్నీళ్ళు కారుస్తుంది. ఆయన చూపించిన ప్రేమ అనుక్షణం గుర్తుకి వస్తూ ఉంటుంది.

ఈ జ్ఞాపకాలు చాలు. వీటిలో బతికేస్తాను అంటుంది. ఏవేవో మాట్లాడుతుంది. ఒక్కొక్కసారి ఆవిడకి ఆ రోజులు జరుగుతున్నట్లే అన్పిస్తాయి. మరిచిపోయి, బైటికే ఒకోసారి భర్తతో మాట్లాడుతున్నట్లే అంటుంది. "ఇలాగ వెక్కిరిస్తే నాకు కోపం వస్తుంది" అంటుంది. "చంటి ఏంచేశాడో చూశారా? " అంటుంది. ఆయన బ్రతికి ఉన్నట్లే మాట్లాడుతుంది. ఒక్కొక్కసారి అంతా గుర్తు వచ్చి "అయిపోయింది, అంతా అయిపోయింది, ఆరోజులకి ఇంత ఆయుర్దాయం తక్కువ అనుకోలేదు" అంటూ తల మోకాళ్ళమీద పెట్టుకొని ఏడుస్తుంది.

ఆ ఇంట్లో అతడు ఒక ప్రేక్షకుడు. తల్లి పెదవి విప్పి చెప్పకపోయినా ఆ కళ్ళ వెనకనున్న విషాదాన్ని, ఆమె పడుతున్న క్షోభను అర్థంచేసుకోగలడు. నెమ్మదిగా వెళ్ళి భుజం మీద చెయ్యివేసి, తీసుకొని వస్తాడు. లేదా బయట నిలబడి ఆవిడని చూస్తూ కన్నీరు కారుస్తాడు.

అతడికి లలితను చూస్తే ఆశ్చర్యం. ఎప్పుడూ ఏదీ కావాలని అడగదు. తండ్రి ప్రసక్తి ఎత్తితే తల్లి ఏడుస్తుందని భయం. చిన్నన్నా అంటూ వెనక వెనక తిరుగుతుంది. కృష్ణమోహన్ గదిలో తల్లి, లలిత ఒక మంచం, తను ఒక మంచంపై పడుకొంటారు. శాంతమ్మగారు, గౌరి ఇవతల పడుకొంటారు.

సాయంత్రం తల్లిని ఇంట్లో దింపాక కృష్ణమోహన్ చిరాకుగా అన్పిస్తే కాసేపు బయటకి వెడతాడు. 'నువ్వు కనపడకపోతే మాకు తోచదురా' అంటాడు సలీం. అందరూ నారాయణ కొట్టు దగ్గర కాసేపు కూర్చుంటారు.

కృష్ణమోహన్‌లో మునుపటి ఉత్సాహమే లేదు. యాంత్రికంగా మారిపోయిన ఫ్రెండుని చూసి వాళ్ళు బాధపడతారు. సలీం సైకిలుషాపు ఒకటి పెట్టుకొన్నాడు. నారాయణకి దగ్గరే అది. విజయ్ కృష్ణమోహన్‌తో కలిసి చదువుతున్నాడు.

ఎంతసేపున్నా నువ్వు అలాగ మౌనంగా కూర్చుంటే మాకు బావుండదురా అంటారు వాళ్ళు. ఒక్కొక్కసారి అతడు తన మనసు విప్పి వారిముందు పరుస్తాడు.

"అది కాదురా! నాకు ఎన్నో ఏళ్ళు వచ్చేశాయన్పిస్తోంది. ఇలాగ... ఇలాగ జరుగుతుందనుకోలేదు! అన్నలిద్దరూ అలా చేస్తారను కోలేదే. అమ్మేమో వాళ్ళకి ఎవరిచేతా చెప్పించలేదు వాళ్ళ నిర్ణయాన్ని మౌనంగా స్వీకరించింది. ఇంటి విషయాలు బయట పెట్టడం ఆమెకి చేతకాదురా

"నాన్నగారు పోవడం ఒక బాధ, అమ్మ బాధ చూడటం మరొక పెద్ద బాధ. మాకోసం ఏనాడూ నేను చూడని మా

అమ్మ బయటికి వస్తోంది. ఎలా హుషారు తెచ్చుకోను? జీతం తెచ్చి నాకు ఇస్తుంది. దాన్ని ఎలా ఆనందంగా ఖర్చు పెట్టను? ఆవిడని సుఖపెట్టాలి. బాగా, జాగ్రత్తగా చూసుకోవాలి. ఇదే నా లక్ష్యం! కానీ ఎలాగ?

"చెప్పండి. ఎలా హుషారుగా ఉండగలనురా? ఇంకా మీరున్నారు కనుక నా బాధ ఎప్పుడైనా చెప్పే అవకాశం ఉంది. అమ్మ ఎవరితో చెప్పుకొంటుంది? ఆ కళ్ళ వెనుక నున్న విషాదం, నవ్వడం మరిచిపోయిన ఆ మొహం చూస్తే నాకు ఏమీ తోచదు"

వాళ్ళు మౌనంగా అతడి మాటలు విన్నారు. నారాయణ అతడి భుజం ప్రేమగా నొక్కి, "ఇద్దరు అన్నలు దూరంగా ఉంటే ఏంరా? ఇందరం నీకోసం ఉన్నాం. మనం చాలమా? నువ్వు మాతో ఉంటే చాలురా? మేం బ్రతికెయ్యగలం" అన్నాడు.

వాళ్ళ ఆత్మీయతకి అతడు చలించిపోయాడు. "మా లలితమ్మ? నాన్నగారి దగ్గర బాగా చేరిక. ఆమధ్య చూడు ఎంత జ్వరం వచ్చిందో? అది బ్రతుకుతుందనుకోలేదు. మా అదృష్టం. బతికింది. దాని దగ్గర ఏం మాట్లాడకపోయినా గ్రహించేస్తుందిరా"

సలీం అన్నాడు "ఔనురా! లలితమ్మ చురుకైనది. మనం ఏదైనా కొనిస్తే ఎందుకన్నయ్యా అంటుంది. నిన్ను ఎలా చూస్తుందో, మమ్మల్ని అలాగ చూస్తుందిరా!"

ఫ్రెండ్స్ లలిత గురించిన కబుర్లలో పడ్డారు. వాళ్ళకి ఏదైనా సహాయం కావాలంటే, సలహా కావాలంటే అతడిని అడుగుతారు. అతడికి వాళ్ళ ఆత్మీయత చూస్తే తండ్రి గుర్తు వస్తాడు. ఎప్పుడూ తను వాళ్ళతో తిరుగుతాడని ఆయన తిట్టేవారు. ఈనాడు వాళ్ళే తమకి అడుగడుగునా

ఆసరా అవుతున్నారని ఆయనకి ఎలా తెలుస్తుంది?

ఎక్కడో అక్కడ తన జీవితం ప్రారంభం కావాలి. అది ఎక్కడో తెలియడంలేదు. చదువు అనే పేరుతో మిగిలిన సమయం ఖాళీగా గడపడం అతడికి నచ్చడంలేదు. తల్లికి వచ్చేది కొంచెం జీతమే. పెన్షనూ కొంచెమే. ఖర్చులు పూర్తిగా తగ్గించి వాళ్ళని ఇబ్బంది పెట్టలేడు. ఇందులోనే చిన్నన్నకి నెలనెలా పంపాలి కూడా.

ఇవన్నీ చెప్పి తల్లిని బాధ పెట్టలేడు. ఇంటిపనులన్నీ అతడు చూస్తున్నాడు. తల్లి పర్సులో డబ్బు కూడా అతడే పెడతాడు. ఏంచేయాలి? ఏంచేస్తే ఈ కుటుంబం నిలదొక్కుకొంటుంది?



**త**ల్లిని దింపి ఉదయంవేళ, బండిపాడైపోతే, కృష్ణ బాగుచేయించడానికి నడిపించుకొంటూ వస్తున్నాడు. తమ వీధిలోని తెలుగు లెక్చరర్‌గారు పక్కనున్న మేడమ్‌తో అంటున్నారు.

"నమ్ము నమ్మకపో సరళా! ఉదయం లేచిన దగ్గర్నుండీపని. ఆయనకి విజయవాడలో ఉద్యోగమా? అక్కడ ఉండరు. దగ్గరే కదా తిరుగుతానంటారు. ఇద్దరం బయటికి




వచ్చేవాళ్లమేనా? మగపిల్లలా? దూరంగా చదువులంటూ ఉండిపోయారు.

"ఫోను బిల్లు, కరెంటు బిల్లు, ఇంటిపన్ను రశీదులు, ఎన్నో పనులు. అసలు ఈ పనులు చేసే తీరిక ఉండదు. టైము ఎడ్జస్టు అవదు. ఒక్కొక్కసారి ఫైనుతో కడతాం. ఎవరైనా మనకి ఈ విషయంలో సహాయం చేస్తే బావుంటుంది. ఎవరు చేస్తారు?

"మా భార్యాభర్తలం నువ్వు చెయ్యలేవా? అంటే నువ్వు చెయ్యలేవా అంటూ తిట్టు కొంటాం. కూరలు కూడా సాయంత్రం ఈసురో అంటూ వెళ్ళి కొనుక్కొని తెస్తాం. ఏంచేస్తాం? ఆ వాడిపోయినవే తినడం"

పక్కనున్నావిడ సన్నగా నవ్వుతూ అంటోంది, "ఉద్యోగులైన స్త్రీలు సుఖపడతా రంటారుకానీ మన మొహాలు చూస్తే తెలు స్తుంది. పోనీ మానేద్దామా అంటే పిల్లల చదువులు, అవసరాలు కొండెక్కి కూర్చుం టున్నాయి"

ఇద్దరూ దూరమవడంతో వాళ్ళమాటలు దూరమయ్యాయి. కృష్ణమోహన్‌లో ఏదో ప్రకంపనం. వాళ్ళ మాటలలో ఒక వ్యాపకం అతడికి కన్పిస్తోంది. రెండు వాక్యాలు అతడి చెవులలో గింగురమంటు న్నాయి. అతడిని మేల్కొలుపుతున్నాయి.

ఎవరైనా ఈ విషయాలలో మనకి సహా యంచేస్తే ఎంత బావుంటుంది? కానీ ఎవరు చేస్తారు?

అతడు పదేపదే ఆ మాటలు మననం చేసుకొన్నాడు. అతడి పెదవులపై చిరు నవ్వు వెలిసింది. అతడు హుషారుగా బండిని షెడ్డుకి తీసికెళ్ళాడు.

★ ★ ★

ఆ సాయంత్రం అతడు తెలుగు మేడమ్ గారింటికి వెళ్లాడు. కాలింగ్ బెల్ నొక్కు తూంటే అతడి చేతులు వొణికాయి. వినా యకుడిని స్మరించి నమస్కరించుకొన్నాడు మనసులో.

తలుపు తీసిన మేడమ్‌గారు అతడివైపు ప్రశ్నార్థకంగా చూస్తూ, లోపలికి రమ్మని సోఫా చూపించారు.

కృష్ణమోహన్ కూర్చున్నాడు కానీ మాట రావడంలేదు. ఏదో తెలియని జంకు. ఏనాడూ ఎవరినీ అడగని బిడియం. విన్నాక ఏమంటారోననే సందిగ్ధం.

ఆవిడ నవ్వుతూ ఆ అబ్బాయిని చూశారు. తన చిన్న కొడుకు వయసు ఉంటుంది. "చెప్పుబాబూ! ఏంకావాలి?" అని అడిగారు.

అతడు మెల్లిగా నోరు విప్పాడు. "నేను చంద్రమౌళిగారి అబ్బాయినండీ! ఇంటర్ రెండవ ఏడాది చదువుతున్నాను"

ఆవిడ 'అయితే' అన్నట్లు చూశారు. ఇంజ నీరుగారు పోవడం ఆవిడకి తెలుసును. ఆ అబ్బాయిని జాలిగా చూశారు. అతడు తన జంకు వదలగొట్టుకొని, ధైర్యంగా అన్నాడు.

"ఉదయం, మీరు మరొక మేడమ్‌గారితో అన్నమాటలు విన్నానండీ! మీ మాటలు వినాలని వినలేదు. మీ వెనకాల బండి నడి పించుకొంటూరావడం వలన వినబడ్డాయి"

ఆవిడ కనుబొమలు ముడిపడ్డాయి. అతడు ఏం చెప్పదలచుకొన్నాడో ఆమె ఊహకి అందడంలేదు. లెక్చరర్ అవడంవ లన ఓరిమితో వాళ్ళ భావాలు బయటికి వచ్చేవరకూ వేచి చూడటం అలవాటేకదా! అందుకే అతడు ఏంచెపుతాడోనని చూడసా గింది.

"నేను మీకున్న బయటిపనులు చేసి పెడ తానండీ! నాకూ ఒక వ్యాపకంగా ఉంటుంది. మీకూ సహాయంగా ఉంటుంది. కొంచెం అలవాటైతే ఆ పనులన్నీ నేనే గుర్తు చేస్తాను. మీకు ఇబ్బంది లేకుండా సాయపడతాను"

ఆవిడకి కొంచెం కొంచెంగా విషయం అర్థ మైందిా?



చతుర... 99

"నాకు... నాకు పనికావాలండీ! అది చిన్న దైనాసరే. పెద్దదైనా సరే ఏదో ఒకటి చేసి నాకాళ్ళపై నిలబడాలనుకొంటున్నాను. మీకు తోచింది నాకు నెలకింత అని ఇవ్వండి. ఎంత ఇచ్చినా సంతోషమే. నాది అంటూ ఒక సంపాదన నాకు కావాలి"

ఆవిడ అప్రతిభురాలైపోయింది. ఎంత మంచి నిర్ణయం? జీవన పోరాటంలో అడుగుపెట్టడానికి చూపించే ఎంత మంచి దారవ? మొదటిసారిగా ఆవిడ బిడియంగా కూర్చున్న అతడిని పరీక్షగా చూసింది.

అతడికి పట్టుమని పాతిక ఏళ్ళయినా లేవు. కానీ అతడు తను బతుకుతూ, ఇతరులకి సాయపడాలని చూస్తున్నాడు. ఆవిడ వంటింట్లోకి వెళ్ళి రెండు కప్పులతో కాఫీ కలిపి పట్టుకొచ్చింది. నవ్వి అతడికి ఒకటిచ్చి, తను ఒకటి తీసికొంది. ఆపై ఏమీ మాట్లాడలేదు.

ఒక్కొక్కసారి మనుషులమధ్య మాటలు అవసరం లేదేమో? మౌనం మాటలకన్నా ఎక్కువసా యం చేస్తుంది. ఆవిడ లేచి వెళ్ళి కరెంటుబిల్లు, ఫోను బిల్లు, డబ్బు అతడి చేతిలో పెట్టింది.

అతడికి ఎంతో సంతోషం కలిగింది. వంగి ఆవిడ కాళ్లకి నమస్కారంచేసి, వాటిని అందుకొన్నాడు. గేటుతీసి వెళ్ళిపోతున్న అతడిని చూస్తూ, ఈ అబ్బాయి ఇక్కడితో ఆగడు. దూసుకొని పోతాడు. ఎంత ఎత్తుకి ఎదుగుతాడో ఊహించి చెప్పడం కష్టమే ననుకొంది.

అతడు ఆవిధంగా ఆరోజు నాలుగు ఇళ్లకే వెళ్ళాడు. వాళ్ళ వీధిలో ఒకాయన స్టేషన్ మాష్టారు, ఆయన భార్యకి ఎప్పుడూ ఒంట్లో బావుండదు. ఆయనకి పిల్లలంతా చిన్న వాళ్ళే. అతడు అదేవిధంగా ఆయన పనులు చేసి పెడతానని చెప్పాడు.

"ఈ పిల్లల కాన్వెంటు ఫీజులు, అవీ టైముకి వెళ్ళి కట్టలేక చస్తున్నానయ్యా! ఎప్పుడూ ఏదో ఒకటి కొనమంటారు. నువ్వు చెప్పిన పనులతోపాటు ఇవీ తీసుకో నాయనా! నన్ను సుఖపెట్టిన వాడవవు తావు" అన్నారాయన.

మరొకాయన గవర్నమెంటు హాస్పిటల్‌లో డాక్టరు. ఆయన భార్యకి పెరాలసిస్ స్ట్రోకు వచ్చింది. ఆవిడ మంచం మీదే ఉంటారు. ఆయనని మళ్ళీ పెళ్ళి చేసుకోమని గొడవ. ఆయనకి ఆవిడంటే ఎంతో ప్రేమ. నువ్వున్న పరిస్థితుల్లో నేనుంటే నువ్వు చేసుకుంటావా అంటారు. పిల్లలిద్దరూ దూరంగా ఉన్నారు. వాళ్ళ చదువులు వాళ్ళవి. వంటావిడను పెట్టుకొని రోజులు వెళ్ళదీస్తున్నారు.

ఆయన అతడిని ప్రేమగా కౌగలించుకొన్నారు. "ఈనాడు దేశానికి నీలాంటి నిజాయితీపరులు కావాలి. చిత్తశుద్ధి కొరవడుతున్న ఈ రోజుల్లో నీ పరిచయం నాకు తృప్తిగా ఉంది.

ఈవిడని వచ్చి మధ్య మధ్యలో చూస్తే చాలయ్యా! ఈవిడ దిగులుగా ఉంటే నాకు తోచదు. నాకా హాస్పిటల్ గొడవ. నీ పనులలో ఇదీ ఒకటనుకో. మా అబ్బాయివనే అనుకొంటాను"

మరొక ఇల్లు షాహుకార్లది. ఆ ఇల్లే ఒక ఊరులాగ ఉంది. ఆయన నవ్వి, "నీపని చూస్తానయ్యా! నాకు నచ్చితే ఇంకా అదనపు పనులు అప్పచెపుతాను. మాది ఉమ్మడి పురం. కాస్త పొలాల విషయం, ఇంటద్దె విషయం కూడా చూసిపెట్టాలి. మాకు ఈ ఊర్లో రెండు ఇళ్ళున్నాయి. వాళ్ళు టైముకి వచ్చి అద్దె ఇవ్వరు. నేనా పనుల బిజీతో వెళ్ళలేను" అన్నాడు.

కృష్ణ ఆనందంగా ఇంటికి వచ్చాడు. అతడి ఆనందం చూసి శాంతమ్మగారు ఆశ్చర్యపోయి కారణమడిగారు. "అన్నింటికీ కారణాలుంటాయాండీ" అన్నాడు. సర్లే, అతడే చెపుతాడనుకొన్నారామె.

# ఏరిన ముత్యాలు

* తన జ్ఞాపకాలతో జీవించే వ్యక్తి వృద్ధుడవుతాడు. భవిష్యత్ ప్రణాళికలతో జీవించే వ్యక్తి యువకుడుగా ఉంటాడు.

  –డా. బి.ఆర్. అంబేద్కర్

* మాట్లాడేటప్పుడు ప్రజల భాషలో మాట్లాడాలి. ఆలోచిస్తున్నప్పుడు మాత్రం మేధావుల ఒరవడిని అనుసరించాలి.

  –అరిస్టాటిల్

* నిజమైన స్నేహితుడు మనసు విప్పి మాట్లాడుతాడు. చక్కని సలహానిస్తాడు. కష్టాల్లో ఆదుకుంటాడు.

  –విలియన్ పెన్

* పాతలో ఉన్న మంచిని ఆధారం చేసుకొని చెడును విసర్జిస్తూ ముందుకు సాగిపోవడం ఉత్తమ మానవుని లక్ష్యం.

  –కారల్‌మార్క్స్

* సరిదిద్దకుండా వదిలేసిన తప్పును మించిన ఆపద ఇంకొకటి లేదు.

  –స్వామి వివేకానంద

* పుస్తకాలు దీపాలవంటివి. వాటి వెలుతురు మనలోని మాలిన్యం అనే చీకటిని తొలగిస్తుంది.

  డా॥ బి.ఆర్. అంబేద్కర్

* ప్రతీ ఒక్కరూ మానవాళిని మార్చాలనే ఆలోచిస్తారుగానీ తమను తాము మార్చుకోవడం గురించి ఆలోచించరు.

  –లియోటాల్‌స్టాయి

* జీవితం అంటే ఒక సమస్యనుంచి మరొక సమస్యకు ప్రయాణం మాత్రమే! ఏ సమస్యాలేని జీవితం అంటూ ఉండదు.

  –గౌతమబుద్ధుడు

* నీ ప్రతీమాటను, చర్యను పొగిడేవారినికాక నీ పొరపాట్లను హెచ్చరించే వారి గురించి ఆలోచించు.

  –సోక్రటీస్

* వివేకశూన్యుడైన మిత్రుడు వివేకవంతుడైన శత్రువుకంటే ప్రమాదం.

  –షేక్స్‌పియర్

* ఆవేశాన్ని, అహంభావాన్నీ, వంచనా దృష్టిని జయించలేనివాడే కట్టుబానిస.

  –మహావీరుడు

* నా మతం సైన్సు. జీవితాంతం నేను దానినే ఆరాధిస్తాను. పూజిస్తాను.

  –సి.వి. రామన్

సేకరణ : కూనపల్లి మల్లేశ్వరరావు

మర్నాడు అతడు మరి కొంతమంది ఇళ్ళకి వెళ్ళాడు. అతడు ఆ చుట్టుపక్కల వీధులన్నీ తనపనికి కేంద్రంగా తీసుకొన్నాడు. ఆ వీధులలోని వాళ్ళ గురించి మొదట వివరాలు తెలుసుకొనేవాడు. తన అవసరం ఉంటుందను కొనే ఇళ్లకే వెళ్ళేవాడు.

పనుల ఒత్తిడి ఎక్కువగా ఉండేవాళ్లని, భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలలో ఉండేవాళ్లను, వృద్ధులయిపోయి తమవాళ్ళకి దూరంగా ఉన్నవాళ్లను ఎక్కువగా కలిసేవాడు. వాళ్ళ దగ్గర అతడిపని సులువుగా అయ్యేది.

ఇదీ ఓ ఉద్యోగమే అనుకొంటే అతడికి ఎనలేని తృప్తిగా ఉంది. సాయంత్రం స్నేహితులను కలిసినపుడు తను ఎన్నుకొన్న పనిని గురించి చెప్పాడు. వాళ్లు కాసేపు ఆశ్చర్యంతో ఉండిపోయారు.

విజయ్ ఎంతో సంతోషంతో అతడి చేతులు పట్టుకొని, "మాకు తెలుసు, కృష్ణ మెదడు ఊరికే ఉండదని. మేమందరం చిన్నాచితకా బ్రతుకులవాళ్ళమని తెలిసే, నువ్వు మాతో స్నేహంచేశావు. మాలో ఒకడయ్యావు. ఈ నీ గర్వంలేని ప్రవర్తనే మమ్మల్ని నీకు మరింత దగ్గర చేసింది" అన్నాడు.

సలీం అయితే "బ్రదర్, చెప్పు. నువ్వు ఏంచెయ్యమంటే అది చేస్తాం. మేమంతా నీవెనుక ఉన్నాం. మా తమ్ముడున్నాడు. వాడిని నువ్వు నీచేతికింద ఉంచుకో! హుషారుగా ఉంటాడని నీకు తెలుసుకదా" అన్నాడు.

ప్రసాద్ "మాకు కూడా తలోపనీ అప్పచెప్పు నాయనా! నీకింద పనిచేయడం మాకు సరదాయే. నాలుగు రోజులు నువ్వు కనబడకపోతే మేం బోరు ఫీలవుతున్నాం" అన్నాడు.





తమ వీధి చివరనున్న గర్ల్స్ హైస్కూల్ హెడ్‌మిస్ట్రస్‌గారి ఇంటికి వెళ్ళాడు. ఆవిడ భర్త రైల్వేలో టి.సి.గా పనిచేస్తున్నారు. వాళ్ళూ అతడికి స్నేహితులే అయ్యారు.

కొత్తగా రెండిళ్ళ అవతల ఓ ఆఫీసర్ గారు వచ్చారు. వాళ్ళూ ముగ్గురు ఆడపిల్లలతో సందడిగా కన్పిస్తూంటారు. ఆవిడ మాత్రం డల్‌గా ఉంటుంది.

వాళ్ళ రెండో అమ్మాయి మాధవి పెద్దమ్మాయి రమ. మూడవ అమ్మాయి లక్ష్మి. అతడు వెళ్ళి అందరిలాగే వాళ్ళనూ అడిగాడు. ఇంట్లో ఉన్నది అమ్మాయిలుకదా బయట ఏం తిరగగలరు? ఎలా పనులు తెములుతాయి? అంటూ...

అతడు విషయం చెప్పగానే మాధవి నవ్వుతూ అంది. "మా బద్ధకాలు మీకు ఉద్యోగం కల్పిస్తున్నాయన్నమాట"

అతడు తెల్లబోయినట్లు చూశాడు.

"అవును. మరి ఎవరి పనులు వాళ్ళు చేసుకోవడం మంచిదికాదా? మీరే చెప్పండి" అందామె.

అతడు తలగోక్కున్నాడు. అమ్మాయిలతో మాట్లాడటం ఈమధ్య అలవాటు తప్పిపోయింది. ఆ అమ్మాయి తెలివైన దానిలాగ కన్పిస్తోంది.

"మన పనులు మనం చేసుకోవడం మంచిది" అతడు మన స్ఫూర్తిగా అన్నాడు. "అయితే ఈ బిజీకాలంలో భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలు చేస్తోంటే, ఎలా అవసరమైన పనులు నిర్వహించగలరు. నాలాంటి వాళ్ళు చిన్న సహాయం చేస్తే వాళ్లకి ప్రాణం హాయిగా ఉంటుంది కదా"

ఆ పిల్లల తల్లి వాళ్లని ఆపుతూ, "మనకి వీలైతే ఆ అబ్బాయికి ఔనని చెప్పాలి. లేదా కాదనాలి" అంది.

మాధవి నవ్వుతూ, "చెప్పండి. మీరు మాకు ఎలా సాయపడగలరు? ఉదాహరణకి మాకు కొత్త సినిమా చూడాలని

ఉంటుందనుకోండి. మీరు టిక్కట్లు సంపాదించి తెచ్చి ఇవ్వగలరా? మా పంచదార కోటా విడిపించి తేగలరా? "

తల్లి ఆ అమ్మాయిని మందలిస్తున్నట్లు చూసిందిగానీ ఆ అమ్మాయేం ఖాతరు చేయకుండా "ఉండుమమ్మీ! మన సందేహాలు తీర్చుకోవాలికదా" అంది.

అతడికి ఒళ్ళు మండిపోయింది. అతడి మొహంలో మారుతున్న రంగులను చూస్తూ నవ్వుతూ, "ఇంట్లోపనివలన నేను స్కూలుకి త్వరగా వెళ్ళలేకపోయాననుకోండి మీరు నాకు లిఫ్టు ఇచ్చి మా స్కూలు దగ్గర దింపగలరా? "

అతడు ఈ పిల్ల ఆడపిల్లా? ఆటంబాంబా అనుకొన్నాడు. " పంచదార కోటా, కూరలు అయితే ఫర్వాలేదు. కానీ అంతకుమించి నావలన అవదు" అనేశాడు.

"అమ్మయ్యో, మాకున్న ముఖ్యపనే సినిమాల సమస్యే. ఎలా? " విచారంగా చూపుడు వేలు బుగ్గన పెట్టుకొని అంటున్న ఆ పిల్ల కళ్ళల్లో వద్దన్నా చిలిపితనం తొంగి చూస్తోంది.

ఇంక ఊరుకోలేక వాళ్ళ అమ్మగారు "బాబూ! నేను నీకు రేపు ఏ విషయం చెప్తాను" అన్నారు.

"నువ్వు ఉండమ్మా, నాలుగు విషయాలు మాట్లాడుతోంటే తొందర పడతావు. కనుక్కోకపోతే ఎలా? "

"సినిమాలు నీకు ముఖ్యమైన విషయాలా? " తల్లి అంది.

"కావా? నువ్వయితే మగపిల్లవాడు పుట్టలేదని దిగులుతో ఇంట్లో మగ్గిపోతావు. మా సంగతి చూశావా? అందుకే సినిమా టిక్కట్లు కావాలని అడుగుతున్నాను"

వెళ్ళిపోతున్న అతడు వాళ్ళ మాటలు వింటూ నవ్వుకొన్నాడు.

జీతం విషయం కూడా తమాషాగానే కుదిరిపోయింది. వాళ్ళు మొదట్లో కొన్ని పనులే అనుకొన్నారుకానీ మంచివాడు, మనవాడు, బుద్ధిమంతుడు అయిన కుర్రాడు సాయపడుతోంటే నాలుగు విషయాలూ అతడి దృష్టికి తెచ్చి అడిగేవారు.

బ్యాంకులోంచి డబ్బు డ్రా చేసి తెచ్చిపెట్టడం, బిల్లులు కట్టిపెట్టడం, కోటా విడిపించి ఇవ్వడం, మంచి పళ్ళు, కూరలు సమయానికి తెచ్చి ఇవ్వడం, గేస్ సిలెండర్లు ఇండెంట్ పెట్టడం మొదలైన పనులు అతడికే చెప్పడం మొదలుపెట్టారు. అతడు కూడా అరమరిక లేకుండా వాళ్ళతో కలిసిపోయాడు.

కృష్ణమోహన్ వలన ఇళ్ళల్లో దెబ్బలాటలు తగ్గిపోయాయి. సమయానికి కరెంటు బిల్లు, ఫోను బిల్లులు, ఆర్డీలు కట్టెయ్యడంతో మగవాళ్ళు తేలికగా ఊపిరి పీల్చుకొన్నారు.

సాధారణంగా కాలేజీ అవర్లలో ఏది ఖాళీ ఉన్నా అతడు పనులకి కేటాయించేవాడు. కోటా, కూరలు, పళ్ళు అలాంటివి ఉదయం వేళ తెమిలిపోయేవి. కోటా సాయంత్రం అయినా ఫర్వాలేదు.

అతడికి సాయంగా సలీం తమ్ముడు రహీం ఉండేవాడు. ఇచ్చిన రసీదులు జాగ్రత్తగా ఆ ఇళ్ళకి అందించేవాడు. కృష్ణమోహన్ చదువుకి ఆటంకం లేకుండా రహీం సాయంతో ఈజీగా పనులు నిర్వహిస్తున్నాడు.

డబ్బు ఎంత ఇవ్వడం అన్నది వాళ్ళ నిర్ణయానికి వదిలేయడం అతడు చేసిన మంచి పని, తెలివైనపని. ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు విజయలక్ష్మి మేడమ్‌గారిని "మీరు ఏంఇవ్వదలచుకొన్నారు" అని అడిగారు.

ఆవిడ నవ్వింది. "ఒక వంటావిడ మన ఇంటికి వచ్చి ఒకరోజు వండితే వంద రూపాయలు తీసుకొంటోంది. అలాంటిది ఒక అబ్బాయి తను మనస్ఫూర్తిగా నిర్ణయం మనకే వదిలినప్పుడు జాగ్రత్తగా ఆలోచించ

వలసిన అవసరం మనమీదే ఉంది" అంది.

"అయితే ఓ వంద ఇద్దామా? " పక్కావిడ గబుక్కున అనేసింది.

విజయలక్ష్మిగారు నవ్వి, " కూరలు, పళ్ళు లాంటివి కూడా తెమ్మనమని అడిగారా? " అన్నారు.

ఆవిడ తల ఊపింది.

"మొదట మనమనుకొన్నవి కొన్నే, తర్వాత ఇంకొన్ని చెప్పినా ఆ అబ్బాయి కాదనలేదు. అందుకే నామటుకు నేను ఆలోచించుకొని నా పనుల్నిబట్టి మూడువందలు ఇద్దామనుకొంటున్నాను"

వాళ్ళు ముందు మాట్లాడలేదు. ఆవిడే అన్నారు, "మనం బ్యాంక్ పనులుచేస్తే గంట టైమవుతోంది. క్యూలో నిల్చోడం చాలా చోట్ల తప్పడంలేదు. ఆర్డీలు కట్టడం అలాంటిదే. కనుక మనం పడే శ్రమ అతడు పడుతున్నాడు. మనపిల్లాడిలాంటి వాడు కనుక కొంచెం ఎక్కువ అనుకొన్నా తప్పులేదు. ఇవ్వవచ్చుననినా అభిప్రాయం"

అలాగ చాలామంది వంద చొప్పున ఇవ్వడం మొదలెట్టారు. కొందరు రెండొందలు ఇచ్చినా అతడు ఏమీ అనకుండా పుచ్చుకొన్నాడు. వాళ్ళ నిర్ణయానికే వదిలేశాడు. సంగతి తెలిసి విజయలక్ష్మిగారి కాలేజీ లెక్చరర్లు "మీ వీధుల వరకే అతడు పరిమితి విధించుకోవడం ఎందుకు? సిటీ అంతా పెడితే అందరం సంతోషిస్తాం కదా? " అన్నారు.

అన్నపూర్ణకి ఈ విషయం కొద్ది రోజులు గడిచాకగానీ తెలియదు. ఆవిడ కొడుకు గడ్డం పుచ్చుకొని "ఎందుకు చదువు పాడు చేసుకొని ఇవన్నీ పెట్టుకొంటావు. వద్దు, నామాట విను. నువ్వు కష్టపడితే చూడలేను" అన్నారు. అతడు తల్లికి ఎలా నచ్చ చెప్పడమా అని చూశాడు.

ఆవిడకి ఏడుపు వచ్చింది. ఒక ఇంజనీరు కొడుకు సామాన్యమైన పనులకి సిద్ధపడటం, తను కళ్లారా దాన్ని చూడవలసి రావడం ఆమెకి కష్టం కలిగించాయి.

తను పరీక్షలు బాగా రాస్తానని, చదువు గురించి బెంగవద్దని, తను పనిచేయడం తప్పుగా భావించడం లేదని, ఎందరో యువతీయువకులు పార్టుటైమ్ ఉద్యోగాలు చేస్తూ చదువు సాగిస్తున్నారు. కనుక పని చేయడం తప్పుకాదని అతడు తల్లికి చెప్పాడు.

"అమ్మా! ఈ ప్రపంచంలో ఏపనీ హీనమైందికాదు. నిజాయితీగా నేను బతుకుతూ, నాలాంటి నలుగురికి మార్గం చూపించాలనుకొంటున్నాను. నాదంటూ ఒక ప్రపంచాన్ని సృష్టించుకోనీ! నేను కాస్త స్థిరపడితేమాత్రం నువ్వు ఉద్యోగం మానెయ్యాలి. అమ్మా, నీవు చెల్లి సుఖంగా ఉంటే నాకు చాలు"

ఆవిడ అతడి మాటలతో కదిలిపోయింది. "నీ బిడ్డ దేహీ అని భిక్ష అడుక్కోవడం లేదమ్మా! ఇతరుల అవసరాలకి సహాయపడుతూ, అందులో తన బ్రతుకు వెతుక్కొంటున్నాడు. నన్ను అర్థంచేసుకొని ఆశీర్వదించమ్మా" అన్నాడు.

అన్నపూర్ణ కళ్ళు ఒత్తుకొంది. "చంటీ! నీకు లోకం గురించి తెలియదురా! వీటిలో ఉండే సాధకబాధకాలు నువ్వు ఎదుర్కోగలిగితే నేను చెప్పేది ఏముంది? "

గౌరి ఉత్సాహంగా అతడి దగ్గరికి వచ్చింది. "చిన్న బాబూ! కోటా పనులు నేను చేసిపెడతానులెండి. మీరు చిన్నచిన్నవి నాకు కూడా చెప్పండి" అంది. ఇంటి పనులు త్వరగానే తెములుతాయి. లలిత స్కూలుకి వెళ్ళిపోతే దానికి ఇంట్లో ఖాళీయే.

అన్నట్లుగానే కోటాపనులు గౌరి తీసుకొంది. అది హాయిగా రిక్షాలో వేసుకొని తెచ్చి వాళ్ళకి అందించేది. రిక్షాలో రమ్మనమని కృష్ణే చెప్పాడు.

★ ★ ★





ఉగాది పండుగ. లోకం అంతా ఉత్సాహంగా జరుపుకొంటున్న పండుగ. తండ్రికి పండుగలంటే ఎంతో ఇష్టం. ఆయన ఉండగా ఎంత సందడో? కృష్ణమోహన్ ఇంట్లో ఎక్కువసేపు ఉండలేక బయటికి వచ్చేశాడు.

కాలేజీ ఆడిటోరియంలో ఆ దినం "కవిసమ్మేళనం" జరుగుతోంది. అతడు, ప్రసాద్ అటువెళుతూ ఆ సందడి గమనించి లోపలికి వెళ్లారు.

తండ్రి ఎప్పుడూ "మనసుకి ఆహ్లాదం కలిగించేవి కళలే పూర్ణా" అనడం ఆ సమయంలో గుర్తు వచ్చింది. మనసుని ఎటో ఒకవైపుకి మరల్చకపోతే తండ్రి జ్ఞాపకాలు మరీ బాధిస్తున్నాయి.

పంచాంగశ్రవణం చక్కగా సాగింది. కృష్ణమోహన్‌కి ఆ ఏడాది బాగుందనే అనుకున్నాడు. జరగవలసిన నష్టం ఏదో అవనే అయింది. ఇంక ఏమైనా లెక్క ఏమిటి అని మనసులో అనుకున్నాడు.

ఉగాది కవితలు చాలామందే చదువుతున్నారు. అతడికి వాళ్ళు కొందరు రిపిటీషన్‌తో చదవడం చూస్తే నవ్వు వచ్చింది. స్టేజ్ ఎక్కడమే చాలన్నట్లు రెండేసి పేజీలు రాసి తీసుకొనివచ్చి శ్రోతల సహనానికి పరీక్ష పెట్టడం మంచిదా? వాళ్ళు మాత్రం ఎవరినీ పట్టించుకోకుండా, ఎటూ చూడకుండా మైక్‌ని వదలమని ప్రతిజ్ఞ చేసి నవాళ్ళలాగా చదివేస్తుంటారు.

ప్రసాద్‌కి అవన్నీ వింటూ కూర్చోవడం కష్టంగా ఉంది. వెళ్ళిపోదామని గొడవ పెడుతుంటే "వచ్చాం కదురా. మధ్యలో వెళితే ఏం బావుంటుంది? కాస్త ఓపిక పట్టరా" అని కృష్ణమోహన్ నచ్చచెప్పాడు.

నిత్యదారిద్ర్యం- నిర్వీర్యం చేస్తోంటే

అరాచకం - అవినీతి ప్రజ్వరిల్లుతోంటే

గూండాలు -ఘరానాలు రాజ్యం ఏలుతుంటే

అన్యాయం పెరిగి - అక్రమాలు జరిగి

పేదగుండె పగిలి - పగతో రగిలి

కేపిటలిజాన్ని నగ్నంగా - నడిరోడ్డున నిలబెడుతుంది.

సమ సమాజస్థాపనకు విప్లవశంఖం పూరిస్తుంది. అని ఒకాయన స్వీయ కవితా గానం చేస్తుంటే శ్రద్ధగా విన్నాడు.

అతడికి ఆ కవిత ఎంతో నచ్చింది. తన భావాన్ని ఎంత సూటిగా చెప్పారు? ఎంతో తక్కువ సమయం తీసుకొని, ఎంతో విలువైన విషయం చెప్పారనుకున్నాడు. మిగిలినవాళ్ళలో మరో ఇద్దరివీ అతడికి నచ్చాయి.

మీటింగ్ అయ్యాక అతడు శ్రీనివాసరావు గారిని కలిశాడు. నిరాడంబరంగా ఉండి, ఆత్మీయతతో మాట్లాడే ఆయన అతడికి నచ్చారు. "కవిత్వం అంటే నాకు తెలియదు. కానీ సమాజానికి, మానవుల నిత్యజీవితానికి సన్నిహిత సంబంధం గల కవిత్వం అయితే బావుంటుందనిపించింది" అన్నాడు.

శ్రీనివాసరావుగారు సన్నగా నవ్వారు. "మీలో ఆవేశం ఉంది. ఈ సమాజం గురించి ఆలోచించే తపన ఉంది. అందుకే ఈ కవితలు ఇష్టపడగలిగారు. మనం స్నేహితులమవడానికి ఈ అభిరుచులు కలవడం చాలనుకుంటాను"

ఆవిధంగా వారిద్దరిమధ్యా స్నేహం పెరిగింది. అప్పుడప్పుడూ ఆయన ఇంటికి వెళతాడు. ఇద్దరూ సాహిత్యం గురించి మాట్లాడుకుంటారు. కృష్ణ మాట్లాడడు. ఎక్కువగా వినడానికి ఇష్టపడతాడు.

"ఈ సమాజం దోపిడీ వ్యవస్థ అయిపోయింది. ఎక్కడ చూసినా అవినీతి, అక్రమాలే. అధర్మం విలయతాండవం చేస్తోంది. పేదలు ఈ సమాజపు ఇనుపకాళ్ళకింద నలిగిపోతున్నారు. వాళ్ళ భవిష్యత్ ప్రశ్నార్థకమే? " అని ఆయన అంటూంటే విషాదంగా ధ్వనించింది.

"మరి మీలాంటివారు ఈ సమాజాన్ని మేల్కొలపవచ్చు కదా! సమాజానికి హితం చేయవచ్చుకదా" అన్న కృష్ణ మాటలకి ఆయన నవ్వారు. "అందుకే కవితామార్గం ఎంచుకున్నాను. ఆ సమస్యల గురించే రాస్తున్నాను. ఇంకా ఏదైనా చెయ్యాలంటే నువ్వు చెప్పు, చేస్తాను"

అతడి స్నేహంలో కృష్ణమోహన్ సాహిత్యపరంగా ఎదుగుతున్నాడు. ఖాళీ సమయం ఏ కాస్త దొరికినా పుస్తకపఠనంలో గడుపుతున్నాడు.



ఓసారి తండ్రికి సంబంధించిన కాగితాలు ఏవో కావాలనీ, అవి ఉంటే డబ్బు ఏదో రావలసినది ఇస్తారని ఆఫీస్‌వాళ్ళు చెపితే, అతడు తండ్రి కాగితాలు వెదకసాగాడు. ఆ సమయంలో అతడికి రేవతి ఉత్తరం ఆయన డైరీలో కన్పించింది.

అతడికి వెంటనే తండ్రి తల్లి లేనపుడు దిగులుగా ఉండటం, తను ఆయన గదిలో పడుకోవడం గుర్తువచ్చింది. అతడు తండ్రిని అంత చలింపచేసిన ఆ ఉత్తరం ఏమిటా అని చదవసాగాడు. ఉత్తరం పూర్తి చేసిన అతడు చాలా సేపటివరకూ తేరుకోలేకపోయాడు. ఏవో ఆలోచలను చుట్టుముట్టాయి.

తండ్రి జీవన విధానం అతడికి కొంతవరకూ తెలుసును. తల్లికి ఇష్టం లేకపోవడం, ఆవిడ సున్నితంగా తన అయిష్టాన్ని తెలియ చేయడం అతడికి గుర్తు ఉంది. ఆయన బహుశ మారదామనుకున్నవేళకి, తను నిజాయితీగా ఉందామనుకునేవేళకి ఈ జీవితమే అయిపోయింది.

అతడికి ఎంతో విషాదంగా అన్పించింది. ఏ డబ్బు ఆయనకి తృప్తి కలిగించిందో అది తమకి మిగలలేదు. ఈనాడు తల్లి, తను ఇలాగ బతుకుతున్నారంటే ఆయన ఆత్మ ఎంత బాధపడుతుందో?

అతడికి రేవతంటే ఎంతో గౌరవం పెరిగింది. బంధువుల రాకపోకలు తగ్గించినా ఆమె మానలేదు. ఇదివరకటికన్నా ఎక్కువ వచ్చేది. తమ కష్టసుఖాలు విచారించేది. అతడికి ఆమెను చూడాలన్పించింది. తనే ఒకసారి వెళ్ళి రావాలనుకున్నాడు.



★ ★ ★

పరీక్షలు తృప్తిగా రాశాక, తన ఆలోచనలను అతడు అమలు జరపడం మొదలుపెట్టాడు. చక్కటి బోర్డుమీద "ఉయ్ ఫర్ యు" అని రాయించాడు. దాన్ని ఇంటి పైభాగంలో అందరకూ కన్పించేలాగా ఆకర్షణీయమైన రంగులతో అమర్చాడు.

సెలవలకి ఇంటికి వచ్చిన నందు తమ్ముడి పనులు చూసి ఆశ్చర్యపోయాడు. "బావుందిరా. మాకన్నా నువ్వేనయం. మా చదువులయ్యాక సంపాదించేది, మానేదీ అప్పుడు తెలుస్తుంది. నువ్వయితే ఇప్పుడే సంపాదిస్తున్నావు" అని మనస్ఫూర్తిగా అన్నాడు.

వేణు స్టేట్స్ వెళ్ళే తేదీ నిర్ణయమైపోయిందని రాశాడు. తండ్రి సంవత్సరీకాలయ్యాక బయల్దేరాలని ఆగడంవలన ఆలశ్యమైపోయింది. అతడు వెళ్ళేముందు ఒకసారి

రమ్మనమని తల్లి రాయించింది.

ఇంటికి వచ్చిన వేణు ఒంటరిగా రాలేదు. తనతోబాటు చదువుకున్న దీప్తి అనే అమ్మాయిని వెంటపెట్టుకుని వచ్చాడు. అన్నపూర్ణ మొదట స్నేహితురాలని అనుకుని మర్యాదలు చేసింది.

నాలుగురోజులు గడిచాక వేణు ఆ అమ్మాయిని తమ కుటుంబసభ్యులకి చూపించడానికి తీసుకొని వచ్చానని, తామిద్దరూ ప్రేమించుకున్నామని, పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నామని చెప్పాడు.

తల్లి ప్రమేయం లేకుండా వేణు ఇలాంటి నిర్ణయం తీసుకోవడం అందరికీ కష్టమే కలిగించింది. "ఎంతో కష్టపడి చదువు చెప్పించారు. ఇంటి బాధ్యతలైనా చూడకుండా పెదబాబు ఇలాగ చేయడం నాకు నచ్చలేదు" అంది శాంతమ్మగారు నిర్మొహమాటంగా.

"ఇద్దరికీ స్టేట్స్ కలిసి వెళ్ళే అవకాశం వచ్చిందమ్మా? ఇద్దరం ఒక ఇంటివాళ్ళమై వెళితే బావుంటుందని వచ్చాం. దీప్తి నాన్నగారు రెండురోజులలో వస్తున్నారమ్మా" అన్నాడు వేణు.

దీప్తి తండ్రి వచ్చే సమయానికి అన్నపూర్ణ బావగారిని, తన అన్నగార్లను పిలిపించింది. రేవతి, ప్రియంవద, రాజ్యలక్ష్మి వచ్చారు. దీప్తి నలుపుగా ఉన్నా కళ అయిన పిల్లే.

ప్రియంవద అన్నపూర్ణతో దెబ్బలాడింది. "బయటి సంబంధాలు చేసుకుంటే లక్షల కొలదీ కట్నం వస్తుంది. ఈ నల్లటి పిల్లను ఎందుకు చేసుకోవడం? కోడలు నలుపైతే కులమెల్లా నలుపనే సామెత కూడా ఉంది" అందామె.

"నీ అమాయకత్వం చూసుకొని వాళ్ళు నాటకాలు ఆడుతున్నారు. ఇలాంటి స్నేహాలు ఉండబట్టే సంపాదన వచ్చినా ఇంటికి పైసా ఇవ్వలే"దని నిష్ఠూరాలాడింది.

"స్టేట్స్ వెళితే కంపెనీ ఎంత ఖర్చుపెట్టినా, మనకంటూ డబ్బు వద్దా? అందుకే అక్కడ దాచాను" మొహం గంటుపెట్టుకుని చెప్పాడు వేణు.

అన్నపూర్ణ స్పష్టంగా చెప్పింది, "వదినా! మీ తమ్ముడు రెండు చేతులతో సంపాదించారు. బంధువుల కోసమని, స్నేహితుల కోసమని ఎలాగ ఖర్చు చేశారో మీకు తెలుసును.

"ఆయన ఎంతో నమ్మకంతో స్నేహితుడికి పెళ్ళి విషయంలో సహాయం చేస్తే, కూతురి పెళ్ళిచేసుకొని ఏడాదైనా ఆయన అప్పు తీర్చలేదు. మీ తమ్ముడు ఏదో సందర్భంలో అడిగితే నాకు ఎప్పుడు అప్పు ఇచ్చారని బుకాయించారుట. ఈయన ఎంత వాదించినా ప్రయోజనం లేకపోయిందిట. తగాదా విన్నవాళ్ళు ఏ నోటూ రాయించకుండా ఎందుకంత అప్పు ఇచ్చారని ఈయననే తిట్టారుట.

"అలాగే విజయవాడలో స్థలం ఉంటే బావుంటుందని కనుక్కోవడానికి వెళితే అపార్టుమెంటు బేరానికి వచ్చిందని మరొక ఫ్రెండు చూపించారు. ఈయన పిల్లలకి రెండుమూడు చోట్ల ఆస్తి ఉంటే బావుంటుందని డబ్బు ఇచ్చివచ్చారు. తర్వాత చూస్తే అపార్ట్‌మెంట్ కోసం ఆయన డబ్బు ఖర్చుపెట్టారు కానీ అది మనకోసంకాదు. తనపేరుమీద కొనుక్కున్నాడు. అదేమంటే వాళ్ళ వాళ్ళు ఈ డబ్బుతో మనకి కొంటే బావుంటుందన్నారుట. తన తండ్రి ఉండగా ఇల్లు కొని చూపించాలని మీ డబ్బు వాడుకున్నాను. నెమ్మదిమీద తీరుస్తానన్నారు. వెళ్ళినప్పుడు రెండువేలు, మూడువేలు చేతులలో పెడుతుంటే ఈయన ఎంత విసిగిపోయారో? ఈయన పోయాక ఆయన అసలు ఇవ్వడమే మానేశాడు.

"ఆయన డబ్బు సంపాదిస్తే మాకు ఏం మిగిలింది? నాకు ఆ డబ్బు ఎలా వచ్చిందో

అలాగే పోయిందన్పిస్తుంది. వీళ్ళ విషయం కూడా అంతే! నాకు పెద్ద ఆశలులేవు"

అన్నపూర్ణ మాటలకి ప్రియంవద నీ ఖర్మ అనుకుంది. వేణు కట్నం పుచ్చుకోనని అన డంతో పెళ్ళి బాగా చేయమని ఊరుకున్నారు. వాళ్ళు కూడా పెళ్ళి బాగా చేశారు.

పిల్లలిద్దరూ కాళ్ళకి నమస్కరిస్తోంటే అన్నపూర్ణ భర్తను తలుచుకొని బాధపడింది. మంచో, చెడో వాళ్లకి నచ్చిన పని తప్ప మరొకటి చేయడం తనకిరాదు.

పదహారు రోజుల పండగయ్యాక వాళ్ళు స్టేట్స్ వెళ్ళిపోయారు. పెద్దవాడు వెళ్ళిపోతుంటే అన్నపూర్ణ ఎంత ఏడ్చిందో "రెక్కలు వచ్చాక ఇంకా నీ దగ్గర ఉంటారా తల్లీ" అని శాంతమ్మగారు ఓదార్చింది.

ప్రియంవద తన కూతురిని నందుకు ఇస్తానంది. కట్నం బదులుగా అల్లుడికి హాస్పిటల్ కట్టి ఇస్తానంది. నందు కళ్ళకి ఆవిడ దేవతలాగా కన్పించింది. తనచదువు పూర్తవకుండానే వాగ్దానం చేస్తున్న అత్తంటే అభిమానం కలిగింది.

కృష్ణమోహన్ కల్పించుకోకుండా ఉండలేక పోయాడు. "హాస్పిటల్ స్వంతంగా కట్టించుకోవాలనుకుంటే కట్టించుకుందాం. నాన్నగారి పేరు పెడదాం. అంతేకానీ దానికోసం వాళ్ళ ఊర్లో, వాళ్ళ దగ్గరే ఉండిపోనక్కరలేదు. మరొకరకంగా చెప్పాలంటే ఇది ఇల్లరికం సంబంధం అవుతుంది"

అన్నపూర్ణ వదినగారిని చూస్తూ "లలితను కిరణ్‌కి చేసుకుంటానన్నారుకదా! మళ్ళీ నందుది కూడానంటే కుండమార్పిడి అవదా? " అంది.

ప్రియంవదకి మరదలు ఎప్పుడు కూతురు ప్రస్తావన ఎత్తుతుందా, తన అభిప్రాయం చూచాయగానైనా చెప్పవచ్చుకదా అని ఎదురు చూస్తోంది. ఇప్పుడవకాశం తనంతట తానేవచ్చింది.

"ఏం చేయను చెప్పు. ఎంత చెప్పినా కిరణ్ విన్పించుకోవడంలేదు. నేను ఎం.సి.ఏ. చదువుదామనుకుంటున్నాను. తను చూస్తే నెమ్మదిగా ఉంటుంది. నాతో పాటు పెద్ద చదువులు చదవకపోతే ఎలాగ అంటున్నాడు. వాడికి రాంక్ కూడా వచ్చిందని మీకు తెలుసుకదా" అంది.

అన్నపూర్ణ నివ్వెరపోయింది. పిల్లవాడు డిగ్రీ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాడని సరదాపడ్డారు. లలిత అత్త ఒళ్ళోనే పడుతుందనీ, ఆ పిల్ల గురించి బెంగ అక్కరలేదనీ తను ఎంతగానో అనుకుంది ఇప్పుడు ఇలాగ అంటుందేమిటి?

అయినా నచ్చచెపుతున్నట్లు అంది, "అది స్వభావరీత్యా నెమ్మది. చదువుమాత్రం బాగానే చదువుతుంది. మీరు దాన్ని చేసుకుంటారు, నాకు బెంగ ఉండదనుకున్నాను. నామీద అభిమానం ఉంచి, మీ తమ్ముడి గురించైనా మా పిల్లని చేసుకోండి" ఆమాటలంటోంటే ఆవిడ కళ్ళల్లో నీళ్ళూరుతూనే ఉన్నాయి.

"అక్కయ్య వట్టినే అంటోంది. చిన్నప్పటి నుంచీ అది అంటున్న సంబంధమే కదా! మా తమ్ముడిచేత వియ్యపురాలననేగా అన్ని మర్యాదలు పొందింది. నువ్వు ఎలా అనుకుంటావోనని తమాషాగా అంది. అంతే కదా" రేవతి నవ్వుతాలుగా తీసివేయబోయింది.

ప్రియంవద మొహం కంద గడ్డలాగా పెట్టుకొంది. "ఇలాంటి విషయాల్లో ఎవరైనా తమాషాలు చేస్తారేమిటి? కిరణ్‌కి ఇష్టంలేనిదే నేను ఎలా చేయను? వాడు మా ఇద్దరి స్వభావాలూ నప్పవు. వద్దంటున్నాడు"

రేవతి కూడా దానితో సీరియస్‌గా అయింది. "మరి ఇన్నాళ్ళూ ఎలా నప్పిందీ? తమ్ముడు బతికి ఉంటే నప్పేదా? " అంది.

కానీ ఎవరు ఎన్నిరకాలుగా అన్నా ప్రియంవద ఆ పెళ్ళి జరగదంది. ఆవిడకే తండ్రిలేని పిల్లని చేసుకోవడం ఇష్టంలేదని అర్థమైపోయింది. పోనీ ఇద్దరి పెళ్ళిళ్ళూ కుండమార్పిడిగా చేద్దామన్నా ఆవిడ కట్టుబ డలేదు. "మా పిల్ల బావను ఇష్టపడుతున్నా నంటే చెప్పాను. చేస్తే నందు పెళ్ళి చెయ్యండి లేకుంటే లేదు" అంది.

వాళ్ళు వెళ్ళాక అన్నపూర్ణ ఏడుస్తూ కూర్చుండిపోయింది. భర్త పోయాక ఎదుర వుతున్న ఈ ఎదురుదెబ్బలు ఆమె తట్టుకో లేకపోతోంది.

కృష్ణమోహన్ తల్లి దగ్గరికి వచ్చాడు. ఆవిడ అలాగ ఏడవడం అతడికి నచ్చలేదు. ఇంకా అమ్మ కళ్ళల్లో కన్నీళ్ళు ఎక్కడ దాగి ఉన్నాయి?

"అమ్మా మనం ఒకవిధంగా చూస్తే అదృ ష్టవంతులం. ప్రియంవదత్త మనల్ని ఆశల బుట్టలో పెట్టకుండా ఇప్పుడే చెప్పేసింది. ఎంతమంచి విషయం ఇది"

అన్నపూర్ణ కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ "మంచి విషయం అని అంటావేంట్రా? లలి తను ఎక్కడో ముక్కూ మొహం తెలియని చోట ఇవ్వగలమా? పైగా నాన్నగారు అను కున్న సంబంధం ఇది"

అతడు ఆవిడను జాలిగా చూశాడు. "తను అర్థాంతరంగా చనిపోతాననుకు న్నారా నాన్నగారు? బంధు ప్రీతితో ఎన్నో సదుపాయాలు చేశారు. వాళ్ళు వదిలేస్తార నుకున్నారా? అన్నింటికన్నా స్నేహితులు మోసం చేస్తారనుకున్నారా? నీకైనా తెలి యాలనే చెబుతున్నానమ్మా!

"అనుకోనివి అన్నీ అయినపుడు, ఇది ఒక్కటీ అవకూడదా? చెల్లికూడా ఆ ఇంట్లో క్షణక్షణానికీ మారే ఆవిడ దగ్గర ఏం సుఖ పడుతుంది? "

కొడుకు మాటలూ సమంజసమన్పించినా, లలితను ఎలా బయటకు పంపడం, తను ఆ పిల్ల పెళ్ళి చేయగలదా అన్పించింది.

శాంతమ్మగారు మాత్రం ఈ సంబంధం తప్పడమే మంచిదంది.

కృష్ణమోహన్ నందుని తొందరపడి ఎవ రికీ మాట ఇవ్వవద్దని హెచ్చరించాడు. అయినా అతడికి చిన్నన్నయ్య స్వభావం అర్థం అవదు. తన చెల్లిని చేసుకోనని అన్న వాళ్ళ ఇంటికి తాను అల్లుడుగా వెళ్ళడమే మిటి?

నందు ఉన్నాడని తెలిసి అన్నపూర్ణ రెండవ అన్నయ్య వచ్చాడు. బాంకులో ఉద్యోగమని అతడికి కాస్త గొప్ప ఎక్కువ. భార్య తెలివితేటలతో కూడబెట్టే డబ్బు, అత్త వారు చేసే సహాయం ఆయనని బాగానే నిలబెట్టాయి.

"ఒరే నందూ! మన మణిని నీకుఇచ్చి పెళ్ళి చేయాలని మీ అత్త అభిప్రాయం. మాకు అదొక్కతే ఆడపిల్ల. నీకిచ్చి వివాహం చేసి, మా చెల్లి చేతిలో దాన్ని పెడితే మాకు బెంగ ఉండదు. మా డబ్బు మా పిల్లలిద్ద రికీ కదురా" అతడు ఏక బిగిన ఇటు చెల్లితో, అటు మేనల్లుడితో విషయం చెప్పే శాడు.

ప్రియంవద వచ్చి వెళ్ళిన విషయం తెలుసు. అందుకే "అదయితే ఎదురు సంబంధంరా, పైగా మన లలితమ్మని కాద న్నవాళ్ల నీడ మనకెందుకురా? మా మణి చక్కగా చదువుకుంటోంది. బావుంటుంది"

అతడు చెప్పిన దగ్గర్నుంచీ నందు మనసు అటూ, ఇటూ ఊగసాగింది.

అన్నపూర్ణకి ఇన్నాళ్ళూ అందరి స్వభా వాలూ తెలిసేదికాదు. భర్త నీడలో నిశ్చిం తగా బతుకు సాగింది. ఈనాడు అందరూ నందుకోసం తాపత్రయపడుతున్నారు తప్ప లలిత గురించి ఆలోచించడంలేదు. వీట న్నింటివలన ఆవిడ మరింత నిర్లిప్తంగా తయారయింది.



కృష్ణమోహన్‌తో అన్నపూర్ణకి ఒక చిక్కు

వచ్చింది. ఇంటర్ ఫస్ట్ క్లాసులో పాసైన వాడు పై చదువులకు వెళ్ళనంటాడు.

ఏదో తను బయటికి వెళ్ళి సంపాదిస్తున్నాడనీ, బాధపడుతున్నాడనీ, వుయ్ ఫర్ యు సంస్థ పెట్టి చుట్టుపక్కలవాళ్ళకి ఏదో సాయపడుతున్నాడని తను ఊరుకుంది. అయినా వద్దని చెప్పినా వాడు వినకపోతే తను ఏం చేస్తుంది.

ఇదివరకటిలాగా అల్లరిచిల్లరిగా తిరగడం లేదు కదా అనుకుంది. కానీ వాడు బయట చదువులకి వెళ్ళనంటే ఆవిడ మనసు ఎంతో ఆవేదన పడసాగింది. ఏం చేయడమా అని మధనపడసాగింది.

ఆవిడ మరోసారి అనునయంగా కొడుకుతో చెప్పింది "అన్నలిద్దరూ పై చదువులు చదివి, పెద్ద ఉద్యోగాలు చేస్తోంటే నువ్వు ఇలాగ ఊళ్ళో ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ ఉండిపోతావా? నాన్న ఆత్మ బాధపడదా? నా మాట విను. చక్కగా టెస్ట్లు రాసి ఏ ఇంజనీరింగో, డాక్టరో చదువు"

కృష్ణమోహన్‌కి విసుగు వచ్చింది. ఎన్నిసార్లు తన అభిప్రాయం చెప్పినా ఆవిడ పాతపాటే పాడుతుంది. "అమ్మా ఇంజనీరింగ్, డాక్టరు చదువులే చదువులా. మిగిలినవి కావా? నేను చదువుకోవడమేగా నీకు కావాల్సింది. నేను ప్రైవేట్‌గా చదువుకుంటాను. తెలిసిందా? ఏ చదువులైనా ప్రైవేట్‌గా చదువుకునే సదుపాయం ఉంది. నేను డిగ్రీచేసి, యం.బి.ఏ. చదువుతాను. కానీ అన్నీ ఇంటిదగ్గర్నుండే కరస్పాండెన్స్ కోర్సులతో చదువుతాను. మిమ్మల్ని వదిలి ఎక్కడో ఉండి చదవడం నా వలన కాని పని"

అతడంత ఖచ్చితంగా చెప్పేసరికి ఆవిడకి కష్టం కలిగింది. "అసలు నీకు ఈ సంపాదనమీద యావ బయలుదేరింది. అందుకే వెళ్ళనంటున్నావు. చదువయ్యాక ఇవి చేయవచ్చుకదా"

కృష్ణమోహన్ ఇంక ఆవిడతో తర్కించలేదు. అది ఆవిడకి అర్థమవదు. బయట లోకాన్ని తెలుసుకోవడం వలన సగం చదువు, జ్ఞానం మాత్రమే కలుగుతాయి. విద్యవలన మాత్రమే మిగిలిన జ్ఞానం లభిస్తుంది. తనకి మాత్రం చదువుకోవాలని లేదా? తండ్రి ఆశయం తనకి తెలియదా?

తల్లిని, చెల్లిని పట్టించుకోకుండా ఉండటం, వాళ్లచేత ఇంకా డబ్బు ఖర్చు పెట్టించడం అతడికి నచ్చడంలేదు. పైగా ఈ సంస్థను అభివృద్ధి చేయాలని, పదిమందికి పని కల్పించాలని తను ఆలోచిస్తున్నాడు. తను ఒక్కసారి తన ఆలోచనలను అమలులో పెట్టలేడు.

అతడు తల్లిని తండ్రి బ్రతికి ఉన్నంతవరకూ ఎంతో ఆనందంగా చూశాడు. ఈనాడు ఆవిడలో నిరాశ, నిస్పృహ తాండవిస్తున్నాయి. వీణను తాకడమే మానేసింది. నిరుత్సాహం, విషాదం మూర్తీభవించినట్లున్న ఆవిడను ఎలా వదిలెయ్యగలడు? లలిత ఒక్కర్తీ ఈ పరిసరాలలో ఎలా ఉంటుంది? తను ఉంటే కొంత వాళ్లకి సందడి.

తను జీవితంలో త్వరగా నిలబడాలని చూస్తున్నాడు. ఉత్సాహం ఉన్నప్పుడే ఏ పనైనా చేయాలి. తల్లి తన ప్రాణం. ఆవిడ దగ్గరుండే తను ఏ పని అయినా సాధించాలి.

విజయ్, ప్రసాద్, సలీం వగైరా స్నేహితులందరూ వస్తే అతడు "ఈ పని పూర్తిచేసి వస్తాను. పదండ్రా" అంటే వాళ్ళు వినకుండా పెరట్లోనే నిలబడిపోయారు. కాకర పాదుని పైకి ఎక్కించడానికి అతడు ప్రయత్నిస్తున్నాడు. మొక్కలపని చూడటం మొదట్లో మొక్కుబడిగా అన్పించినా, ఇప్పుడు అది అతడికి ప్రాణమైపోయింది.

ఉదయమో, సాయంత్రమో వాటిదగ్గర కాసేపు గడుపుతాడు. శీతాఫలం చెట్టు




ఫలాలను ఇస్తోంది. జామచెట్లు రెండూ బోలెడు పళ్ళు ఇచ్చాయి. కూరలు, పువ్వులు మొక్కలు అన్నీ పెంచసాగాడు. వాళ్ళు కూడా అతడికి సాయం చేస్తూ మాట్లాడసాగారు.

"మన గోవిందు వాళ్ళ నాన్నగారు ఇల్లు నడపలేనని గొడవ పెడుతున్నారుటరా. గోవిందు పరీక్ష పాసైనా పై చదువు తనవలన కాదంటున్నారుట. అటు తమ్ముళ్ళు తెమలలేదు. ఇటు కొడుకు బాధ"

విజయ్ మాటలకు సలీం నవ్వుతూ "ఇల్లు ఎందుకు నడపాలిరా? ఉన్నచోట ఉంచకూడదా? " అన్నాడు.

విజయ్ అతడిని చిరాకుగా చూసి "చీదేసిన సిసింద్రీలాంటి జోకువేశావులే" అనేసి, "నా మాటలసలు నువ్వు వింటున్నావురా? " అన్నాడు కృష్ణమోహన్‌ను చూస్తూ.

"అతడికి మనం ఏదైనా పని కల్పించాలిరా. పాపం వాడు తెగ బాధపడిపోతున్నాడు."

కృష్ణమోహన్ సలీంను చూస్తూ "రహీం రోజూ కూరలు తేవడానికి వంతెన దగ్గరికి వెళుతున్నాడుకదురా" అన్నాడు.

విజయ్‌కి చిరాకువేసింది. అతడికి కోపం ముక్కుమీద ఉంటుంది. "ఏహే... ఎందుకలా చిటపటలాడుతావు. వాడు చెప్పేది వినవచ్చుకదా" అంటున్న సలీంను విసుగ్గా చూసి, "నేను ఒకటి చెపితే, వాడొకటి మాట్లాడుతుంటే ఎలాగరా? నాబాధ అర్థమైనట్లులేదు"

గోవిందు నోరుతెరిచి అన్నాడు. "నాన్నగారు రోజూ మాకందరికీ తిండి పెట్టలేక విసుగు చూపిస్తున్నార్రా? చిన్నాన్నలను ఏ పనిలో పెట్టినా నాలుగురోజులకే వచ్చేస్తారు. అందరిమీద కోపం నాపై చూపిస్తున్నారు. నాకు ఇల్లంటే విసుగు వస్తోంది"





కృష్ణమోహన్ విజయ్‌ను చూస్తూ చేతులు కడుక్కొంటున్నవాడు నవ్వుతూ అన్నాడు, "సలీం, మన నారాయణ కొట్టుపక్కన ఖాళీ స్థలం కొంతుంది. అక్కడ గోవిందు కూరలు, పళ్ళవ్యాపారం చేస్తే బావుంటుంది కదురా. ఇటు రహీంగాడికి దగ్గరలో కూరలు సప్లై అవుతాయి. ఉదయమే మన వాళ్ళకి అందచేయవచ్చును, అటు వాడు బతకవచ్చును"

వాళ్ళు ఆశ్చర్యపోయి వినసాగారు. వాడి బుర్ర కంప్యూటర్‌దిలాగుంది. ఒక పనికి రెండులాభాలు.

సలీం అతడివైపు సంతోషంగా చూశాడు. గోవిందు మాత్రం "నేను పెట్టుబడి ఎక్కడ తేగలను" అన్నాడు. తండ్రి పరిస్థితి తెలిసి అంత డబ్బు అడగలేదు.

కృష్ణమోహన్ అన్నాడు, "నేను పెట్టుబడి పెడతానురా. వచ్చినదాంట్లో ఒకవంతు నాకిచ్చి రెండువంతులు నువ్వు తీసుకో. నన్ను మాత్రం ఆ విషయాలకి లాగకు. దాన్ని అభివృద్ధి చేసే పని నీదే"

"అయితే మేం కొనుక్కునే కూరలు కూడా మీకు లాభం తెచ్చిపెడుతున్నాయన్నమాట. బావుంది" ఎప్పుడు వచ్చి నిలబడిందో, తమ మాటలు విందో మాధవి నవ్వుతూ అనగానే అతడు తుళ్ళిపడ్డాడు. ఈ మహాతల్లి ఎప్పుడు దయచేసింది అనుకున్నాడు.

అతడు రాయించిన బోర్డువైపు వేలు చూపిస్తూ, "'వుయ్ ఫర్ యు' అని బోర్డు రాయించిననాడే అనుకున్నాను, మాకోసం మీరుకాదు, మేం మీకోసమని. ఊ చెప్పండి. ఇంకా మీ ఫ్రెండ్స్ చేత ఏయే వ్యాపారాలు చేయిస్తారు మేం తొడుక్కునే డ్రస్సులా? మేం వాడేక్రీములా? మీ మెదడులో వచ్చే తర్వాత ఆలోచన చెప్పండి? "

ఈ మధ్య మాధవికి తల్లితో, చెల్లితో పరిచయం పెరిగింది. కాస్తయినా గర్వం లేకుండా ఇంటికి వచ్చి నవ్వుతూ మాట్లాడే ఆ పిల్లను ఇంట్లోవాళ్ళు ఆత్మీయంగా చూడసాగారు

విజయ్ నవ్వుతూ అన్నాడు,"మీ నోటిచ లవ వలన మాకందరికీ మంచి భవిష్యత్ ఏర్పడితే మేం పెట్టేవన్నీ మీకు ఫ్రీగా ఇస్తాం"

కృష్ణమోహన్ ఆమెవైపు చూసి, "చెప్పండి. ఏ సినిమాకి వెళ్దామనుకుంటు న్నారు? " అన్నాడు.

మాధవి కినుకగా చూసింది. అందరితో అంత సరదాగా కబుర్లు చెపుతాడు. తనని చూస్తే పక్కా బిజినెస్‌టైప్.

"భక్తప్రహ్లాద"

అతడు చురుక్కున తల ఎత్తాడు. ఆమె చిలిపిగా నవ్వుతూ "ఊ అదే సినిమా చూద్దామనుకుంటున్నాను" అంది.

వెంటనే సలీం అందుకున్నాడు, "ఈ కాలం అమ్మాయిలు భక్తప్రహ్లాద, లవకుశ చూడటం ఒకటా? "

"ఈ కాలం అబ్బాయిలు అలాంటివి చూడటానికి వచ్చినపుడు అమ్మాయిలు చూస్తే తప్పేమిటి? " ఆమె సూటిగా ప్రశ్నిం చింది.

కృష్ణమోహన్ అయిపోయానురా నాయనా అనుకున్నాడు. ఆమధ్య శాంతమ్మ గారు 'లవకుశ' సినిమా వస్తే చూస్తాన న్నారు. తల్లిని కూడా బయలుదేరదీద్దామని తనూ వెళ్ళాడు. ఈ మహాతల్లికి ఎలా తెలి సిపోయిందో? ఇప్పుడు లవకుశ సంగతీ ఎత్తేసింది.

"మాధవీ..." అన్నపూర్ణ పిలవడంతో మాధవి అటు తిరిగింది. "ఈ పూలు పెట్టు కోమ్మా" అంటూ కనకాంబరాలు, మరువం కలిపి కట్టిన దండతెచ్చి యిచ్చింది.

"మన ఇంట్లో పూసిన పూలేనాంటీ? " ఆమె ప్రశ్నకు "అవునమ్మా, మన పెరట్లో పూస్తే కడుతున్నాను. నువ్వు వచ్చావు. నీకు ఒకటి, లలితకి ఒకటిగా రెండు ముక్క లుచేశాను"

"ఆంటీ! ఈ పూలు మీరు మీ అబ్బాయి ఎదురుగా ఇవ్వవద్దు. వీటినీ ఎలా సద్విని యోగపరచాలా అని ఆలోచించేస్తారు"

వింటున్న కృష్ణమోహన్ ముఖం ఎర్రబ డింది. "అందరూ బంగారు చెంచాలు నోట్లో పెట్టుకుని పుట్టరు. బాధ్యతల బరువు మీద పడినపుడు తెలుస్తుంది" అతడు కసిగా అనుకున్నాడు. మారు మాట్లాడ కుండా స్నేహితులను తీసుకొని బయటకు వెళ్ళిపోయాడు.

అందరూ నారాయణ కొట్టుపక్కన పిచ్చా పాటీ మాట్లాడుకుంటూ కూర్చున్నారు. సలీం మాటలమధ్యలో ఫ్రెండ్స్‌ను చూస్తూ అన్నాడు, "ఒరేయ్! మనవాడి వీక్‌నెస్ తెలి సిపోయింది"

విజయ్ "ఏమిటిరా! చెప్పు. మేమూ అవ సరమైనపుడు ఏడిపిస్తాం? " అన్నాడు.

"ఏరా! చెప్పనా" సలీం నవ్వుతూ కృష్ణను చూస్తూ అన్నాడు.

"ఒరేయ్! ఈ పూట మీకు ఏ కాలక్షే పాలూ దొరకలేదా? నన్ను పట్టుకున్నారు" అన్నాడతడు వాతావరణం తేలికచేయాలని.

సలీం అతడిని వదలలేదు. "వీడు మనం దరినీ హడలగొడతాడా? వీడిని హడలగొ ట్టేవాళ్ళు ఉన్నారురా? వాళ్ళను చూస్తే చాలు ఒకటే పరుగు".

విజయ్ నవ్వుతూ, "ఔనురా! ఇన్ని కబుర్లు చెప్పేవాడివి. ఆ అమ్మాయి అన్ని అంటూంటే మాట్లాడవేం? ఒకసారి గట్టిగా జవాబు ఇస్తే మళ్ళీ నీ జోలికి వస్తుందా? "

"గట్టిగా జవాబు ఇవ్వడమా? వేసుకొన్న పొడుగాటి రెండుజడల్లో, ఒకటి పెట్టి కొట్టిం దంటే, మనవాడు మన దగ్గర పడాలి" సలీం కళ్ళు చికిలిస్తూ అన్నాడు.

"నోర్ముయ్యండిరా! పిచ్చి వేళాకోళాలు చేస్తే ఊరుకోను" అతడు ఫాంట్‌కు అంటిన దుమ్ము దులుపుకుంటూ లేచాడు.

ప్రసాద్ నవ్వుతూ "ఆ అమ్మాయి తరచుగా మీ ఇంటికి ఎందుకు వస్తోందిరా? " అడిగాడు.

"బావుంది. మా చెల్లికోసం రావచ్చుకదా"

సలీం నవ్వుతూ అతడిని అనుకరిస్తూ "నీకోసం కూడా రావచ్చుకదా? " అన్నాడు.

అతడు తీవ్రంగా అన్నాడు, "నోరు మూసుకోండిరా! నా జీవితం చూస్తే ఆటగా ఉందా? ఒకమ్మాయి సరదాగా మన దగ్గరికి వస్తే ఏవేవో అనడమేనా? "

సలీం కూడా ఏమీ తగ్గలేదు. "మన దగ్గరికి అనకు. నీ దగ్గరికి వచ్చింది. మేమంతా ఎదురుగా ఉన్నా, మావైపు చూడదు. నీవైపే చూస్తూ మాట్లాడుతుంది. అసలు విషయం ఏమిటంటే... "

"ఇంక మీరు ఊరు కొంటారా? నన్ను వెళ్ళి పొమ్మన్నారా? నా ఆలోచనలు ఎప్పుడైనా అడిగారా? జీవితంలో నేను బాగా పైకి రావాలి. మా అమ్మగారిని కంటికి రెప్పలాగ చూసుకోవాలి. అంతేకాదు వన్ సిటింగ్‌లో డిగ్రీ పరీక్షలు వ్రాద్దామనుకొంటున్నాను. పై చదువులు చదవకపోతే అమ్మకి తృప్తి ఉండదు. ఆవిడ అన్నయ్యలతో నన్ను పోల్చుకొంటుంది.

"ఒకరితో ఒకరిని పోల్చడం మంచిది కాదన్నా ఆవిడ వినదు. చెల్లికి మేం మంచి సంబంధం చూసుకోవాలి"

వాళ్ళు అతడి ఆలోచనలను పంచుకొంటున్నట్లు ఉండిపోయారు. అతడు వాళ్ళను సాలోచనగా చూస్తూ,"మనల్ని శ్రీనివాసరావుగారు ప్రైవేటుగానైనా చదువుకోమంటున్నారు. ఆయన అభిప్రాయం కూడా కరక్టేనన్పిస్తుంది"

సలీం వెంటనే అన్నాడు, "నువ్వు చదువుకోరా! నాకు మాత్రం మరి అటు కోరిక లేదు. నేను లేకపోతే మా హోటల్ మూతపడుతుంది.

తర్వాత అందరూ 'ఉయ్ ఫర్ యూ'కి సంబంధించిన కబుర్లు చెప్పుకొన్నారు. కృష్ణమోహన్ మేడమ్‌గారితో ఆమె ఫ్రెండ్స్ అన్న మాటలు వారికి చెప్పాడు. "నెమ్మదిగా దీన్ని విస్తృతపరచాలిరా! మొత్తం ఉజ్జాయింపుగా అనుకొంటే మూడు బ్రాంచిలుగానీ నాలుగు బ్రాంచిలుకానీ సరిపోతాయి"

వాళ్ళు ఆలోచనగా అంటున్న అతడిని విస్తుపోయి చూడసాగారు. "మనవాళ్ళయిన వాళ్ళని, చురుకున్న వాళ్ళను తీసుకొందాం. ఒక్కొక్కటి చొప్పున ప్రారంభిద్దాం. తొందరపడవద్దు.

"ఇంటికి ఇంత అని రీజనబుల్‌గా డబ్బు అడుగుదాం. నా దృష్టిలో ముసలివాళ్ళకి, భార్యాభర్తలు ఉద్యోగం చేసేవాళ్ళకి మనం బాగా ఉపయోగపడతాం"

విజయ్ అనుమానంగా చూస్తూ అన్నాడు. "మనం ఇంత ప్రయత్నం చేయగలమా? "

కృష్ణమోహన్ నవ్వాడు. నవ్వుతూంటే అందంగా కన్పిస్తున్న అతడి పలువరసను మైమరచి చూశారు. ఇంత అందమైనవాడు కనుకనే ఆ అమ్మాయి అలా తిరుగుతోంది అనుకొన్నారు.

"భయపడేవాళ్ళు ఏ పనీ చేయలేరురా! మనమేకదా. ప్రయత్నం చేద్దాం. దీనిలో మనం పెట్టే పెట్టుబడి ఏం ఉంది? ఇందులో పోవడానికి మనకేం లేదు. శరీర శ్రమ తప్ప. ఇది బాగా సాగుతుందని నా నమ్మకం. ధృడంగా అంటున్న అతడిని వాళ్ళు నమ్మకంతో చూశారు.

సలీం వెంటనే అన్నాడు, "చెప్పాం కదురా! మంచైనా, చెడైనా నీతో ఉంటాం. మా నాన్నను హోటల్ చూసుకోమంటాను. నేనూ నీతో ఉంటాను"

దూరంగా కూర్చుని వాళ్ళ మాటలు వింటున్న ఒకతను వచ్చి అన్నాడు, "బాబూ!




పోస్టుమేన్‌గా పనిచేసి రిటైరయినాను. చాలీచాలని జీతం. ధరలు చూస్తే ఆకాశం అంటుతున్నాయి. మాలాంటివాళ్ళకూ కాస్త చోటు కల్పించవచ్చుకదా"

కృష్ణమోహన్ ఆ వ్యక్తి మాటలకి సాలోచనగా చూశాడు. తర్వాత ఇంటికి వచ్చినా తను చేయబోయే పని గురించే ఆలోచించ సాగాడు.



రేవతి వచ్చిందంటే అతడికి సంబరం. "అత్తా! ఎప్పుడు వచ్చావు? " ఆమెను చూస్తూ ప్రేమగా అడుగుతాడు. "ఉదయం నువ్వు బయటికి వెళ్ళినప్పుడే వచ్చాను. లోపలికి వెళ్ళి చూడు. నీకోసం ఎవరో వచ్చారు" అతడు ఒక్క ఉదుటున లోపలికి వెళ్ళాడు. లోపల రేవతత్త కొడుకు శ్రీనివాసు కన్పించాడు. "వాసూ" అంటూ అతడిని ప్రేమగా పిలుస్తూ చేతిని అభిమానంగా నొక్కాడు.

శ్రీనివాసు ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ ఆఖరి ఏడాది చదువుతున్నాడు. మృదుస్వభావి. మనిషి మాత్రం హుషారుగా ఉంటాడు.

"నువ్వేమిటి బావా! ఇలాగ పెద్దమనిషి తరహాలాగా తయారయ్యావు. నువ్వేదో 'బావా! ఎప్పుడు వచ్చితీవు' అంటూ కృష్ణుడి ఫోజులో అడుగుతావనుకొన్నాను. అయితే అమ్మ చెప్పిందంతా నిజమేనన్నమాట"

కృష్ణమోహన్ అతడి మాటలకు నవ్వుతూ "అమ్మ నా గురించి ఏం చెప్పింది? " అన్నాడు.

అతడు తల్లివైపు, కృష్ణవైపు చూసి నవ్వుతూ, "నువ్వు చాలా పాడైపోయావుట. ఇల్లు పట్టకుండా తిరుగుతున్నావుట"

రేవతి కొడుకు దగ్గరికి వచ్చి చేయి పట్టుకొంది. "ఏరా మాకు మాకు తగాదా పెడదామనా? నేను ఏం చెప్పానురా? "

అతడు తల్లి మాటలకు నవ్వుతూ, చేతిని తప్పించాడు. "మన ఇద్దరి మధ్యా ఎవరూ తగాదాలు ఎప్పుడూ పెట్టలేరు అత్తా! మనుష్యులు ఒకరికి ఒకరు తెలియకముసుపు వేరు. మనసులు తెలిసి దగ్గరయ్యాక ఆ భగవంతుడు కూడా వేరు చేయలేడు" దృఢంగా అంటున్న అతడి మాటలకి రేవతి అభిమానంగా చూసింది. "కృష్ణా! ఎంత ఎదిగిపోయావురా. డిగ్రీ ఫస్టు క్లాసులో పాసయ్యావంటే అభినందించడానికి రాకుండా ఉండలేకపోయానురా! ఎప్పుడు నిన్ను చూస్తానా అన్పించింది"

శ్రీనివాసు నవ్వుతూ అన్నాడు. "ఇదిగో అమ్మ ఇదే చెప్పింది. ఇలాగే పెద్ద మాటలు ఆడుతున్నావుట. ముసలివాడులాగా ఉన్నాడురా. నాల్గు తిట్టి చిన్నవాడిని చేయి అంటే వచ్చాను"

ఆరోజంతా అందరూ సరదాగా ఉన్నారు. కృష్ణ తన సాధక బాధకాలు ఆవిడతో చెప్పాడు. "ఏవిటిరా! ఊరంతా నీ పేరు మారుమోగుతోందిట" అందామె.

"బావుందత్తా! ఎక్కే గుమ్మం, దిగే గుమ్మం అయితే చెప్పుకోరా? " అతడు తేలికగా నవ్వుతూ అన్నాడు, "ఇలా నిలదొక్కుకోవడానికి ఇన్ని సంవత్సరాలు పట్టిందత్తా!

మీరు నాన్నకి వ్రాసిన ఉత్తరంలోని ప్రతి అక్షరం నిజం. నిజాయితీగా, మన కాళ్ళ మీద నిలబడితే వచ్చే తృప్తివేరు. నాకు మీరే స్ఫూర్తి" అతడు మెరిసే కళ్ళతో అన్నాడు. "జీవితం ఒక పోరాటం. పోరాడ టమే మన వంతు అన్నారు. అదే ఆచరిస్తు న్నాను"

రేవతి అతడి దగ్గరగా వచ్చి అతణ్ణి గుండెకి హత్తుకొని తలపై ముద్దు పెట్టు కొంది. ఆ స్పర్శ అతడికి ఎంతో ఉత్సాహా న్నిచ్చింది.

"కృష్ణా! నేను నీకు ఒక మంచి ప్రెజంటే షన్ తెచ్చానురా. ఈ బహుమతి నీకు ఎంత ఉత్సాహాన్నిస్తుందో నాకు తెలుసురా! అందుకే బాగా ఆలోచించి తెచ్చాను"

అతడు ఆమెవైపు విచిత్రంగా చూశాడు. బహుమతా? నాకా? ఏమిటై ఉంటుంది? అయినా ఆమె ఆశీస్సులకన్నా మించిన బహుమతి ఏముంటుంది?

రేవతివైపు అన్నపూర్ణ ఆసక్తిగా చూస్తోంది. భర్త ఉన్నప్పుడు, లేనప్పుడు ఈ వదినగారు ఒకలాగే తమయందు ప్రవర్తిం చింది. బతుకంటే భయం వేసిన తమకి ధైర్యం చెప్పింది. వెన్నుతట్టి నిలబెట్టింది.

"కృష్ణా! వీడిని, వాసుని నీకు బావగా కానుక ఇస్తున్నానురా" ఆమె తన కొడుకుని చూపిస్తూ అంది.

"అవునురా! నా తమ్ముడి కూతురు కోడ లుగా నా ఇంటికి వచ్చి దీపం పెట్టడంకన్నా నాకేం కావాలి? వాడి ఆత్మ ఎక్కడున్నా శాంతిస్తుంది. ఇంతకీ ఈ నల్లబావ లలితకి నచ్చితేనే సుమా!" రేవతి తల్లిపక్కగా కూర్చున్న లలితను చూస్తూ అంది. లలిత సిగ్గుతో తలవంచుకొంది.

అన్నపూర్ణ రేవతి చేతులు పట్టుకొంది. "వదినా... నేను అంత అదృష్టవంతురా లనా? నా బిడ్డను నువ్వు ఒడిలోకి తీసు కొంటావా? ఎలా నీ రుణం తీర్చుకోను?" ఆవిడకి ఎంతో ఏడుపు వచ్చింది. ఊహిం చని ఆ ఔదార్యం ఆవిడని కుదిపివేస్తోంది.

"ఆయన పోయారు. పచ్చటి జీవితం కొడిగట్టిపోయింది. పెద్ద వదిన వచ్చారు. నందు చేసిన పనికి తిట్టారు. వీడు... వీడు ధైర్యం చెపుతోంటే, వాడు బెంగపడకూడదని బతుకుతున్నాను. అంతే! బతుకుమీద కోరిక పోయిన నాకు నువ్వు ఊపిరి పోస్తు న్నావా? ఈ జీవచ్ఛవానికి ఓదార్పు నిద్దా మని ఈ నిర్ణయం తీసుకొన్నావా?"

రేవతి వదినగారిని దగ్గరికి తీసుకొంది. ఆమె చేతులలో అన్నపూర్ణ మొహం దాచు కొంది. రేవతికీ గొంతు పట్టినట్లయింది.

"నా కొడుకు అభిప్రాయం నేను తెలుసు కోవాలికదా! వాడంతటవాడు ఈ నిర్ణయా నికి రావాలి. వివాహ విషయంలో పిల్లల్ని బలవంతం పెట్టడం నాకు ఇష్టం ఉండదు. వాడు నా మనసు గ్రహించాడు. ఈ నిర్ణయం వాడి నోటినుండే వచ్చింది"

రేవతి చెపుతున్న మాటలు వాళ్ళు శ్రద్ధగా విన్నారు. "నేను అదృష్టవంతురాలనే. బంగారు బొమ్మలాంటి కోడలు నాకు వస్తోంది. మీరు ఈ ఏడాదయ్యాక ఎప్పు డైనా పెళ్ళి చేయండి. ఈలోపు కాస్త వీళ్ళి ద్దరూ సరదాగా ఉత్తరాలు వ్రాసుకొంటూ ఫోనులు చేసుకొంటూ గడుపుతారు" అత్త మాటలకి లలిత మరి వంచిన తల ఎత్త లేదు.

అన్నపూర్ణ ఉత్సాహంతో వాళ్ళిద్దరికీ అన్ని మర్యాదలూ చేయసాగింది. రేవతి వారి స్తున్నా ఆమె వినలేదు. కృష్ణని వాసుని తీసుకెళ్ళి బట్టలుకొని తీసుకొని రమ్మంది.

ఇద్దరూ బయటికి వెళ్ళినప్పుడు శ్రీనివాసు అసలు జరిగిన విషయమంతా చెప్పాడు, "తల్లి మేనమావ పోయినప్పటినుండీ జరు పుతున్న రాకపోకలు అతడికి తెలుసును. పెద్దమ్మ లలితను కోడలిని చేసుకోలేనందని,

మావయ్య పోయాడని ఈ సంబంధం వది లేసిందని, అమ్మ బాధపడింది. కొడుకు ఒకవేళ అలాగ అన్నా తను నచ్చచెప్పవ చ్చును. కానీ అక్కయ్య ఈ నాటకం ఆడు తోందని అనుమానం అని అమ్మ గోల.

లలితంటే నాకు ఎప్పుడూ ఇష్టమే. అమ్మకీ మీ కుటుంబం అంతా ఇష్టం. పెద్ద మ్మకి అడ్డం వెళ్ళకూడదని ఆగాం. ఇప్పుడు నాకు సంబంధాలు వస్తోంటే, అనవసరంగా బయటివాళ్ళకి ఆశలు కల్పించడం ఎందు కని అమ్మకు చెప్పేశాను. తను ఎంత సంతోషించిందో చెప్పలేను"

కృష్ణ, అతడు మనసారా ఎన్నో మాట్లాడు కొన్నారు. ఉదయం లేచాక పెరట్లో పూలు కోస్తున్న లలితను శ్రీనివాసు చూశాడు. నెమ్మదిగా అటువైపు నడిచాడు. "అయితే మీ అన్నకి రాత్రి ఏం చెప్పావు? "

నెమ్మదిగా మాటలు విన్పిస్తున్నవైపు చూసిన లలిత కళ్ళు సిగ్గుతో వాలిపో యాయి. అతడు తన ముందుకి వచ్చి కొంటెగా చూస్తోంటే ఆమె ఏంచేయాలో తెలియనట్లు చేతిలోని పూలసజ్జ చూస్తోంది.

"నాకు కొంచెం చెప్పకూడదా? ఎంత యినా అత్త కొడుకునేకదా, మీ అన్నయ్య ఏమడిగాడు? నువ్వు ఏం చెప్పావు? "

రాత్రి అన్నయ్య తనను వచ్చి అడిగిన విషయం ఇతడికి తెలిసిందన్నమాట. అమ్మ దొంగా అనుకొంది మనసులో.

అమ్మో! ఎంత పామో? అతడి మాట లకు చప్పున తలెత్తి 'ఎక్కడ' అంది. నిజమా, అబద్ధమా అన్నట్లు అనుమానంగా చుట్టూ చూసింది. అతడు ఆ పిల్ల జడ పట్టుకొన్నాడు. పొడుగ్గా ఉన్న ఆ జడ అందం, చూస్తూ నవ్వాడు.

"అందంగా ఉన్న నీ కళ్లు చూడాలన్పిం చింది. అవిపైకి లేవాలంటే అబద్ధం ఆడక తప్పలేదు"

అతడి కొంటెతనానికి నవ్వుకొంది. "ఇంతకీ అన్నయ్యతో ఏం చెప్పావంటే కాస్త యినా చెప్పడం లేదు. ఇది న్యాయమా? "

"న్యాయమా, అన్యాయమా నేను చెప్పు తాను. ఇటురా బావా! పాపం మా చెల్లి ఏం చెపుతుంది? "

వెనుకగా కృష్ణ మాటలు విన్పించి అతడు ఆమె జడ వదిలేశాడు. లలిత అన్నగారు తమనలా చూసినందుకు సిగ్గుపడిపో యింది. శ్రీనివాసు మాత్రం "ఇది మరీ అన్యాయం బావా! నీ చెల్లిని నేనేం కొరు క్కొని తింటానా? " అని నిలదీశాడు.

"నువ్వు కొరుక్కొని తిందామన్నా మా చెల్లి కొరుకుడు పడదు. తెలుసా? " కృష్ణ వెళుతున్న చెల్లిని అభిమానంగా చూస్తూ అన్నాడు.

"బావా! ఇంతకీ రేపునువ్వు పెళ్లి చేసుకో బోయేముందు ఎంత ఏడ్పిస్తానో చూసుకో! ఇంతకి ఇంతా వడ్డీతో తీర్చుకుంటాను" శ్రీని వాసు శపథం చేస్తున్నవాడిలాగ అంటూంటే కృష్ణ నవ్వాడు.

"మా చెల్లి నీకు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చిందిలే బావా! మరీ ఉడుక్కోకు" అంటూ అతడిని లోపలికి తీసుకొనివచ్చాడు.

ఇలాగ కన్పించి, అలాగ మాయమవు తున్న లలితంటే అతడికి అభిమానం ఎక్కువవసాగింది. లలిత కాలేజీకి సిద్ధమై "అన్నయ్యా! నేను వెళ్ళి వస్తా"నంది.

"రాత్రి పెద్దన్నయ్యతో మాట్లాడానత్తా! కట్నం అవీ అన్నీ నీకు ఇష్టమైనట్లు అడిగి చెప్పమన్నాడు. అత్త మన సంబంధం చేసు కొందుకు వచ్చిందంటే ఎంత ఆనందంగా ఉందోనని పొంగిపోయాడు. మీరు ఎప్పు డంటే అప్పుడు పెళ్ళి చేద్దామన్నాడు" కృష్ణ రేవతికి అన్నయ్యన్న విషయం చెప్పి "అంతా నీ ఇష్టం. నువ్వు ఎలా అంటే అలా చేస్తాం అత్తా" అన్నాడు.

రేవతి కృష్ణ అభిప్రాయం అర్థమై నవ్వు కుంది. "కట్నాలు, కానుకలంటూ మాట్లా డుకొందుకు మనం బయటివాళ్ళమా? మీరందరూ నా వాళ్ళే. ఉన్నదంతా మీకే కదురా" అంది.

ఆవిడ సౌజన్యానికి వాళ్ళు పొంగిపో యారు. "చెల్లెలు డిగ్రీ చదువు పూర్తయ్యాక పెళ్ళి చేస్తే మంచిదేమో" అన్నాడు కృష్ణ.

రేవతి కొడుకువైపు చూసింది. "వాడిని అప్పుడే ఒక కంపెనీవాళ్ళు జాబ్‌కి సెలక్టు చేశారు. పరీక్షలయ్యాక రమ్మన్నారు. మళ్ళీ ఏడాది సెలవులలో చేద్దాం. దానికీ రెండేళ్ళ చదువు అవుతుంది. ఆఖరి ఏడాది వాడి దగ్గరే ఉండి చదువుకొంటుంది. లేదా వాళ్ళు ఆగితే పరీక్షలయ్యాక చేద్దాం. వాళ్ళిష్టం" అంది.

కాలేజీకి వెళుతూ శాంతమ్మగారితో ఒంటి పూటే కాలేజి అని లలిత చెప్పడం శ్రీనివా సుకి గుర్తు వచ్చింది. బయటికి వెళ్ళి ఏ పుస్తకమో కొనుక్కొని వస్తానంటున్న అత డిని నవ్వుతూ చూస్తూ "అలా వస్తూ లలి తను తీసుకొని వస్తావా? " అని కృష్ణమో హన్ అడిగాడు.

ఉదయం దానికి పరిహారమా అన్నట్లు శ్రీనివాసు చూస్తూ స్కూటర్ తీశాడు. అత డిని చూస్తూ, "ఉమెన్స్ కాలేజీ ఎటుందో తెలుసా? " అనడిగాడు.

"తెలియకపోతే తెలుసుకొంటాను" హుషారుగా చూస్తూ చెప్పి వేగంగా కది లాడు. లలిత ఉదయం కాలేజీ మానేద్దా మనే అనుకొంది. కానీ తనంతట తను మానేస్తే అన్నయ్య ఏమనుకొంటాడో? అందుకే వెళతానని బయలుదేరింది. బయ లుదేరు తూంటే అన్నయ్య వద్దంటాడు అనుకొన్న ఆమెకి నిరుత్సాహమే కలిగింది.

కాలేజీ వదిలాక లలిత ఫ్రెండు రాణి, సుధ కలిసి బయటికి వస్తున్నారు. సరిగ్గా వాళ్ళ దగ్గర తెచ్చి శ్రీనివాసు స్కూటర్ ఆపాడు. అతడిని వాళ్ళు ఎప్పుడూ చూడ లేదు.

లలితకి అతడు అలాగ రావడం సిగ్గనిపిం చింది. వాళ్ళు అదోరకంగా చూడటంతో తనే అంది "మా చుట్టాలు వచ్చారు. వాళ్ళ అబ్బాయి" అంటూ స్కూటర్ ఎక్కింది. ఆమె సమాధానానికి అతడు నవ్వుకొన్నాడు.

కొంచెం దూరం వెళ్ళాక "నేను చుట్టాల అబ్బాయినా? ఏం బావనని చెప్పుకోనేం దుకు సిగ్గా" అంటూ నిలదీశాడు.

లలిత సమాధానం చెప్పలేనట్లు ఊరు కొంది.

"నేను బావనని ఎందుకు చెప్పలేదు. చెప్పకపోతే ఇంటికి తీసుకెళ్లను" అతడు మొండికెత్తాడు.

"మా అమ్మ చెవుడు ఉందని తెలియక మేనకోడలిని కోడలు చేసుకొంటాననంటోంది" అన్నాడు నిష్టూరంగా.

మరి కొంత దూరం వెళ్ళాక "చెముడే కాదు మూగ కూడా ఉన్నట్టుంది" అంటూ ఆమె వైపుకి తిరగబోయాడు. లలిత అతడి చెంప పట్టుకొని రోడ్డువైపు తిప్పుతూ, "బావా! మీకు పుణ్యం ఉంటుంది. కాస్త చూసి డ్రైవ్ చేయండి" అంది.

"అయితే నా ప్రశ్నకి సమాధానం చెప్పు" ఆమెకి చెప్పక తప్పలేదు. "మీరు బావగా రని చెపితే వాళ్ళు ఏవో ఊహాగానాలు కట్టి, రేపటినుండి ఏడిప్పిస్తారు"

"సరే. ఈ విషయం వదిలేస్తాను. రాత్రి మీ అన్నయ్యకి ఏం చెప్తావు? " అతడు పట్టువదలని విక్రమార్కుడిలాగ అడిగాడు. "చెప్పకపోతే బండి కదలదు" అంటూ స్లో చేశాడు.

ఆమెకి అతడి తీరు చూస్తే చిరుకోపం వచ్చింది. "అన్నయ్యకి రాత్రి చెప్పడం మాట అటుంచి ఇప్పుడు చెప్పాలి. అన్నయ్య మనసుని అర్థం చేసుకోలేని




వాళ్ళని భరించలేం అని"

ఆమె చిలిపితనానికి అతడికి ముచ్చటవేసింది. సన్నగా కోమలంగా ఉన్న ఆ కంఠస్వరం మరొకసారి పలికితే బావుండునన్పించింది.

కిళ్ళీషాపు దగ్గర ఆపాడు. "ఇదేమిటి? ఇక్కడ ఎందుకు ఆపారు? "

"దాహం వేస్తోంది. కూల్‌డ్రింక్ తాగుదామని ఆపాను. నీకు లిఫ్ట్ ఇస్తున్నానుకదా డ్రింక్ అయినా ఇప్పించవచ్చునుకదా"

"ఇంటికి వెళుతోంటే ఇప్పుడు దాహమా? " ఆమె అతడి ఉద్దేశం గ్రహించడానికి అంది.

"ఇల్లుని పిల్లేం ఎత్తుకుని పోదు. ఇంద తీసుకో" అంటూ ఆమెకి ఒక కూల్‌డ్రింక్ సీసా ఇచ్చి, తను ఒకటి తీసుకొన్నాడు.

రెప్ప వేయకుండా అతడు చూస్తుంటే ఆమెకి ఇబ్బందిగా అన్పించి పక్కకి చూడసాగింది. తెల్లటి పట్టు పరికిణీ ఎరుపుజరీ అంచుది కట్టుకొంది. ఎరుపు ఓణీ, ఎరుపు జాకట్టులతో భువనమోహనంగా ఉంది. తెల్లగా, పొడవుగా, సుకుమారంగా ఉన్న ఆ అమ్మాయికి ఆ బట్టలు ఎంతో బావున్నాయి. పరికిణీ ఓణీలలోని అందమేమిటో ఇప్పుడు తెలిసిందనుకొన్నాడు.

"లలితమ్మా! నువ్వేమిటి? ఇక్కడ ఉన్నావేం? " ఎక్కడనుండి వచ్చాడో సలీం ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు. ఎవరో అబ్బాయి లలితను తేరిపార చూస్తూ డ్రింక్ సీసా తాగడం చూసి ఆవైపు నుండి వెళుతున్న అతడు సైకిలు ఆపివచ్చాడు. లలిత మనసులో ఇంకా ఎందరి కళ్ళపడాలిరా నాయనా అనుకొంది. సలీం విషయం తెలుసు కనుక శ్రీనివాసు గురించి చెప్పి పరిచయం చేసింది.

ఇద్దరూ ఇంటికి చేరేసరికి అన్నపూర్ణ గాబరాగా బయటికి వచ్చింది. "సరిగ్గా వస్తున్నారో, లేదోనని కంగారు పడుతున్నాను. ఏం ఇంత ఆలస్యమైంది? "

శ్రీనివాసుకి ఏం చెప్పాలో తెలియలేదు. క్రాఫ్ ఒకసారి సవరించుకొని "పెట్రోలు అయిపోతే పోయించుకొని రావడం లేటయిందత్తయ్యా!" అన్నాడు. లలిత మాట్లాడకుండా లోపలికి వెళ్ళింది. కృష్ణమోహన్ మాత్రం అతడి సమాధానానికి నవ్వుకొన్నాడు.

తర్వాత భోజనాల దగ్గర సలీం కనపడిన విషయం అతడు చెప్పాడు. ఆ సాయంత్రం రేవతిని, తల్లిని విజయలక్ష్మి మేడమ్‌గారింటికి తీసుకెళ్ళాడు.

ఆవిడ ఎంతో అభిమానంగా వాళ్ళను లోపలికి ఆహ్వానించారు. "నా ఈ పురోభివృద్ధికి కారణం ఈవిడేనత్తా! వీరి ప్రోత్సాహం లేకపోతే నా పని ఎప్పుడో ఆగిపోయేది" అంటూ ఆవిడను పరిచయం చేశాడు కృష్ణ.

"మీరు రేవతిగారుకదూ" ఆవిడ ఎప్పటి నుండో తెలిసినట్లు అనడంతో రేవతి తెల్లబోయింది. "మీ మేనల్లుడు నోటివెంట ఎప్పుడూ మీ నామస్మరణే. తనకి మీరు మార్గదర్శకులంటారు" ఆవిడ నవ్వుతూ చెప్పారు.

వాళ్లు కూర్చున్న సమయంలో ఎన్నోసార్లు ఆవిడ కృష్ణమోహన్‌ను పొగిడారు. ఎంతో కష్టపడతాడని, మంచివాడని, గర్వం అన్నది లేదని, తమలో ఒకడిగా కలిసి పోయాడని ఆవిడ చెప్పారు. అన్నపూర్ణ ఆవిడ మాటలకి ఎంతో ఆనందించింది.

వాళ్ళను తర్వాత డాక్టరుగారింటికి తీసుకెళ్ళాడు. పక్కమీదనున్న ఆవిడ వంటమనిషి ద్వారా వీళ్ళకి ఎంతో ప్రేమగా మర్యాదలు చేయించింది. "అదృష్టవంతులు. మీ అబ్బాయి మాకందరికీ ముఖ్యంగా నాలాంటి అనారోగ్యం దానికి కొడుకే అయ్యారు. నా బిడ్డలు దూరంలో ఉన్నారనే బెంగ లేకుండా చేశాడు. నాల్గురోజులు

నన్ను చూడకుండా ఉండడు. వచ్చి కబుర్లు చెప్పి సేద తీరుస్తాడు. ఇతడు పరిచయమ య్యాక అనారోగ్యం గురించి ఆలోచించడం మానేశాను"

రేవతితో డాక్టరుగారు ఎంతో ఆత్మీయంగా మాట్లాడారు. "నాకు నిశ్చింత ఏర్పడింది. అటు హాస్పిటల్, ఇటు ఇల్లు చూసుకోలేక ఎంతో అవస్థ పడ్డాను. పిల్లలు చూస్తే దూరంలోనున్నారు. వాళ్ళ భవిష్యత్తు పాడుచేయగలమా? "

"కృష్ణ తనకి మేం సహాయం చేశామని, ఒక మార్గం చూపించామని అంటాడు కానీ, మాలాంటి వాళ్ళకే అతడు మార్గం చూపించాడు. మా క్లబ్‌లో ఉన్న చాలామంది ఆ మాటే అంటారు. నేనైతే కృష్ణను 'ఏజ్‌డ్ హోం' స్థాపించమంటున్నాను"

నిష్కల్మషంగా ఆయన మాట్లాడుతోంటే రేవతికి చెప్పలేనంత సంతోషం కలిగింది.

ఆమే నవ్వుతూ అంది. "వాడు తప్పకుండా చేస్తాడు. వాడికి కొంత సమయం పడుతుంది. పైచదువు పూర్తయ్యాక ఇలాంటి పనులు చేస్తాడు. మనిషిలో ఏదో చేయాలనే తపన బయలుదేరితే అది ఆగదని మీకు తెలుసుకదా"

ఆయన ఆమె మాటలకు ముగ్ధులయ్యారు. "నాకు ఇప్పుడు తెలిసిందమ్మా! మా కృష్ణకి వెనుకగల ప్రేరణ ఏమిటో" ఆయన నవ్వుతూ అంటూంటే ఆమె మేనల్లుడిని ప్రేమగా చూసింది.

ముఖ్యమైన వాళ్ళను కలిసి, వాళ్ళు వచ్చేస్తోంటే అప్పుడు ఆరైదేళ్ళ... గారమ్మాయి మాధవి గుమ్మంలో నిలబడి కన్పడింది. "అన్యాయం మా ఇల్లు చేసుకొన్న పాపం ఏమిటో? దీన్ని కూడా పావనం చేయవచ్చునుకదా" అంది.

ఆ పిల్ల మాటలకి అన్నపూర్ణ "మరొకసారి వస్తాంలేమ్మా, ఇప్పటికే ఆలస్యం అయిపోయింద"న్నారు. "ఒక్క నిముషం వస్తే ఏమీ అయిపోదు. రండి అంటీ" అంటూ బలవంతంగా చెయ్యి పట్టుకొని లోపలికి తీసుకెళ్ళింది.

"అమ్మా! ఈ పెద్దమనిషి ఆంటీ వాళ్ళను మన ఇంటికి తీసుకొని రాకుండా పంపేస్తున్నారు. నేను చూడబట్టి సరిపోయింది. మనతో పెట్టుకుంటే ఏమవుతుందో తెలియదు అబ్బాయిగారికి" తల్లితో ఫిర్యాదుగా అంటూ వీళ్ళకు మర్యాదచేసింది.

"ఏమవుతుందిట" రేవతి ఆ అమ్మాయిని అనుకరిస్తూ అంది. మాధవి రేవతిని చూసి నవ్వేసి నాలుక అల్లల్లాడిస్తూ "ఊరికే అన్నాను ఆంటీ! ఇంటికి వచ్చి కాస్త అల్లరి చేస్తానంతే" అందరూ ఆ పిల్ల మాటలకి నవ్వేశారు.

ముచ్చటగానున్న ఆ పిల్లలను, ఇంటిని చూసి అన్నపూర్ణ సంతోషపడింది. మాధవి తల్లి స్నేహశీలతకి రేవతి సంతోషించింది.

ఇంటికి వచ్చాక రేవతి అతడిని అనేక విధాలుగా అభినందించింది. "మన బతుకు మనం బతకడమే ముఖ్యం కాదు కృష్ణా! ఈ సమాజానికి దేశానికి సేవ చేయాలి. సేవా తత్పరత కలవాళ్ళు ఈ రోజుల్లో అరుదవుతున్నారు. మన లక్ష్యం చేరడంలో ఒక్కొక్కసారి ఎన్నో అవరోధాలు, అవమానాలు ఎదురవుతాయి. తట్టుకొని ముందుకి సాగాలి"

అతడు ఆమె మాటలు శ్రద్ధగా విన్నాడు. "అమ్మచేత ఉద్యోగం నీకు చెప్పకుండా మాన్పించానని కోపం రాలేదుకదత్తా" అతడు నెమ్మదిగా అడిగాడు.

"మూడేళ్లనుండీ ఆమె మా కోసం ఎంతో శ్రమపడటానికీ అలవాటు లేని విధంగా బయటికి అడుగు పెట్టడానికి సిద్ధమైందత్తా! నేను వద్దన్నా వినలేదు. పూర్వపు హెడ్మాస్టర్ ఉంటే బావుండేది. ఆయన ట్రాన్స్ఫరై వెళ్ళిపోయారు.





"ఈ కొత్తగా వచ్చినాయనకి డబ్బుమీద యావ చాలా ఎక్కువ. ఆ స్టాఫ్ లంచాలు ఇవ్వమంటారు. వాళ్ళమధ్య అమ్మ నలిగిపోతోంది. ఎరియర్స్ వెంటనే బిల్లు చేయడం లేదని స్టాఫ్ అమ్మని మాటలన్నారుట. వాళ్ళు చెప్పగానేఎందుకు చెయ్యాలి. వాళ్ళను పర్సంటేజ్ అడగండని హెడ్‌మాస్టరుట. వాళ్ళూ వాళ్ళూ బయటపడరు. అమ్మమీద ఆలస్యానికి నెపం చూపించినందుకు స్టాఫ్ అమ్మతో దెబ్బలాడేరుట.

"అమ్మకి స్వంతంగా బిల్స్ చేయడం రాదు. ఆయన ప్రతీదానికీ తప్పు పడతాడు. అందుకని ఒకనాడు వాళ్ళు అన్న మాటలకి అమ్మ ఏడుస్తూ ఇంటికి వచ్చింది. అందుకే మాన్పించేశాను"

అన్నపూర్ణకి ఆ విషయం గుర్తు వచ్చింది. పిల్లలు తెమలాలనే ఉద్దేశంతో తను వెళ్ళింది. తనకి నోరు లేకపోబట్టి రెండు వైపులనుండీ విమర్శలు ఎదురయ్యాయి. తన కుటుంబం గురించి ఇది వరకటి హెచ్.ఎమ్.కి తెలుసును ఆయన మర్యాదగా చూసేవారు. ఆయన వెళ్ళాక స్కూలు పరిస్థితులు బావుండలేదు. ఎంత బింకంగా ఉందామన్నా ఏనాడూ మాటలు పడని తనకి కష్టమే కలిగింది.

పనికి రానివాళ్ళు ఎందుకు ఉద్యోగంలోకి వస్తారో తెలియదనీ, ఒక్క పనీ సకాలంలో అవడంలేదనీ స్టాఫ్ గొడవ. నేను చెప్పేవరకూ ఏపనీ చేయవద్దంటారు. ఏదో బాధ ఆపుకోలేక ఏడిస్తే కొడుకు చూడలేకపోయాడు. ట్రాన్సఫర్‌కి పెట్టుకొంటానన్నా వినకుండా మానెయ్యమని పట్టుదలగా వాడు అన్నం మానేసి గొడవ పెడుతూంటే ఏంచేస్తుంది?

రేవతి అంతా తెలుసుకొని నిట్టూర్చింది. "ఈలోకం ఎదురు తిరిగి పోరాడిన వాళ్ళను ఏమీ చేయలేదు. అసహాయులను, అమాయకులను వేధిస్తుంది."

"ఇప్పుడు నేను బాగా నిలదొక్కుకొన్నాను అత్తా! నా కింద కొంతమంది పనిచేస్తున్నారు. అలాంటిది అమ్మను ఎందుకు కష్టపెట్టాలి? అమ్మను నేను చూడలేనా?"

కృష్ణమాటలకి ఆమె నవ్వింది. "నీ కొడుకు సమర్థుడైనాడు అన్నపూర్ణా! ఇంకా నీకు బెంగ ఎందుకు? ఇంక నిశ్చింతగా కాలం గడుపు" రేవతి మనస్ఫూర్తిగా అంది.

మర్నాడు ఎంత బలవంతం చేసినా రేవతి ప్రయాణంకి సిద్ధమైపోయింది. శ్రీనివాసు వేళాకోళాలతో అత్త చెప్పే ఆత్మీయమైన కబుర్లతో రెండురోజులు ఇట్టే గడిచిపోయాయన్పించింది కృష్ణమోహన్‌కి.

శ్రీనివాసు లలిత ఒంటరిగా కన్పిస్తుందేమో, ఉత్తరాలు రాయమని అడుగుదామని చూస్తున్నాడు. ఆమె మరీ మెరుపులాగ ఇటు కన్పించి, అటు మాయమవుతోంది. నీలిరంగు పట్టుపరికిణీ, తెల్లటి ఓణీ, నీలిరంగు జాకట్టులో ఆమె నిజంగానే మబ్బు తునకలా ఉంది. అతడి అవస్థ గమనించి రేవతి "ఏదైనా చెప్పాలనుకొంటున్నావా?" అని నవ్వుతూ అడిగేసింది. అతడు తల్లి అలాగ అడిగేసరికి సిగ్గుపడిపోయాడు.

సెండాఫ్ ఇవ్వడానికి వచ్చిన కృష్ణమోహన్‌తో నెమ్మదిగా "మీ చెల్లిని నా ఉత్తరాలకి జవాబు రాయమని చెప్పు బావా?" అన్నాడు. "నువ్వే చెప్పవచ్చుకదా?" కృష్ణమోహన్ అంటూంటే "ఏదీ, ఆమె ఒంటరిగా చిక్కితే కదా?" అతడు కినుకగా అంటే కృష్ణమోహన్ నవ్వేశాడు.

"ప్రేమికులు ఏకాంతాన్ని కల్పించుకోవాలి. అది చేతకాక మా చెల్లిని అంటావేం? అయినా ఎంత ఎంత ఎడమైతే, అంత తీపి అన్నారులే ఒక కవి. అలాగ ఇదీ మీ మంచికే. ఏమంటావు" అంటున్న అతడిని నమిలి మింగేసేలాగ చూశాడు.



"బావ ఇలాగ వచ్చి వెళ్ళిపోవడం నాకేం నచ్చలేదు. రెండు రోజులుండవచ్చు కదత్తా" అతడు శ్రీనివాసుకి కన్ను గీటుతూ, అత్తతో అన్నాడు. ఆమె వారిద్దరినీ ఆత్మీయంగా చూస్తూ "వాడు ఉండేరోజులు, నువ్వు ఉంచు కొనే రోజులు ముందున్నాయిరా" అంది.

కృష్ణమోహన్ వాళ్లను పంపేసి ఇంటికి వచ్చాడు. అతడి మనసు దూది పింజెలాగ తేలిపోతోంది. ప్రియంవద విషయంలో నందు చేసిన పనికి అత్త కోపించి, దూరమ వుతుందనుకొన్నాడు.

ప్రియంవద నందు సంబంధంకోసం గట్టి గానే ప్రయత్నాలు చేసింది. తండ్రిలేనివాడు. డాక్టరు. మేనల్లుడు తమ అల్లుడైతే గీసిన గీటు దాటడు. నందు కూడా తమ కుటుం బంతో సన్నిహితంగానే ఉన్నాడు.

ఈలోపు చిన్న మావయ్య వాడికి చేరిక అవడం, తరచుగా ఆయన అతడి దగ్గరికి రాకపోకలు జరపడం, ఎప్పుడూ అయిదువే లుకి తక్కువకాకుండా చేతిలో పెట్టడం నందుని ఇటు ఆకర్షించాయి. సెలవలకి తల్లికి ఫోను చేసేసి అటు మేనమామ ఇంటికి వెళ్లిపోయాడు.

ప్రియంవదకి తను అనుకొన్నపని అయిపోతే పట్టపగ్గాలుండేవికావు. ఎప్పుడైతే నందు అటు మేనమామ ఇంటికి రాకపోకలు చేస్తున్నాడని తెలిసిందో ఇంటికి వచ్చి తగాదా పెట్టుకొంది. నందూ తక్కువ తినలేదు.

సంబంధం అవకుండానే ఇంత గొడవ చేస్తోంది. ఇంత అధికారం చూపిస్తోంది. రేపు నిజంగా ఆవిడ కూతురిని పెళ్ళి చేసు కొంటే తనని బ్రతకనీయదనుకొన్నాడు. మావయ్య డబ్బు, అత్త చేసే మర్యాదలు అత డిని కొంత లొంగదీశాయి. అందుకే అటు మొగ్గాడు. కృష్ణమోహన్‌కి ఒకటే బాధ పెళ్ళి విషయం వాడెందుకు సీరియస్‌గా తీసికోడు. జీవితాంతం గడపబోయే భాగస్వామి విష యంలో ఆలోచించవద్దా?



కష్టపడి జీవితాన్ని నిర్మించుకోవడంలో ఇంత తృప్తి, సంతోషం కలుగుతాయని కృష్ణకు ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది. దూరంగా ఆటలాడుతున్న విద్యార్థులను చూశాడు. మరొకపక్క బిల్డింగ్‌లో క్లాసులు అవుతున్నాయి. తను ఇంత ఎత్తుకి ఎదిగా డంటే ఎవరైనా నమ్ముతారా?

అతడికి వెంటనే అనిపించింది. జీవితం ఒకరు ఇచ్చేదికాదు పుచ్చుకోవడానికి. మనం... మనంతట మనం నిర్మించుకోవాలి. ఆ కష్ట పడటంలో ఏళ్ళు ఎన్నయినా గడవనీ, వయసు కాలంతోపాటు కరిగిపోనీ, ఫర్వా లేదు. ఆ తర్వాత మిగిలిన జీవితం ఇచ్చే తృప్తికి సాటి ఏదీ ఉండదు.

"సార్! మీకు ఫోను" అతడు ఎటెండర్ పిలుపుకి తుళ్ళిపడి, తన గదిలోకి వెళ్ళాడు. అవతల నుండి ప్రసాద్ మాట్లాడుతున్నాడు.

"ఇంజనీరుగారింట్లో పెళ్ళి. మనల్ని సాయం కోరుతున్నారు. వంట వాళ్ళను మంచి పార్టీని చూసి కేటరింగ్ ఇవ్వడం గురించి అడుగుతున్నారు. ఎవరికి చెప్పను? "

కృష్ణమోహన్ రెండు నిముషాలు ఆలోచిం చాడు. "రత్నంని పిలిపించి మాట్లాడు. రేటు ప్లేటుకి ఎక్కువ కాకుండా చెప్పాలని నామా టగా చెప్పు. అతడైతే జాగ్రత్తగా చేస్తాడు"

ప్రసాద్ మరికొన్ని విషయాలడిగి ఫోను పెట్టేశాడు.

కృష్ణమోహన్ తగ గదివైపు చూసుకొ న్నాడు. శుభ్రంగా ఉంది. అతడు సాలోచ నగా కాలేజీకి మరొకవైపు వేసిన షెడ్లు చూశాడు.

కాలేజీలో, హైస్కూల్‌లో చేరే పిల్లలు రోజు రోజుకీ పెరుగుతున్నారు. త్వరలో వాళ్ళకి బిల్డింగ్స్ పూర్తిచేయాలి. ఈపని





ఎంత త్వరలో అయితే అంత మంచిదనుకొన్నాడు.

ప్రిన్సిపాల్ అతడి గదిలోకి వచ్చారు. చక్రపాణిగారికి ఎడ్మినిస్ట్రేషన్‌లో మంచిపేరుంది. కృష్ణమోహన్ తనంతట తాను ఆయనను అర్థించి, రిటైరయినాక తీసుకొని వచ్చాడు.

"ఈ ఏడాది ఎడ్మిషన్లు బాగా ఎక్కువైనాయి. కొందరిని ఖాళీలేదని వెళ్ళిపొమ్మన్నా వాళ్ళు వినడంలేదు" ఆయన చెపుతున్నాడు.

అతడు నవ్వాడు, "కొంత అభివృద్ధిలోకి తెచ్చేవరకే మనం శ్రమపడాలండీ! తర్వాత దాని సామర్థ్యమే సంస్థను నిలబెడుతుంది. పదిమందిని ఆకర్షిస్తుంది."

ప్రిన్సిపాల్ అతడి మాటలకు ఆశ్చర్యపడలేదు. ఈ కుర్రవాడు వయసులో, అనుభవంలో తనకన్నా చిన్న. కానీ అతడి ఆలోచనలు చూస్తే అలాగ అన్పించవు అనుకున్నారు.

ఆయన నవ్వుతూ "మన కాలేజీలో టైపు, షార్టుహేండ్ కోర్సులు ప్రారంభించడం, ఆసక్తి ఉన్నవాళ్లకి వీణ, వోకల్ చెప్పించడం మనకు ప్లస్ పాయింట్లు అయినాయి" అన్నారు.

కృష్ణ నిండుగా నవ్వాడు. "అంతేకాదండీ! పోటీకి తట్టుకోవాలంటే ఎప్పుడూ ఏదో ఒక కొత్తదనాన్ని చూపించాలి. మళ్ళీ అన్నీ ఒకేసారి పరిచయం చేసెయ్యకూడదు. అంచెలంచెలుగా పరిచయం చేయాలి

"అన్నట్లు మీకు చెప్పానుకదా! రాజమండ్రి నుండి కరాటే మేష్టారిని పిలిపిస్తున్నానని. ఆయన త్వరలోనే వస్తారు. ఆయన అంగీకరిస్తే మనం కరాటే చెప్పిద్దాం"

ఇక ఆయన మాట్లాడలేకపోయారు. ఎప్పుడు ఏవిధమైన ఆలోచన చేస్తాడో తెలియదు. అతి నెమ్మదిగా ఫలితం కనబడే ముందు బయటపెడతాడు.

ఈ కాలేజీ అభివృద్ధిని చూసి అందరూ అది తన తెలివితేటలు, సామర్థ్యం వల్లనే అంటారు. కానీ దానివెనుక ఉన్న ఇతడికృషి, చాకచక్యం తనకి, తనలాంటి కొందరికే తెలుస్తుంది.

ఆయన సవినయంగా ఏదో చెప్పబోతుండగా కృష్ణ అన్నాడు, " మీరు నాకు పితృసమానులు. నన్ను మన్నిస్తూ చిన్నపుచ్చకండి. ఈ విషయం మీతో చాలాసార్లు చెప్పాను" అతడు చేతులు జోడించి అంటూంటే ఆయన కళ్ళు చెమర్చాయి.

"ఈ సంస్థ మీది. ఏ నిర్ణయాలు తీసుకొన్నా మీరు నాకు చెప్పనవసరంలేదు. మీమీద నమ్మకంతో దీన్ని మీ చేతిలో పెడుతున్నాను"

అతడు తనను తీసుకొని వచ్చి, అధికారం అప్పగించిననాడు అన్నమాటలు చక్రపాణిగారికి గుర్తు వచ్చాయి.

బయటికి వచ్చి, స్కూటర్ స్టార్టు చేస్తూ కాలేజీ బిల్డింగ్‌పైన ఉన్న బోర్డు ఒకసారి చూసుకున్నాడు కృష్ణ.

చంద్రమౌళీ రెసిడెన్షియల్ జూనియర్ అండ్ డిగ్రీ కాలేజ్ అని ఉంది. పక్కనున్న మరొక బిల్డింగ్‌పై చంద్రమౌళి రెసిడెన్షియల్ హైస్కూల్ అని ఉంది. ఆరవ తరగతినుండి హైస్కూల్ దాకా ఆ బిల్డింగ్‌లో నడుపుతున్నారు. దానికి దూరంగా ఈ కాలేజీ పెట్టారు. మొదట దీన్ని జూనియర్ కాలేజీగానే పెట్టారు. ఈ ఏడాది డిగ్రీ ఫస్టియర్ ఓపెన్ చేశారు. అందుకే ఈ బోర్డు వచ్చింది.

అతడు దాన్ని తృప్తిగా చూసి ముందడుగు వేశాడు.

**అంకితం**

మానవత్వం,సహృదయత
మూర్తీభవించిన
లగుడు సింహాద్రిగారికి...

-రచయిత్రి



# చతుర ప్రపంచం

## బీర్ గురించి

మండు వేసవిలో సేదదీర్చేవాటిలో ముఖ్యమైనదిగా బీర్ కూడా మారింది. సీసాలలోనేకాక ప్రస్తుతం టిన్స్‌లో కూడా వివిధ పరిమాణాల్లో బీర్ లభ్యమవుతోంది. హాట్ లిక్కర్‌కన్నా బీర్ క్యాన్స్ కుర్రకారుని ఆకర్షిస్తున్నాయి.

బీర్‌ని ఎవరు కనిపెట్టారో తెలియదుకానీ బార్లీని పులియబెట్టి ఆ నీటితో బీర్‌ని తయారుచేస్తారు. అయితే... ఒక్కో దేశంలో బీర్‌ను ఒక్కొక్క పద్ధతిలో తయారుచేస్తుంటారు.

అమెరికాకు చెందిన సంస్థ గిన్నిస్‌బీర్ తయారీలో ప్రపంచంలో మొదటిస్థానంలో వుంది. ఈ కంపెనీ అధినేత ఓసారి బీర్ పుట్టుపూర్వోత్తరాల గురించి, అత్యధికంగా మనిషి ఎంత బీర్ తాగగలడు అని తెలుసుకోవడానికి ప్రయత్నించి విఫలమయ్యాడు.




8000 సంవత్సరాల క్రితమే (క్రీ.పూ. 6000) నిర్మించబడ్డ ఈజిప్షియన్ పిరమిడ్లలో బీర్ బేరర్స్‌ని కనుగొన్నారు.

బీర్‌లో అనేక రకాలున్నాయి. లేగర్ బీర్ (మనకి దొరికే నురగవచ్చే బీర్), పోర్ట్‌బీర్, స్టౌట్ బీర్ మొదలైనవి విదేశాల్లో లభ్యమౌతున్నాయి. ప్రపంచంలో జర్మనీలో తయారైన బీర్ నాణ్యమైనదిగా గుర్తించారు.

ఆ ఓటమినుంచి వచ్చిన ఆలోచనలతోనే గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌ని ఏటా ముద్రిస్తున్నారు. 1977లో ఈ కంపెనీ ఓ కొత్తరకం బీర్‌టిన్‌ను రూపొందించింది. బీర్‌క్యాన్ అడుగు పొరలో కార్బన్ డయాక్సైడ్‌ని అల్ట్రాసానిక్ మెథడ్‌తో నింపి వుంచుతుంది. క్యానిని తెరవగానే ఆ కార్బన్ డయాక్సైడ్ బీర్‌తో కలిసి నురగగా పైకి తేలుతుంది. బీర్‌లో నురగని ఇష్టపడే వారికోసం దీన్ని కనిపెట్టారు. ప్రపంచంలో ఈ రకం క్యాన్స్ అమ్మకాలే ఎక్కువ.

చవకరకం బీర్‌ని బ్రిటన్‌లో తయారుచేసి అమ్ముతుంటారు. బార్లీతోనే చేసే ఈ బీర్ నల్లగా వుండటంతో దాన్ని బ్లాక్ బీర్‌గా వ్యవహరించేవారు. వీటిని ఓడరేవుల్లోని పోర్టర్స్‌కి అమ్ముతుండటంతో ఈ బీర్‌ని పోర్ట్‌బీర్ అని కూడా పిలుస్తారు. దీంట్లోనే మరోరకం బీర్‌ని స్టౌట్‌బీర్‌గా వ్యవహరిస్తారు. మరోరకం చవకబీర్‌ని పెన్నీబీర్‌గా పిలుస్తారు. వర్కింగ్‌క్లాస్ ఈ బీర్‌ని పెన్నీ ఇచ్చి కొనడంతో దీనికా పేరు వచ్చింది.

మొదటి ప్రపంచయుద్ధం తరువాత బీర్ కేన్స్ ఎక్కువ ప్రాచుర్యం పొందాయి. ఎందుకంటే ఇవి రవాణాలో పగలవు, పేలవు. తెరవడానికి ఓపెనర్ అవసరంలేదు.

బాటిల్డ్‌బీర్‌లో గ్లిజరిన్ అనే ప్రిజర్వేటివ్‌ని కలుపుతారు. అయితే ఒకటి రెండు రోజుల్లో వినియోగించబడే బీర్‌లో గ్లిజరిన్ కలపరు. దాన్ని డ్రాట్‌బీర్ అంటారు. ఇది సాధారణంగా బీర్‌ని తయారుచేసే బ్రేవరీలు అందుబాటులో వున్న ప్రదేశాల్లోనే అమ్ముతూవుంటారు. ఎక్కువమంది బీర్ ప్రియులు అమెరికాలో డ్రాట్ బీర్‌నే కోరుకుంటూండటంతో వీటి తలసరి వినియోగం ఆ దేశంలోనే ఎక్కువ వుంది.

## నయాగరా ఫాల్స్

**నా**ర్త్ అమెరికాలోని నయాగరా ఫాల్స్ ప్రపంచయాత్రికులని ఆకర్షించే కమనీయ దృశ్యాల్లో ఒకటి. కెనడా సరిహద్దులోని నయాగరా నది వద్ద ఈ జలపాతం వుంది. ఒంటారియో ప్రావిన్స్‌లోనూ వున్నాయి. ఏటా కోటిమంది ఆ రెండు జలపాతాల్నీ సందర్శిస్తున్నారు.

ఇందులో 85 శాతం నీరు హార్స్ షూఫాల్స్ నుంచి కిందకు పడతాయి. ఇది గుర్రపునాడా ఆకారంలో వుండటంతో దానికా




నిజానికి నయగరా రెండు జలపాతాల కలయిక. ఒంటారియో సరస్సువద్ద కెనడా సరిహద్దులో హార్స్‌షూఫాల్స్ ఒకటయితే, మరొకటి అమెరికా సరిహద్దులోని అమెరికన్ ఫాల్స్. అమెరికన్ ఫాల్స్ న్యూయార్క్ రాష్ట్రంలో, కెనడాలోని హార్స్ షూఫాల్స్ పేరు వచ్చింది. 792 మీటర్ల వెడల్పు, 51 మీటర్ల ఎత్తుగల ఈ ఫాల్స్‌మీద రాత్రుళ్ళ రంగురంగు దీపాలతో కాంతులను ప్రసారం చేస్తారు. చూడటానికి ఈ దృశ్యం ఎంతో

మధురంగా వుంటుంది. ఏప్రిల్ 1వ తేదీ నుంచి అక్టోబర్ 1వ తేదీదాకా టూరిస్ట్ సీజన్. తర్వాత క్రమంగా నీరు గడ్డకట్టిపో తుంది.

'మెయిడ్ ఆఫ్‌ది మిస్ట్' అనే మర పడవల మీద యాత్రికులని నయాగరా నదిమీద రెండు ఫాల్స్‌ని దగ్గరకి తీసుకెళ్తారు. ఆ ఫాల్స్‌ని చూడటానికి పొడుగైన అబ్జర్వేషన్ టవర్స్ కొన్ని కట్టారు. కెనడాలోవున్న అవి 85 నుంచి 150 మీటర్ల ఎత్తుంటాయి. నయాగరా ఫాల్స్ 12000 సంవత్సరాల క్రితం ఏర్పడ్డాయని శాస్త్రజ్ఞుల అంచనా. సావనీర్ దుకాణాలతో, పార్కులతో, రెస్టారెంట్స్‌తో కళకళలాడే ఈ ప్రాంతాన్ని విమానం, హెలికాప్టర్లలో ఎగిరి ఫాల్స్‌ని చూడవచ్చు

---

## సినిమా ఫస్ట్‌లు

ఇండియాలోని మొట్టమొదటి సినిమా థియేటర్ పేరు 'జె.ఎఫ్.మదన్ సినిమా థియేటర్'. దీన్ని 1927లో కలకత్తాలో ప్రారంభించారు.

ఇండియాలోని మొట్టమొదటి టూరింగ్ టాకీసును కూడా బొంబాయి వాస్తవ్యుడైన మాణిక్ సేత్నా 1904లో ఆరంభించాడు. అందులో 'ది లైఫ్ ఆఫ్ క్రీస్ట్' అనే 2 రీళ్ల సినిమాను ప్రదర్శించారు.

మొట్టమొదటి ప్రచార పోస్టర్‌ని 1923లో మాయాబజార్ అనే సినిమాకి




ముద్రించి అతికించారు.

ఇండియాలోని మొట్టమొదటి ఎయిర్ కండిషన్డ్ థియేటరు పేరు 'రీగల్ థియేటర్'. బొంబేలో ఇది 1933లో ఆరంభమయింది.

ఇండియా పత్రికలలో సినిమాల గురించి మొదటిసారిగా రాసింది 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా'లో. 1899లో ఇది జరిగింది.

ఇండియాలో ప్రజలకోసం 1896 జూలై 14న తొలిసారిగా చిత్రప్రదర్శన జరిగింది. వెర్సన్ హోటల్‌లో 'ది లుమేర్‌షో' అనే చిత్రాన్ని 35 రోజులపాటు బొంబాయిలో ప్రజల కోసం ప్రదర్శించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని మొట్టమొదటి థియేటర్ విజయవాడలోని మారుతీటాకీస్. ఇది 1934లో ఆరంభమయింది.

★

# 'డాలర్...! డాలర్...!' పై సమీక్షలు

అక్టోబరు 'చతుర' లో ప్రచురితమైన సింహప్రసాద్ నవల 'డాలర్...! డాలర్...!' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## డాలర్...! డాలర్...!

*(ప్రథమ బహుమతి రూ. 100/– పొందిన సమీక్ష)*

సింహప్రసాద్‌గారు 'డాలర్... డాలర్...!' నవలలో సమకాలీన పరిస్థితులకి అద్దంపట్టి పాఠకులకు కనువిప్పు కలిగించారు. ఇది నేటి మధ్యతరగతి కుటుంబీకుల మనస్థత్వాన్ని ప్రతిబింబింపచేసే కథ, ఎందరో తల్లిదండ్రుల వ్యథ.

సుఖం భౌతికమైనదనీ, సంతోషం మానసికమైందనీ, వీటిమధ్య తేడాను తెలుసుకోలేక డబ్బుంటే ప్రపంచమే పాదాక్రాంతమౌతుందనీ, ఆ డబ్బు డాలర్ల రూపంలో అయితే మరింత గొప్పగా ఉంటుందని భ్రమించి కన్నబిడ్డల్ని క్రమశిక్షణ అంటూ ప్రేమరాహిత్యంలో పెంచే తల్లిదండ్రులకు దొరబాబు నిష్క్రమణ ఒక హెచ్చరికలాంటిది.

కొందరు తమ కొడుకులు అమెరికా వెళ్ళి డాలర్లను సంపాదించేందుకే, కూతుళ్ళు అమెరికా అల్లుళ్లకు కట్టబెట్టేటందుకే అన్నట్టు చదివిస్తూ పెంచుతారు. తమ లక్ష్యం నెరవేరటం కోసం తమ జీవితాల్నే పణంగా పెట్టి, ఆ విషయాన్ని పిల్లలకి పదేపదే గుర్తుచేస్తూ, వారి అభిరుచులనీ, అంతఃకరణలనీ అర్థం చేసుకోకుండా వారు చేయాల్సిన ప్రతి పనినీ తామే నిర్దేశించి కాళ్ళకు బంధాలు వేస్తారు. లాలిపాటల బదులు 'డాలర్ల' పాట పాడుతూ, చందమామ కథలకు బదులు అమెరికాలో పొందబోయే సుఖాల కథలు చెబుతూ, ఎమ్సెట్లో ర్యాంకు సంపాదించడమే జీవిత ధ్యేయమని ఎల్.కే.జి. నుంచి పిల్లలకు నూరిపోస్తారు. ఫలితంగా పుట్టగొడుగుల్లా వెలసిన కోచింగ్ సెంటర్లు విద్యార్థులను భావిభారత పౌరులుగా కాక ఎన్నారైలుగా తీర్చి దిద్దుతున్నాయి. తల్లిదండ్రులు పిల్లలకు చదువుపట్ల ఏకాగ్రత చెడకుండా వుండేటందుకు, వున్న కాస్త పొలమూ, ఇల్లూవాకిళ్ళూ అమ్మి వారి బాల్యాన్ని బలి చేసి, బంధాలకూ అనుబంధాలకూ దూరం చేసి రెసిడెన్షియల్ కాలేజీల్లో చేరుస్తున్నారు. ఇదంతా డాలర్లు పండించడంకోసమే! సెంటిమెంట్స్, ప్రేమానుబంధాలు ప్రగతికి అవరోధాలవుతాయని కొడుకుకు నూరిపోసిన ముకుందం చివరికి తనే వాటికి బందీ అయి అల్లాడిపోతాడు.

మనుషులతో మమతానురాగాల రెక్కలు కత్తిరించి, మేధోవలసని ప్రోత్సహించే చదువులను నిరసిస్తూ, దొరబాబుకు వీడ్కోలు చెబుతూ సుస్మిత మాట్లాడిన మాటలు ఎంతో ఆలోచింపజేసేవిగా ఉన్నాయి. ప్రభుత్వం ఖర్చుపెడుతున్న ప్రజాధనంతో అభ్యసించిన విద్యనీ, విజ్ఞానాన్నీ మనదేశం కోసం ఉపయోగపడేట్లు అవకాశాలు కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వానిదే.

డాలర్లతో సుఖసంతోషాలను వెతుక్కుంటూ, అవి ఎండమావులని తెలియక వాటికోసం పరిగెత్తే ఎందరికో కనువిప్పు కలిగించే ఈ నవల వ్రాసిన రచయిత అభినందనీయులు.

**–తూములూరి కనకదుర్గ**
గుంటూరు - 522 006

కవర్ ఫొటోగ్రాఫర్: **అజయ్‌సిల్**

## లోపభూయిష్ట సిద్ధాంతం

*(ద్వితీయ బహుమతి రూ. 75/-
పొందిన సమీక్ష)*

'**డా**లర్... డాలర్!' నవల చక్కని శైలితో ఆపకుండా చదివించేదిగా ఉన్నా, నవల ఆద్యంతం ఒకానొక లోపభూయిష్టమైన సిద్ధాంతంమీద ఆధారపడి నడిచింది. అదే మిటంటే, పిల్లల జీవితాలలో జరిగే మంచి చెడులన్నిటికీ చివరివరకూ తల్లిదండ్రులదే బాధ్యత అని రచయిత అనుకోవడం. ఏ తల్లిదండ్రులైనా తమ పిల్లలకి తమ ఆశ యాలకి తగ్గట్టుగా గైడెన్స్‌నిస్తారు. ఈ నవల్లో ముకుందం చేసిందీ అంతే. దొర బాబు తనంతవాడు తానై, తన కాళ్ళమీద తాను నిలబడ్డాక కూడా తన నిర్ణయాలు తాను తీసుకోకూడని విపత్కర పరిస్థితులు నిజంగా ఏమీ ఏర్పడలేదు. నీవడిగిన డబ్బు నీకు సంపాదించి ఇచ్చాను. ఇంక నా జీవితం నా యిష్టం నా పెళ్ళి నా యిష్టం అని ఎసెర్టివ్‌గా ఉండి తండ్రిని దొరబాబు ఒప్పించలేకపోవడానికి కారణం ఖచ్చితంగా దొరబాబే. దొరబాబు తనకి తనే అన్యాయం చేసుకున్నాడు.

ముకుందం ఎంత తెలివి తక్కువగా తండ్రిని ద్వేషించాడో (నిజానికి తన చదువు మాన్పించాడన్న సహేతుకమైన కారణం అతని కుంది) అంతే తెలివి తక్కువగా దొర బాబు తన చేతకానితనానికి నేరం తండ్రి మీద, భార్యమీద వేసి శిక్షించాడు. రచయిత కూడా ముకుందాన్నే నేరస్థుడ్ని చెయ్యడానికి అవస్థపడ్డారు.

ఆత్మహత్య చేసుకునే మనస్తత్వం (సూయిసైడల్ టెండెన్సీ) ఉన్నవాళ్ళు కారణం వెతుక్కుని మరీ చేసుకుంటారు. వాళ్ళనెవరూ వత్తిడి చెయ్యనక్కర్లేదు.

అమెరికాలో ప్రజ్ఞకి లభించే అవకాశాలూ ప్రోత్సాహం ఇక్కడ లేవన్నది నిర్వివా దాంశం. అక్కడికి వెళ్ళి ఆర్థికంగా లబ్ధి పొందాలనుకోవడం మహాపాపం అన్నట్టు ప్రచారం చెయ్యడం మనకు తెలియని దాన్ని గురించి ఒక బూచిగా ఊహించుకోవడమే అవుతుంది. ముకుందం పొరబాట్లను హైలైట్ చేసినట్టే దొరబాబు బలహీన మన స్తత్వాన్ని కూడా రచయిత విమర్శించి, ఇంకొంచెం స్ట్రెస్ చేసుంటే ఈ నవల తండ్రు లకే కాక కొడుకులకి కూడా కరదీపంగా ఉండి ఉండేది. దురదృష్టవశాత్తూ అలా జర గలేదు.

-పి. కృష్ణకుమారి,
వరంగల్ - 506 007

## కరిమింగిన వెలగపళ్ళు

*(మూడవ బహుమతి రు. 50
పొందిన సమీక్ష)*

**కా**లంతో సమానంగా కన్న సంతానాన్ని పరుగులు తీయిస్తూ, వారి జీవితాల్ని నిర్దే శించే విధాతలుగా, వాళ్ళ తలరాతల్ని మార్చేసే అపర బ్రహ్మలుగా తయారవాల నుకుంటున్న తల్లిదండ్రులు ఎంతవరకూ కృతకృత్యులవుతున్నదీ, నిజానికి జీవితంలో ఏం కోల్పోతున్నదీ కళ్ళకు కట్టినట్లు చెప్పే నవల 'చతుర'లో వచ్చిన సింహప్రసాద్‌గారి డాలర్! డాలర్!

తన గుమాస్తా జీవితం క్షణక్షణం కల్గించే ఆత్మన్యూనతా భావాన్ని అధిగమించేందుకు కొడుకును ఒక సాధనంగా ఎన్నుకొన్న ముకుందంకి తన లక్ష్యసాధనకై కొడుకు బాల్యాన్నీ, భావాల్నీ పణంగా పెట్టి గమ్యాన్ని చేరినా, ఆ లక్ష్య ఫలం కరిమిం గిన వెలగపండయిపోయింది. అమెరికాను ఒక భూతలస్వర్గంగా, ఆదర్శంగా ఎన్నుకొన్న ముకుందంలాంటివాళ్ళు అమెరికన్లు సాధిం చిన విధంగా, అభ్యున్నతిని స్వదేశానికి మిగ లనివ్వటంలేదు సరికదా, సిరి అబ్బకపో యినా చీడ అబ్బుతుందన్న విధంగా





కుహనా సంస్కారంతో ఆత్మీయతల్ని, అను బంధాల్ని మిగలనివ్వక రోబోట్‌లలాగా తామే తయారుచేసిన సంతానానికి, స్వయం కృతాపరాధానికి శిక్షలా దూరమవుతున్నారు.

సుస్మితలాంటి స్నేహితురాలుండీ అమెరికాలాంటి డైనమిక్ సొసైటీలో మసలుతూ కూడా దొరబాబు తనదంటూ ఒక వ్యక్తిత్వం ఏర్పరచుకోకపోవడం కొంచెం ఎబ్బెట్టుగా ఉంది. అయితే పెళ్ళికి పూర్వం నాన్న నీడలోనూ, పెళ్ళయ్యాక భార్య నీడలోనూ జీవితం గడిపేసే దొరబాబులాంటి వెన్నెముక లేని వ్యక్తులు అరుదు కాదు. కానీ భర్త ఆత్మహత్య చేసుకొన్న విషయం అత్తమామలకు తెలియచెప్పని ఇంద్రాణి పాత్ర చిత్రీకరణ, తన లక్ష్యసాధన కోసం తండ్రి అంతిమ కోరికని తల్లి పోషణా బాధ్యతని తృణీకరించిన ముకుందం స్వార్థపరత్వానికి శిక్షగా సమర్థించుకోవాలేమో!

సమకాలీన సమాజంలోని ఈ కొత్త రుగ్మతకి మందులాంటి 'డాలర్! డాలర్' నవల కొంతమంది తల్లిదండ్రులనైనా ప్రభావితుల్ని చేసి ముకుందం బదులు రామారావులుగా మారిస్తే, సింహప్రసాద్‌గారి ప్రయత్నం సఫలమైనట్లే.

**–కె.వి. రమాకాంత్,**
విజయనగరం-535 202

## డబ్బే సర్వస్వం కాదు

***(నాలుగవ బహుమతి రు. 50 పొందిన సమీక్ష)***

**ఆ**ధునిక మానవుడు డబ్బు కోసం పెట్టే అందని పరుగులకు సింహప్రసాద్ నవల 'డాలర్... డాలర్' నిలువెత్తు దర్పణంగా నిలిచి ఆకట్టుకుంది. డబ్బు సంపాదించే యంత్రాలుగా పిల్లల్ని మార్చాలని, తమ కలల్ని, కోరికల్ని పిల్లల ద్వారా నిజం చేసుకోవాలని... డబ్బే సర్వస్వం అనుకుని ప్రేమరాహిత్యంలో బిడ్డల్ని పెంచే తల్లిదండ్రులకు... చివరకు పరిణామాలు ఎంత దయనీయంగా వుంటాయో కళ్ళకు కట్టినట్లు ఈ నవల చెప్పింది.

ఈ నవలలో ముకుందం తన కొడుకుని చదువునే తారకమంత్రంగా చేసుకుని "విద్యా తపస్సు" చేయమంటాడు. ఈవిధంగా చదువులో పుట్టి, చదువులోనే పెరిగి చివరికి చదువులోనే బలిఅవుతున్న ఎంతోమంది దొరబాబులు నిత్యం మనకు తారసపడుతూనే వుంటారు. డబ్బు వ్యామోహంలో పడిన ముకుందంలాంటి తండ్రులు పిల్లలు తమ చెప్పుచేతల్లోనే వుండాలనుకుంటారు. పిల్లల స్వంత అభిప్రాయాలకు, భావాలకు విలువ ఇవ్వరు. ఇటువంటి వాళ్ళకు కళలపట్ల సదభిప్రాయం వుండదు. జీవితసారాన్ని, జీవితసత్యాన్ని, జీవిత పరమార్థాన్ని బోధించే రామాయణ, మహాభారతాల్ని పుక్కిటి పురాణాలు గాను, కవితల్ని పిచ్చిరాతలుగానూ లెక్క కట్టిన ముకుందమే ఇందుకు నిలువెత్తు నిదర్శనం.

ఎలుక ఆహారంకోసం పాము పుట్టలో ప్రవేశించి ఆ పాముకే ఆహారమైనట్టు డబ్బుకోసం అమెరికా పుట్టలో చేరి డాలర్ "కట్లపాము" కాటుకు బలి అయ్యేది ఎందరెందరో! డాలర్ మన జీవితాల్ని చదునుచేస్తుందనుకుంటారే తప్ప... డాలర్ రోలర్ కిందపడి మన జీవితాలు నలిగి నుజ్జు నుజ్జు అయిపోతాయని భావించరు. ముకుందంలాంటి తండ్రులకు ఈ నవల హెచ్చరిక. ఈ నవల చదివి కొందరు తండ్రులు తప్పక మారతారనిపించింది. ఎందుకంటే రచనా విధానం అంత ఆకట్టుకునేలా వుంది. డబ్బు రంధిలోపడి చివరకు జీవితాల్ని దుఃఖమయం చేసుకుంటున్నవారికి ఈ నవల కనువిప్పు కాగలదు. మరికొంతమంది తండ్రులు ఆవిధంగా మారకుండా వుండటానికి దోహదకారి కాగలదు.

**–బి. విశ్వసౌజన్య**
హైదరాబాద్.

# అసలైన జీవితం?

**(అయిదవ బహుమతి రు. 50 పొందిన సమీక్ష)**

తమ సంతానం గొప్పవాళ్ళుగా ఎదగాలని, ఉజ్వల భవిష్యత్తుతో తారల్లా వెలిగిపోవాలనీ ఆ ఐశ్వర్యపు నీడలో తమ చరమజీవితం నిశ్చింతగా గడుపుతూ రాలిపోవాలని తల్లిదండ్రులు కోరుకోవడంలో తప్పులేదు. కాని ఆ కోరికే ఉన్మాదంగా మారి పిల్లల అభిరుచులను కాలరాచి, వారికి ఊబిమార్గాలను నిర్దేశించి ఉన్నత శిఖరాలనధిరోహించాలని తిరుగులేని శాసనం విధించే నియంతల్లా వ్యవహరించడం తప్పు.

"మార్గం సుగమం కాకపోతే ఫరవాలేదు మరొక మార్గం ద్వారా వెళుదురుగాని" అని సడలింపు ఇచ్చే తల్లిదండ్రులుంటే, ఆ పిల్లలు మానసిక వత్తిడికి లోనవకుండా ఆరోగ్యకరమైన ఎదుగుదలతో మేధాసంపన్నులవుతారు.

అయినా- దేశాన్ని ఉద్ధరించే మేధాతనం కన్నా, డాలర్లు సంపాదించే అర్హతే ముఖ్యమనుకొనే ముకుందం పాత్ర 'మనీ మైండెడ్' మనుషులకు ప్రతీక. డబ్బులోనే సర్వసుఖాలు ఇమిడివున్నాయనీ, ఈ ఆపేక్షలు, సెంటిమెంట్లు, రాగబంధాలు అన్నీ డబ్బుముందు బలాదూర్ అనీ దొరబాబుకు నూరిపోయడంలో ముకుందం తనకుతానే సాటి. అయితే అక్రమమార్గం ద్వారా సేకరించిన లీకేజి క్వశ్చను పేపర్లు ఇచ్చి రాయమన్న అతని ధోరణిని మినహాయిస్తే కొడుకు విద్యాప్రమాణాలు పెంచడానికి తండ్రిగా ముకుందం కల్పించిన వాతావరణం, తీసుకునే జాగ్రత్తలు, సంకల్ప సిద్ధి కోసం అతడు చేసిన త్యాగాలు అభినందనీయమే.

యుగధర్మాన్ని బట్టి వ్యవస్థలు మారివుండచ్చుగానీ, మానవసంబంధాలు మారలేదనే సత్యాన్ని ముకుందం తెలుసుకొనేటప్పటికే పరిస్థితి అతని చేయిదాటిపోవడం అతని దురదృష్టం. కన్నబిడ్డ కోసం పార్వతి పడేతపన, ఆవేదన, కడుపుకోత పాఠకులను కంటతడి పెట్టిస్తుంది.

రామారావు, సరస్వతి దంపతులు పిల్లల మనసెరిగి వెన్నుతట్టి ప్రోత్సహించే ఆదర్శ తల్లిదండ్రులుగా, యవ్వనదశలో పిల్లల భావావేశాల్ని పంచుకునే మంచి స్నేహితుల్లా సందేశాత్మక పాత్రలుగా రాణించారు. మంచి స్నేహితురాలిగా, చక్కటి వ్యక్తిత్వం గల ఆదర్శయువతిగా, మానవత్వం గల మమతామూర్తిగా సుస్మిత ఈ నవలలో కీలకపాత్ర వహించి మెప్పించింది.

నాన్నమ్మ, తాతయ్యల బుద్ధి, సుద్దులతో కూడిన కాలక్షేపం కబుర్ల సమయాన్ని టెలివిజన్ తెరలు మింగేస్తుంటే, అమ్మా, నాన్నల ముద్దు మురిపాలతోకూడిన తొలిగురువు స్థానం- పోటీపరీక్షల పుస్తకాలు ఆక్రమించేస్తుంటే, స్నేహసౌభ్రాతృత్వాలతో చేయి, చేయి కలిపి ప్రగతిమార్గం వైపు నడవవలసిన యువతరం కంప్యూటర్ కీబోర్డ్ ముందు ప్రాణమున్న బొమ్మలవుతూంటే, వారి నాడులు హైటెక్, హైటెక్ అని కొట్టుకొంటున్నాయి. వారి గుండెలు లబ్ డబ్ బదులు లాభం- డబ్బు అంటూ డాలర్ల కలలపంటను నిజం చేసుకొనేందుకు ఆత్రంగా కొట్టుకొంటూంటే 'అసలైన జీవితం' గమనానికి, గమ్యానికి మధ్య అర్థం, పరమార్థం లేక అగమ్యగోచరమవుతోంది.

**–బడబాగ్ని అరుణకుమారి**
గజపతినగరం-535 270

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942. Nellore: 331250.



బాలకృష్ణుడు - మైసూరీ పెయింటింగ్

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78